ఆంధ్రవిజ్ఞానప్రచారగ్రంథము ౧.

# అపూర్వప్రతిభ.

ప్రథమభాగము.

ఇది

కొచ్చెర్లకోట రామచంద్ర వేంకటకృష్ణారావు బి.ఏ. గారిచే

రచియింపఁబడి

చాలికాని అప్పారావుగారిచే

సంపాదింపఁబడి

ఐరోపామహాసంగ్రామసంధి (28-6-19) జ్ఞాపకార్థము

ప్రకటింపఁబడినది.



Title Printing only V. M. P.

1919.

గా హిందూదేశపుమంత్రి మాంటాగుగారిని, ప్రతినిధి ఛేమ్సుఫర్డుప్రభువును చెన్నపురియందు సందర్శించి విజ్ఞాపనపత్రిక సమర్పింపఁ గలుసుకొన్నప్పుడు ఆయన జమీందారుననుటకు తేక పరిచితులయెడ గనుపఱచిన యనురాగము, ఆదరణబుద్ధి, నిష్కాపట్యము, నిగర్వము నాకెంతయో సంతసము గలుగఁజేసె. ధనము శాశ్వతంబా! తనువు నిత్యమా! మఱల (23-6-18 సం॥న) ఐదవఆంధ్ర దేశగ్రంథాలయప్రతినిధుల మహాసభయందు విశాఖపట్టణంబునఁగలుసుకొంటిని. ఇదియే కడసారిచూపు. అప్పుడు ఆయన అనారోగ్యస్థితిలోనుండియు భాషా విషయమై పట్టుదలతో నుపన్యసించుటయే ఆయనకు భాషాభిమాన మెంతవఱకు గలదో చదువరు లూహించుకొనగలరు. ఈయన పెక్కుగ్రంథంబులు రచించియు రచింపించియు భాషాపోషకు నెంతో మేలొనరించిరి. ఈయనపే రెఱుంగని యాంధ్రభాషాభిమాని యుండడు. ఈయనఅకాలమృత్యువలన దేశభాషకుఁ గొంతలోటు వాటిల్లినదని చెప్పక తప్పదు. భగవంతుఁ డీయనయాత్మకు శాంతినొసంగుఁగాక.

చిత్రాడ.
6—6—19.

ఇట్లు
చెలికాని లచ్చారావు.

శ్రీరస్తు.

# అపూర్వప్రతిభ.

## మొదటి ప్రకరణము.

ఉత్తమచారిత్రులును, సద్గుణగరిష్ఠులును, సదాచారప్రవర్తకులును, పరోపకారదీక్షాపరతంత్రులును, నగుపుణ్యపురుషు లగుమహామహులు గతించినను వారు కీర్తికాయులై చిరకాలము మృతజీవులుగా నుందురుగదా! లోకనాథమొదలియారుగారును వారిస్నేహితులును దమసాహసౌదార్యసద్గుణసంపత్తినిఁ బట్టియుఁ దాము చేసిన నిష్కపటమైన పరోపకారకార్యములను బట్టియు జనులపొగడ్తలకుఁ బాత్రులై మృతజీవులై యాచంద్రతారార్కముగ నుందురనుటకుసందియములేదు. మనుష్యుఁడు ప్రపంచమున జీవించుకాలము పరిమితికలదియే యైననుఁ దానుచేసిన సత్కార్యములను బట్టి చిరకాలము జనుల యంతరంగముల జీవించియుండవచ్చును. లోకనాథమొదలియారుగా రెవరో మన మెఱుఁగకపోయినను వారిని మనమెన్నఁడును జూచియుండకపోయినను వారుచేసిన మహత్కార్యములను బట్టి వారియొక్కయు వారిస్నేహితులయొక్కయు సచ్చారిత్రములను పుణ్యకథలనుబట్టియు వారిని మనము గౌరవపూర్వకముగ జ్ఞాపక ముంచుకొని శ్లాఘింపవలసియున్నది.

కథానాయకులలో నగ్రగణ్యుఁ డగునీలోకనాథమొదలియారుగారు తామువ్రాసిన దినచర్యనుబట్టియుఁ దమచరిత్రమునుబట్టియుఁ దాదాపు ఏఁబదిసంవత్సరముల వయసుకలవాఁ డని నిశ్చయింపవచ్చును. ఈయనతండ్రిపేరు అమృతలింగమొదలియారు. ఈయన చెన్నపట్టణములోఁ జిరకాలము గొప్పవర్తకుఁడుగా నుండి యనేకసత్కార్యములను జేసి కీర్తిఁగాంచి విశేషము

గా ద్రవ్యమార్జించి పరలోకగతుఁ డాయెను. అప్పులింగ మొదలియారు తనపుత్రుఁడైనలోకనాథమునకు విద్యనేర్పించి యతఁడు పెద్దపరీక్షలు ప్యాసయి గొప్పయుద్యోగమును జేయుచుండఁ జూడవలయునని యత్యాసక్తితో నాతనికి విద్యాబుద్ధులు చెప్పించెను. కాని లోకనాథము చిన్నప్పటినుండియు నాటపాటలయందుఁ దనకాలమంతయు వ్యర్థపఱచి తనతండ్రి యభీప్సితము తీరునట్లు పరీక్షలయందుఁ గృతార్థుఁడు కాకపోయెను. గొప్ప గారవకుటుంబమున జన్మించి తండ్రిగారాజ్ఞకు లోఁబడినవాఁ డగుటచే దుర్గుణములను మాత్రము పొందలేదు. తనకుమారుని విద్యాధికునిఁ జేయవలయు నను తండ్రి పట్టుదలచేతను చిరకాలాభ్యాసముచేతను లోకనాథమిరువది సంవత్సరముల వయసువచ్చునప్పటికి మెట్రిక్యులేషన్ పరీక్ష మాత్రము ప్యాసాయెను. తరువాతఁ దండ్రి తనకుమారుని కీదేశమున విద్యగఱపించినయెడలఁ జాలసంవత్సరములకుఁ గాని బి. యే. పరీక్ష ప్యాసుకాఁజాలఁడని యెంచి త్వరలో నాతని నొకకలెక్టరుగాఁ జూడవలయు ననుకుతూహలముతో లోకనాథమును నింగ్లాండుదేశమునకుఁ బంపి విద్యనేర్పించెను. లోకనాథ మింగ్లాండుదేశమునకుఁ బోయి తనతండ్రిపంపున నాతనిపూర్వపరిచితుఁ డగు నొక గొప్పగృహస్థుని యింట బసదిగి కలెక్టరుపరీక్షకుఁ జదువనారంభించెను.

లోకనాథము మేధావంతుఁడు కాఁడు. ఇంగ్లాండుదేశములో నితఁడు విద్యగఱచుచున్నప్పుడు తనతండ్రి కావలసినద్రవ్య మంపుచువచ్చుచుండుటచే మిక్కిలి సౌఖ్యముగాఁ గాలముఁ గడపుచు నితరదేశములకుఁబోయి యచ్చటి చిత్రములనెల్లఁ గాంచుచు గొప్పవారిస్నేహము సంపాదించుచుండెను. ఇతఁడు మేధాశాలియు సూక్ష్మబుద్ధియుఁ గాకపోవుటఁబట్టియు, స్వభావముచే శరీరశ్రమ కోర్వఁజాలని సుకుమారుఁడగుటచేతను నంతగాశ్రమపడి విద్యాభ్యాసము చేయకపోవుటచేతను దనతండ్రి మనోవాంఛితముఁ దీరఁ గలెక్టరుపరీక్షయందుఁ గృతార్థుఁడు గాఁజాలక బారిస్టరుపరీక్షనుమాత్రము ప్యాసాయెను. లోకనాథము శరీరదార్ఢ్యమును చక్కని జఠరపుష్టితోఁగూడిన యారో

గ్యమును కలవాఁడగుటచే విశేషముగా విద్యాభ్యాసమక్కఱలేకయే సులభముగాఁ గృతార్థతనొందఁగల పరీక్షయని జనులనుకొను నీబాహ్యపరీక్షను వ్యాసుకొఁగలిగి యూరోపుఖండమునందలి దేశములన్నిటిని యమెరికా దేశమును తిరిగి మరల యింటికి వచ్చెను. తరువాత కొన్నిమాసములకు వానితలింగ మొదలియారు పరమపదమునొందెను. తండ్రి పోయిన కొన్ని మాసములవఱకు లోకనాథము తన స్వంతవ్యవహారమునే చక్కఁజేసికొనుచుఁ దనతండ్రి వ్రాసిన మరణశాసనమును బట్టి తనయక్కచెల్లెండ్రకును సమీపబంధువులకును నిచ్చివేయవలసినదంతయు నిచ్చివేసి న్యాయవాదిగా నుండనెంచి కోర్టునకుఁ బోవుచుండెను. ఇతఁడు స్వభావముచే మిక్కిలి యమాయికుఁడు. పాపభీతికలవాఁడు. పరోపకారమునకు వెనుదీయని స్వభావము కలవాఁడగుటచేతను అపారమయిన దయగల యంతఃకరణము కలవాఁడు. మరియు స్నేహితుల యెడలను బంధువుల పట్లను బరిచితుల యెడలను మిక్కిలి దయయు దాక్షిణ్యము కలవాఁడు. ఇంతియకాక జనానురంజనముగఁ బదిమందిలో నాత్మగౌరవము నిలిపికొనుచుఁ దిరుగుచు దేశాభిమానమానసుఁడై పరోపకారము కొఱకెట్టికార్యమైనను వెనుదీయక చేయ సమకట్టువాఁడు. మరియు వస్తుతత్త్వమును గ్రహించి యెంతటి యల్పకార్యమైనను మిక్కిలి శ్రద్ధతోఁ ద్రికరణశుద్ధిగాఁ జేయవలయునను సదుద్దేశము కలవాఁడు. ఇతనికి ధనలోభమెన్నఁడును లేదు. తనతండ్రి గడించిపెట్టిన ధనము పాడుచేయక యభివృద్ధిపఱచుకొనుచు మిక్కిలి గౌరవముగాఁ గాలక్షేపము చేయుచుండెను. ధనమార్జింపవలసిన యవసరమితనికి లేకపోయినను నుద్యోగము పురుషలక్షణమని యెంచి న్యాయస్థానమునకుఁ బోవుచుఁ గొంతకాలమయిన తరువాత యితరులచే గౌరవపురస్సరముగ నాహ్వానింపఁబడకుండ నయాచితముగ నెక్కడకును బోఁగూడదనియు నాత్మగౌరవమును కాపాడుకొనుటకదె ప్రథమసూత్రము ముఖ్యమనియుఁ జక్కఁగ గ్రహించినవాఁడగుటచే లోకనాథము నెన్నఁడుఁ బిలువఁబడకుండ న్యాయస్థానమునకుఁ బోఁగూడదని నిశ్చయించుకొని తనయింటనే యుం

డెను. పశ్చిమఖండమునకుఁ బోయి యచ్చట చాలకాలముండి వచ్చినవాఁడగుటచేఁ దాను మిక్కిలి ప్రజ్ఞావంతుఁడననియు, ననుభవశాలిననియుఁ దెలిసినవాఁడననియు నను మనోగర్వమితనికి లేకపోలేదు. తనయూరజరుగు నన్నికార్యములయందునుఁ బ్రతిసమాజమున లోకోపకారార్థము జరుగు నన్నిపనులయందును నితఁడు జోక్యముకలుగఁజేసికొనుచు మిక్కిలి పాటుపడి పనిచేయుచుఁ బరార్థప్రాపకుఁడై స్నేహపాత్రుఁడై కాలము గడుపుచుండెను. ఇతఁడు మిక్కిలి మంచిస్వభావముకలవాఁడగుటచే నాయూరివారందరు నితనికి స్నేహితులేయని వేరే చెప్పనవసరములేదు. కొందఱుమాత్రము బారిష్టరు మొదలియారమాయికుఁడనియు లోకజ్ఞానమెఱుఁగనివాఁడనియుఁ దలఁచుచుండిరికాని యితఁడు సదుద్దేశముకల పరోపకారియగుటచే నితనినెఱిఁగినవారందఱు గౌరవించుచునే యుండిరి. ఇతఁడు తన యాత్మగౌరవమును నిలబెట్టుకొననెంచి తనయింటనె యుండి యితరకార్యములయందుఁ గాలమంతయుఁ గడపకుండుటచేఁ దానభ్యసించిన న్యాయశాస్త్రమును క్రమక్రమముగ మఱచిపోయి వయస్సుచేతను శరీరలాఘవము నానాటికిఁ దగ్గిపోవుటచేతను విద్యనభ్యసించుచున్నప్పుడితఁడు నేర్చుకొనిన కొన్నియలవాటులనుపట్టియుఁ గొంతకాలమునకు శరీరస్వాస్థ్యమును బుద్ధిబలమును క్షీణింప న్యాయస్థానమునకు బోవుటయే మానుకొని బారిష్టరుపదవిశిష్టుఁడై యుండెను.

ఇట్లు లోకనాథమొదలియారుగారు న్యాయస్థానములకుఁ బోయి పనిచేయుట మానుకొనినను పరోపకారబుద్ధి గలవాఁడు గావున దేశక్షేమముకొఱకును, సంఘసంస్కారముకొఱకును, దేశాభివృద్ధికొఱకును మిక్కిలి పాటుపడి పనిచేయుచు నాయూరనున్న యన్నిసమాజములలోను, అన్నివిషయములలోను, అన్నివ్యవహారములలోను ముఖ్యుఁడుగాఁ బ్రవర్తించుచు గాలము గడపుచుండెను. ఇతఁడు స్వభావముచేఁ బ్రతికార్యమునుగూర్చియు మిక్కిలి దూరాలోచనముచేసి యందలి సాధకబాధకములను జక్కగాఁ బరిశీలించువాఁడు. కాని యమాయికస్వభావము గలవాడగుటచేతను బరోపకారమన్న

ను దేశక్షేమమన్నను నించుకయిన వెనుదీయక యెంతకష్టమునకైన నొడిగట్టి యతినిర్భయముగా మిక్కిలి సాహసములోఁ బనిచేయఁ గంకణముకట్టుకొని కార్యాచరణదీక్షతో శక్తివంచన యించుకయిన లేకుండఁ బ్రవర్తించుచు ససహాయశూరుఁడని యాతని విరోధులుగూడ నొప్పుకొనకతీరదు. మఱియు నాయూరనున్న సమాజములు, సంఘములును, అప్పుడప్పుడచ్చటను యితరస్థలములయందును జరుగు సభలును బరస్పరభేదములుగను బరస్పరవిరోధోద్దేశములు గలవిగను గనుపించినను అవియన్నియు దేశక్షేమముకొఱకును, సంఘాభివృద్ధికొఱకును ధర్మసంస్థాపనముకొఱకును నుద్దేశింపఁబడిన మూలకారణమును జక్కఁగా గ్రహించి యుచితానుచితమును బరిశీలింపఁగల కార్యవాదియగు నీ సత్పురుషుఁడు దనకుఁ దోచినరీతిని వాటినన్నిటి యందునుజేరి యలంకరించుచుఁ దనసామర్థ్యమును అనుభవజ్ఞానమును గ్రహించి యాసమాజికులును సభాసదులును దన సలహాల నామోదించి యంగీకరింపకపోయినను దాను చెప్పు విషయములను గూర్చి యితరులేమనుకొన్నను పాటింపకఁ దానుచేయవలసిన హితోపదేశమును నిర్భయముగాఁ జేసితినన్న సంతుష్టిగల యంతరాత్మతో నతఁడానందించుచు నింటికి వచ్చుచుండును. ఇంతియగాక నితఁడు సర్వజనసమ్మతుఁడుగా నుండవలయుననియు నందఱిచే స్నేహభావముతో గౌరవింపఁబడవలయుననియుఁ గోరికగలవాఁడు. కావున నెప్పటి వాదప్రతివాదముల నప్పుడే మఱచిపోయి తనమనసు నాయాసపెట్టుకొనకఁ బ్రవర్తించుచుండెను.

లోకనాథమొదలియారు ఆకారమున గొంచెము పొట్టిగాను స్థూలముగాను చామనచాయగాను నుండును. నలుబదియేండ్లకు మీరినవయసు గలిగి యుండుటచేతను దేహపరిశ్రమమునందు గాలము వృథపుచ్చని స్వభావముగలవాఁడగుటచేతను భోజనప్రీతి మిక్కిలి గలవాఁడగుటఁబట్టియు నీతని జీర్ణకోశముయొక్క విశేషము ప్రకటీకృతముగా నుండఁజేయుటకో యన నీతనికడుపు సామాన్యముగా మనమెఱిగిన పెద్దకడుపులకంటెఁ బెద్దదిగాఁ గనుపించకమానదు. ఇతఁడు బంగారుతీగతోఁ గట్టఁబడిన సులోచనములను నల్లని పట్టుదార

మునగక్షి మెడలోవేసికొని యావశ్యకమైనప్పుడును దనకుఁ దోఁచినప్పుడును ధరించుచుండెను. బూట్సు, ట్రౌజర్సు పెద్దకోటు తొడుగుకొని యింగ్లాండుదేశమునుండి వచ్చినతరువాతఁ గొంతకాలమువఱకును దొరలటోపీని ధరించి తరువాత నేకారణముచేతనో టోపీ వదలివేసి తలపాగాతోఁ దిరుగుచుండెను. ఎప్పుడు చూచినను దనవేషమును విడువక "తనవేషంబుఁ దనుదానఁ బొగడుకొనమి, నొచ్చియును గెడుపలుకమి యిచ్చి పగవనికి దనకెంత నపకారయున్న బఘము దప్పకుండుట నడువడి యొప్పఁజేయు" నను భారతనీతి యందలి యంతరార్థమును జక్కఁగా నెఱిఁగి సంచరించుచుండెను. మఱియు నితనికి స్వభావముచేత మాటలాడునప్పుడు తొనుముగఁ గొంచెము నత్తియున్నది. ఆనత్తివలనఁ దాను జెప్పఁదలఁచుకొన్న విషయమును మిక్కిలి యాలస్యముగాఁగాని చెప్పనేరకపోవుటయు వినువారికి విస్పష్టముగా దెలియునట్లు మాటలాడజాలకపోవుటయుఁ దటస్థించుచుండుటచే నితఁడు మాటలాడునప్పుడు వినువారికంత ఆహ్లాదకరముగా నుండదని చెప్పుటకుమాత్ర మంతకీలుగానుండదు. కాని యితని హృదయధర్మమును బట్టి యితఁడాడు మాటలు విస్పష్టముగా నితరులకుఁ దెలిసినను దెలియకపోయినను నితఁడు సదుద్దేశములవాఁడని యందఱు గ్రహించుచుండిరి. ఇతఁడు స్నేహపాత్రుఁడగుటచే జనులను సులభసాధ్యుఁడై తన పరిచితులమొదలను స్నేహితులమొదలను ననుకూలభావముతోఁ బ్రవర్తించుచుండెను. ఇతని స్నేహితులలోఁ గస్తూరిశెట్టిగారును రంగనాథపిళ్ళగారును దిరుమలస్వామినాయుఁడుగారును ముఖ్యులు. ఈముగ్గురును మొదలియారుగారియందలి గౌరవ మింతింతని చెప్పవలనుకాదు. మొదలియారుగారును వారియందత్యంత ప్రేమానురాగము కలిగి వారిని తనకు ముఖ్యులైన యాప్తులుగ గణించుచుండెను. ఇట్లు వీరు నలుగురును అన్యోన్యమయిన భక్తియు విశ్వాసమును గౌరవమును నమ్మకమును కలిగి ప్రవర్తించుచుఁ బ్రతిదినమును గలసికొని తమతమ యభిప్రాయములను గురించి మాట్లాడుచు విశేషాంశములను చర్చించుచు నేకమనస్సుతో మెలఁగు

చుండిరి. మొదలియారుగారికిని నాతనిస్నేహితులకును ముఖ్యముగాఁ దేశాభిమా నమానశీలురై యేకబుద్ధితో సంచరించుచుఁ 'సమానశీలవ్యసనేషుసఖ్యం' మను న్యాయమును జగద్విదితముచేసిరి.

కస్తూరిశాస్త్రిగారు మిక్కిలి భాగ్యవంతుఁడు. ఈయనతండ్రిగారగు గోవిందశాస్త్రిగారు కొన్ని సంవత్సరములు దొరతనమువారి తరఫున నొక గొప్ప యుద్యోగముచేసి విశేషద్రవ్యమార్జించి యొక లంచపుకేసులో నుద్యోగభ్రష్టుఁడయ్యెను. గోవిందశాస్త్రిగారు వ్యవహారతంత్రమును చక్కఁగ నెఱింగిన ప్రయోజకుఁడు కావున నచిరకాలములోపలనే యొక గొప్పసంస్థానమునకు దివానుగా నియమింపఁబడెను. తరువాత నొక సంస్థానమును మాని మఱియొక సంస్థానమునకు దివానుగా నియమింపఁబడుచు నైదారుజమీందారీ సంస్థానములను బాగుచేసి కొన్నిగ్రామములను ననేకముగా భూములను విశేషముగా ధనమును సంపాదించెను. తనకుమారునకు విద్యనేర్పించి గొప్పపరీక్షలను ప్యాసుచేయించి గొప్పయుద్యోగమును చేయింపవలయునను కోర్కెతో నతనికి విశేషద్రవ్యమును కర్చుపెట్టి చెన్నపట్టణమున విద్యాభ్యాసము జేయించెను. కస్తూరిశాస్త్రి చిన్నతనమునుండియు సంగీతమునను శౌకీసుకొనువాఁడు. తన తండ్రి జమీందారీసంస్థానములలో నుద్యోగముసేయుచున్నప్పుడు కవీశ్వరుల యొక్కయుఁ బండితులయొక్కయు సంగీతపాటకులయొక్కయు పరిచయమితనికి నెక్కువగఁ గలుగుటకవకాశము కలిగి యితనికి సంగీతమన్నను గవిత్వమన్నను వైద్యమన్నను సాహిత్యమన్నను మిక్కిలి ప్రీతికరముగా నుండెను. ఇట్లు నానాటికీతనికందు నభిరుచి మిక్కుటమై సహవాసమువల్లను బరిచయమువల్లను వానియందు నతనికిఁ గొంత శ్రుతపాండిత్యము చేకూరెను. కస్తూరిశాస్త్రికి వీనియందభిరుచి వృద్ధియైనకొలఁది చదువు సన్నగిల్లిపోయెను. సంగీతము వినుట కవులస్నేహము సంపాదించుట పండితులతో గోష్ఠిసలుపుట వైద్యుల సహవాసముసేయుట మొదలగు పనులలోఁ దనకాలమునందుఁ జాల భాగము గడుపుచు స్కూలుకుఁబోవుటకూడ క్రమక్రమముగ నశ్రద్ధచేయుచు

వచ్చెను. ఇట్లు కొంతకాలము గడచినతరువాత కస్తూరిశెట్టికి పదునెనిమిది సంవత్సరములు వచ్చునప్పటికతని తండ్రిగతించెను. తరువాత నతఁడు యింగ్లీషు విద్యాభ్యాసము ముగించెను. ఏపరీక్షయుఁ బ్యాసుకాకపోయినను కస్తూరిశెట్టి యింగ్లీషుమాత్రము ధారాళముగా మాట్లాడకలఁడు. తనకుగల యభిరుచిచే సంగీతమభ్యసించుచుఁ గవిత్వము చెప్పవలయునను నుత్సాహముతోఁ బద్యములు చెప్పఁ బ్రయత్నించుచు గాయకులతోడను కవులతోడను వైద్యులతోడను సంతోషకరముగాఁ గాలము గడుపుచుండెను. ఇతఁడు 'వాణిజ్యేవసతేలక్ష్మీః' యను వచనమును గ్రహించి వర్తకమారంభించి యందుఁ గొంత ద్రవ్యమును గోల్పోయి ధనికులను వర్తకవ్యాపారము తగదని స్వానుభవము వలనఁ దెలిసికొని వ్యాపారము కట్టిపెట్టి చెన్నపట్టణములో యథేచ్ఛగాఁ గాలము గడుపుచుండెను. మొదలియారుగారి సహవాసమలవడినతరువాత యాతని కార్యశూరత్వమునకు సంతసించుచు నాతని యభిప్రాయములతో నేకీభవించి సంచరించుచు నించుకేని వెనుదీయ కతనికిసహాయము సేయుచుండెను.

రంగనాథపిళ్ళగారు! మిక్కిలి గౌరవమైన వంశమున జన్మించినవాఁడు. ఇతనితండ్రిపేరు వైద్యనాథపిళ్ళ. ఈయన మదరాసు హైకోర్టులో న్యాయవాదిగానుండి మిక్కిలి సమర్థుఁడని ప్రసిద్ధిగాంచెను. రంగనాథపిళ్ళ ఎఫ్. యే. క్లాసులోఁ జదువుచుండగా వైద్యనాథపిళ్ళ కాలధర్మమునొందెను. తరువాత నితఁడు చదువుమానివేసి తనతండ్రి సంపాదించిన ద్రవ్యమును కాపాడుకొనుచు ధనమార్జించుటకుఁ దాను విద్యాభ్యాసము చేయవలసిన యవసరము లేదనియు సంతుష్టి సౌఖ్యదాయకము కావునఁ దనతండ్రి తనకిచ్చిపోయిన ద్రవ్యము తనకుఁ జాలును కావున తాను శ్రమపడి ధనము సంపాదించుట నావశ్యకమనియుఁ బ్రపంచానుభవమును వ్యవహారజ్ఞానమునకై కావలసినవిద్య యిదివఱకే సంపాదించితిననియుఁ దలఁచి స్వేచ్ఛగాఁ గాలముఁ గడుపుచుండెను. ఇతఁడు మొదలియారుగారికిని శెట్టిగారికిని ముఖ్యస్నేహితుఁడు. ఈయనకు సంగీతమందును నభినయశాస్త్రమందును మిక్కిలి యభిరుచికలదు.

తిరుమంగయాళ్వారునాయుఁడుగా రొక గొప్పసచ్ఛూద్రకులమున జన్మించినవాఁడు. ఈయన తండ్రిపేరు సంపెంగనాయుఁడుగారు. ఈయన దొరతనమువారితరఫున గొప్పగొప్పయుద్యోగములు సేసి మిక్కిలి గౌరవమును ధనమును సంపాదించెను. తిరుమంగయాళ్వారునాయుఁడుగారు బి. యే. పరీక్ష ప్యాసుచేసినవారు. తనతండ్రి ప్రోత్సాహమున నుద్యోగములోఁ బ్రవేశించి యుద్యోగము చేయుట కిష్టము లేకపోయినను దనతండ్రి కాగ్రహము వచ్చునని తలఁచి కొంచెము కాలముఁ గడపి తరువాత కొంతకాలమునకుఁ దండ్రి కాలధర్మము నొందిన క్షణమందే యుద్యోగము మానుకొని చెన్నపట్టనముననే నివసించుచుండెను. ఈయన కిరువదియెనిమిది సంవత్సరముల వయసుండును. ఈయనకు గుఱ్ఱపుసవారీచేయుట, సాముచేయుట, క్రికెటు, టెన్నిసు, బిలియర్డ్సు ఆటలాడుట మొదలగు వ్యాయామ క్రీడలయందు మిక్కిలి యభిరుచి. ఈయన యాకారమునందుఁ గొంచెము పొడవుగాను నెఱ్ఱగను గనిపించును. ఈయన యుద్యోగమును మాని చెన్నపట్టణమునఁ బ్రవేశించిన కొంతకాలమునకు గుఱ్ఱమెక్కుట మొదలగు వ్యాయామక్రీడలయందుఁ గాలము వృథపుచ్చక శరీర మాయాసపెట్టుకొనకయే తనకు దానియందున్న యభిమానాభిరుచులను, గుఱ్ఱపుపందెములను నితరులు సల్పు వ్యాయామక్రీడలను చూచుటచేతనే సంతుష్టిపఱచుకొనుచుండెను. మఱియు నితనికి సౌందర్యవంతుఁడ ననుమనోగర్వము మాత్రము మిక్కిలిగా నుండెను. కాని విద్యాధికుఁడును బుద్ధిమంతుఁడును నగుటచే నామనోగర్వమును సాధ్యమగునంతవఱకు వ్యక్తపఱచకుండ సంచరించుటకుఁ బ్రయత్నము సల్పుచుండెను. ఆప్రయత్న మెంతవఱకుఁ గొనసాఁగుచుండెనో మనము చెప్పలేము. ఈయన కేండ్లు గడచినకొలఁది యౌవనదశ ప్రకటింపవలయునను కోర్కెయధికము కాఁజొచ్చెను. అందువలనఁ బ్రతిదినము మూఁడునాలుగుగంటలు మీసములకును జుట్టునకును రంగువేయుట మొగము దిద్దుకొనుట మొదలగుకార్యములయందుఁ గాలము గడుపుచుండెను. ఈయనకూడ మొదలియారుగారి

యెడల మిక్కిలి యభిమానమును గౌరవ విశ్వాసములును గలవాఁడు. ఈనలువురును గాలక్రమమున మిక్కిలి స్నేహానురాగములు గలిగి సంచరించుచు నొకరికొకరు సాహాయ్యముఁ జేసికొనుచు నొక్కమాటాడుచు నొకమార్గము నవలంబించుచు భిన్నాభిప్రాయము లించుకయు లేక యుండిరి. ఇందులో శెట్టిగారును నాయుఁడుగారును వైష్ణవమతస్థులును, మొదలియారుగారునుఁ బిళ్ళగారును శైవమతస్థులును, అయినను నొండొరులయెడ మతాభిమానము మతద్వేషము గూడ నించుకయేని లేక సంచరించుచుండిరి. వీరు దేశాభిమానమాననీయులనియుఁ బరోపకారదీక్షాపరతంత్రులనియుఁ గార్యశూరులనియు మఱల చెప్పనవసరములేదు. సహవాసమాహాత్మ్య మిట్టిదని చెప్ప నలవికాదు. సుగుణములేని దుర్గుణములేని సహవాసముననే కదా! పట్టుపడును. వేయేల! ఒకఁడు నవ్వుచున్నచోఁ జూచినవారికందఱికిఁ గాకపోయిననుఁ గొందఱికేని నవ్వురాకపోదు. ఒకఁడేడ్చుచుండ వినినవారిలోఁ గొందఱికైనను నదేవిధమున విచారము పుట్టకమానదు. కావున జనులు వేఱువేఱుగానున్నను నందుఁ గొందఱైనను నంతరంగములు గలసినవారై యుందురు. ఆరుమాసములు సహవాసముచేసిన నతఁడితఁడగునను లోకోక్తి మనము వినుచునే యున్నాము. కాఁబట్టి యీనలుగురును బ్రథమమునుండియు మిక్కిలి స్నేహభావముతో సంచరించుచుండుటచే నేకాభిప్రాయముకలవారై యుండిరి. సదుద్దేశముతో దేశాభివృద్ధికొఱకు పాటుపడి పనిచేయుచు వీరునలుగురును కార్యశూరులయి యుండిరి. దేశాభిమానులమని పేరుపెట్టుకొని పెద్దపెద్దమాటలు చెప్పుచుఁ గార్యమువచ్చినప్పుడు వెనుకకు దిరుగు మహానుభావులవలెను సభలలో నుద్ఘోషించి యుపన్యాసముల నిచ్చి ధర్మదేవతలమని చెప్పుకొని నటించు వేషధారులవలెను గాక వీనలుగురును యెట్టికష్టములకైన వెనుదీయకఁ దమ కార్యాచరణదీక్షయు దేశాభిమానపరతంత్రతయుఁ బనిచేసి జగద్విదితముచేయఁ గంకణముఁగట్టికొనిరి. మనదేశములో స్థాపింపఁబడి నామావశిష్టములైనట్టియు, జీర్ణించి ప్రాణావశిష్టములైనట్టియు, సజీవములై మిగిలియున్నట్టి

యు సమాజము లన్నియుఁ బ్రథమమున సదుద్దేశముతోఁ గార్యాచరణదీ
క్షాపరతంత్రతతో స్థాపింపఁబడి కార్యారంభముఁ జేసినను దుద కొక్కటియై
న సంతుష్టికరముగను, తృప్తికరముగను బనిచేయఁగలిగినవి లేకపోవుటకు మొద
లియారుగారును ఆయనస్నేహితులును వగచుచు నందులకుఁ గారణముఁ దెలి
సికొనఁగోరి యాలోచించుచుఁ జర్చించుచుండిరని, వీరునలుగురును గలిసి చేసి
న ఘనకార్యములను గూర్చి వీరువ్రాసికొనిన దినచర్యలను బట్టియు లాంతికాగి
తములనుబట్టియు మనము దెలిసికొనఁగలిగినారము. ప్రపంచములోఁ బ్రతి
పురుషునకును దాను మహాప్రజ్ఞావంతుఁడననియుఁ గార్యనిర్వాహకుఁడననియుఁ
గొంచెము గర్వమంతరంగమున నొకప్పుడుగాకపోయిన మఱియొకప్పుడైన నం
కురింపక మానదు. కాఁబట్టి యీమొదలియారుగారికిని వారిస్నేహితులకునుఁ దా
ము న్యాయమార్గానువర్తులమనియు, దేశోపకారదీక్షాపరతంత్రులమనియు
సత్కార్యశూరులమనియు సద్వంశమున గౌరవకుటుంబములయందు జన్మించి
న మర్యాదస్థులమనియు నంతరంగమున గర్వముగలిగియుండిరి. వీరునలువురు
ను ధనవంతులని యిదివఱకే చెప్పియున్నాను. వీరు స్నేహపాత్రులని గూడ
చదువరులు గ్రహించియేయుందురు. వీరు చెన్నపట్టణమునఁ దమ చిన్నతన
మునుండియు నివసించియుండుటచే నొండొరులను బిన్ననాటనుండియు నెఱిఁ
గియేయున్నారు. వీరు జాతిమతద్వేషములుగాని, తమవారు నన్యులనను భేద
బుద్ధిగాని, అసూయ, మత్సరము, అసహనము మొదలగు దుర్గుణములు గాని లేని
వారు. "ఆత్మవిజ్ఞానము, దమంబు, నాత్మగౌరవంబు నీగుణత్రితయంబుఁ బ్రా
ణికోటిఁ, దివ్యసామ్రాజ్యపదవి నందించు గాన, గడనసేయంగదగు వానిఁగార్య
మతులు" అని మహాభాగతమునఁ జెప్పఁబడిన నీతివచనమును వీరు జక్కఁగా గ్ర
హించి తమతమ యాత్మగౌరవమును గాపాడుకొనవలయునను ముఖ్యోద్దేశము
గలవారని వాస్తవముగాఁ జెప్పగలను. కాఁబట్టి వీరు దమగౌరవమును గా
పాడుకొనుటయే ప్రధానకార్యముగా గణించి సర్వకార్యములయందునుఁ బ్ర
వర్తించుచుండిరి. తమపరువును మర్యాదను నిలుపుకొనుట కెంతధనమైనను

మెచ్చించుటకు గాని యెంతకష్టమునకైన లోనగుటకుగాని యించుకయిన సందేహింపకఁ గాలముఁ గడపుచుండిరి. వీరు దేశాభిమానులును, గార్యాచరణపటూపరతంత్రులును, బరోపకారపారీణులును, నాడంబరశూన్యులును గావున స్వదేశాభివృద్ధికొఱకై యేమేమికార్యము లెట్లెట్లు చేసిన దమసదుద్దేశములు నెఱవేఱునో యని యోచించుచుఁ జర్చించుచుండిరి. మనదేశమున సమాజములన్నియు సదుద్దేశములతో దేశాభివృద్ధికొఱకును సంఘాభివృద్ధికొఱకును స్థాపింపఁబడియున్నను నభివృద్ధిలోనుండి చక్కఁగఁ జనామోదకరముగఁ బనిచేయకుండుటకుఁ గల మూలకారణము నన్వేషించి జగద్విదితము చేయవలయునను నొకగొప్పయుద్దేశమును దృఢనిశ్చయమును వీరికిఁగలిగినది. ఈయభిప్రాయము మిక్కిలి శ్లాఘాపాత్రమయినదనియు శ్రేయోదాయకమయినదనియుఁ జెప్పుటకెంతమాత్రము సందియములేదు.



## రెండవ ప్రకరణము.



కార్యశూరులు జనులుచేయు నిరుత్సాహములచేతనుఁ బ్రతికక్షులు తలఁపెట్టు నాటంకములవలనను జనసామాన్యులాడు నపవాదులవలనను దుర్మార్గులుచేయు వేళాకోళములవలనను స్వార్థపరాయణులు మాత్సర్యబుద్ధిచేతనుఁ గుత్సితమయిన మనస్సుతోడనుఁ గల్పించి చెప్పు నీచకారణములవలనను నించుకైన నిరుత్సాహముఁ జెందక తాముతలపెట్టిన మహోద్యమమును మఱింత పట్టుదలతోఁ జేయుచుందురు. మహానుభావులగు వివేకులు జనుల శ్లాఘనల కుబ్బక పరుల నిందలకుఁ గినియక తాము బోవు న్యాయపథమును విడువక జనులేమన్నను నేమి చేసినను నించుకయేనిఁ బాటింపక తాము తలపెట్టిన సత్కార్యములను నిర్వహింపు

చుందురు. "శ్రేయాంసి బహువిఘ్నాని" యను లోకోక్తినిబట్టి మంచికార్యముల కెప్పుడును విఘ్నములు తటస్థించుచుండును. కాని యట్టి దృఢమైన కార్యాచరణ దీక్షయు మనోనిశ్చయమును నెట్టికార్యమునైన సానుకూలముగఁ జేసికొన సాఁగించి సఫలముగఁ జేయఁగలుగును గదా! దేహబలముకన్న బుద్ధిబలమును మనోబలమును శతాంశము లెక్కువ. మనోబలముగలవాఁ డితరులమనములను స్వాధీనపఱచుకొనఁగలఁడు. దీనినే ప్రకృతిశాస్త్రజ్ఞులు 'విల్ ఫోర్సు' (Willforce) అందురు. దీనిమాహాత్మ్యము నిది చేయఁగలుగు కార్యములను మనము వార్తాపత్రికల మూలముగను గ్రంథములవలనను దెలిసికొనియే యున్నాము. మఱియు ఈమనోబలమువలన నిర్వర్తింపఁబడిన యసాధ్యకార్యములను గూర్చి చిత్రకథ లనేకములు మనము వినియున్నాము. మనవారు కొంతకాలముక్రిందట విశ్వాసము నమ్మకము లేనివారై మనపెద్ద లిందునుగూర్చి వ్రాసిన యంశములను నమ్మక తమ కన్నులతోఁ జూడనివన్నియు నభావములని నిశ్చయించి తమకుఁగల స్వల్పానుభవమే వాస్తవమయినదియు న్యాయమయినదియు నను నహంభావముతోడను గర్వముతోడను జనుల భక్తివిశ్వాసములను బాడుచేయఁదలఁచిరి. అంత దివ్యజ్ఞానసమాజమువా రవతరించి కొన్ని యసాధ్యకార్యములను జేసి జనుల విశ్వాసము నశింపకుండఁ బనిచేయ నారంభించిరి. హిందూజనసంఘమునందలి దురాచారములను బాఱఁద్రోసి సదాచారములను నెలకొలిపి క్రైస్తవమతస్థులలోఁ బరుషులతో సమానముగఁ బాటుపడఁగల స్త్రీల గుప్తిఁ బాపి స్వదేశమునకు శ్రేయమును నభివృద్ధియుఁ గలుగఁజేసి హిందూదేశముయొక్క దుస్థితుల కన్నిఁటికిని హిందూస్త్రీల దుస్థితియు హిందూజనసంఘములోనున్న దురాచారములును మూలకారణములని దృఢనిశ్చయబుద్ధితోఁ బనిచేయు సంఘసంస్కర్తలు సేయు కార్యములను వానిఫలములను మన మెఱిఁగియే యున్నాము. ఈమహామహులు నీతియు జ్ఞానమును సదాచారములనుఁ జిన్నతనమునుండియు నేర్పినఁగాని జనులకలవడదని చక్కఁగఁ గనిపెట్టి సంఘాభివృద్ధికి విఘ్నప్రాయముగా నున్న జాతిమతద్వేషములను జనుల హృదయసీమల నుండి పాఱఁద్రోలఁ గం

జాతిభేదమించుకయు లేకుండ నందఱు కలసి భోజనము సేయుటయు నందఱుచేత విగ్రహారాధనము త్యజించి యేకేశ్వరారాధనము సేయుటయు స్కూలులలోఁ జదువు చిన్నపిల్లలను సామదానభేదదండోపాయములచే నలవాటుసేసియు దేశానర్థహేతుభూతమయిన హిందూవితంతువుల దుస్థితి కార్యానుష్ఠానమున సంస్కరించియు నింకను ననేకకార్యములు తలపెట్టియు వానినిగురించి యుద్ఘోషించి జనులకుపదేశించియుఁ బాటుపడి పనిసేయుచున్నారు. కొందఱు హిందూసన్యాసులు బయలుదేఱి యందుఁ గొందఱు తమతోఁగలసి సహధర్మచారిణులుగఁ బనిసేయు సన్యాసినులనుఁ దమ యుద్యమములకుఁ దోడుసేసికొని హిందూమతోత్కృష్టతను బోధించుచు మనదేశములోఁ గాకపోయినను నమెరికా మొదలగు నితరదేశములందైన హిందూమతవిశ్వాసమును కలుగఁజేయుచుఁ దన్మూలమున స్వదేశీయులగు మనకు వారి హితోపదేశములయందు గౌరవవిశ్వాసములు పుట్టించుచుఁ బనిసేయుచున్నారు. క్రైస్తవమతబోధకులు సంఘసంస్కర్తల ప్రయత్నములను శ్లాఘించుచు హిందూదేశమంతయుఁ దమమత మవలంబించునట్లు చేయవలయునని కంకణముకట్టుకొని వివాహములు కానివారికి వివాహములు చేయించియుఁ జేయించెదమని వాగ్దానముసేసియు గొప్పయుద్యోగముల నిప్పించెదమని చెప్పియు దరిద్రుల కన్నవస్త్రముల నిచ్చియు మొదలగు నుపాయములవలన హిందూదేశమును బాగుచేయుచు విశ్వాసానర్హమయినట్టిదియు సర్వానర్థహేతుభూతమయినట్టిదియు నగు హిందూమతాభిమానమూఢతను నశింపఁజేయనిశ్చయించుకొని యున్నారు. ఈవిధమున దేశాభిమానులనేకు లనేకవిధములుగ ననేకమార్గములయందుఁ బట్టుదలతోఁ బనిసేయుచున్నారు. కాని వీరిలో వీరికిఁ బరస్పరవిరోధమును నసహిష్ణుతయు, నసూయయు, విద్వేషమును తమకార్యాచరణ నిష్ఠాపరతంత్రతామూలమునఁ దాము తలపెట్టిన నుద్యమమొక్కటియు సర్వజనశ్రేయోదాయకమను నహంభావమును గల తమయంతరంగములను దిరస్కారభావమునఁ గొందఱును మాటలాడ మానివేసి కొందఱును

దమ యాగ్రహమూలమునఁ గొందఱును గార్యవిఫలత్వములు గల్పించి యిఁక కొందఱును నపకారమొనరించి కొందఱును దుర్భాషలాడి మఱికొందఱును యపవాదలు ప్రకటించి మఱికొందఱును రాజద్రోహ ముపదేశించుచున్నారని చాడీలుచెప్పుచుఁ గొందఱునుఁ బ్రపంచమున జనులమోసపుచ్చి వంచించుచున్నారని కొందఱును దాముతక్కఁ దక్కినవారు నశించిపోవలయు నని కొందఱును సభలయందును నితరస్థలములయందును దమ స్నేహితులయొద్దను నాకాశరామన్న యుత్తరములవలనను బ్రకటించి తమతమకార్యైకదీక్షాపరతంత్రతను తమకుఁగల దృఢనిశ్చలబుద్ధిని ప్రకటించుచున్నారు. తాము చేయఁదలపెట్టిన కార్యమునందలి విశ్వాసమునుబట్టియుఁ దమకార్యదీక్షనుబట్టియుఁ దాము విఫలమనోరథులగుటకుఁ గారణముఁ దాము దెలిసికొనఁజాలక యన్యులు చెప్పిన మొదల వారిమాటలయందు విశ్వాసములేనివారై యితరులనుఁ దూలనాఁడుచుఁ దాము సత్కార్యాచరణ లని యేకగ్రీవముగా నందఱునుఁ దమ్ము శిరసావహించి కొనియాడి యెదురాడకఁ దాముచెప్పినరీతిని నడుచుకొని తమకార్యములను కొనసాగింపఁజేయఁగలుగు సహాయమును చేయకపోవుటకాగ్రహోద్రిక్త చిత్తులై తుదకుఁ దమ్ముఁ దామేమఱచిపోయి యుచితానుచితములను బాటించకఁ బ్రవర్తించుచున్నారు. ఇట్లు మనదేశములో స్థాపింపఁబడిన సమాజములన్నియు నన్యోన్యవిరోధభావము గలవిగా నున్నను నొకసమాజమువారు మఱియొకసమాజమువారిని నిందించుచు గేలిసేయుచు దూషించుచు నశ్రేయస్కరముగఁ బనిచేయుచున్నను నివియన్నియు దేశాభివృద్ధికొఱకును సంఘాభివృద్ధికొఱకును నుద్దేశింపఁబడి స్థాపింపఁబడియుండుట కొంతమాత్రమును సందియములేదు. ఒకప్పు డుచితమగు పని మఱియొకప్పు డనుచితముగను నొకరికి శ్రేయోదాయకముగాఁదోచు కార్య మింకొకరికి శ్రేయోదాయకముగాను నొకరికి సులభసాధ్యము నగు దింకొకరి కసాధ్యమనియుఁ దోచుచుండును. కావున నందఱికని సన్నికాలములయందునుఁ బ్రీతికరముగాను నామోదకరముగాను సులభసాధ్యముగాను కాలానుసరణముగాను నుండునటుల

దేశక్షేమముకొఱకు పనిచేయునటులుద్దేశింపఁబడిన సమాజ మొకదానిని స్థాపించుట ముఖ్యకార్యమని మొదలియారుగారును వారిస్నేహితులును నిశ్చయించిరి. మొదలియారుగారు దూరాలోచనపరులుగావునఁ బ్రకృతమునందున్న సమాజములన్నియు చేయఁగలిగిన లాభముకన్న నన్యోన్యకలహములకుఁ గారణభూతములై నష్టమునే కలుగఁజేయుచున్నవని దృఢనిశ్చయమైన యభిప్రాయము కలిగియుండెను. తనయభిప్రాయమును మొదలియారు తనస్నేహితులతోడను బరిచితులతోడనుఁ జెప్పెను కాని యందుఁ గొందఱట్టి సమాజమును స్థాపించుట సాధ్యముకాదనియు మఱికొందఱు కష్టసాధ్యమైన పనియనియు నికఁ గొందఱట్టి సమాజమును స్థాపింపఁగలిగి పనిచేయఁగలిగినచో బాగుగ నుండకపోదనియుఁ బలువిధములఁ బలువురు తమయభిప్రాయమును జెప్పిరి. కాని శెట్టిగారునుఁ బిళ్ళగారును నాయుఁడుగారును మొదలియారుగారితో నేకీభవించి యట్టిసమాజమును స్థాపింపవలయుననియే నిశ్చయించిరి.

తరువాత కొన్నిమాసములకు మొదలియారుగారు కారణాంతరమునఁ జెన్నపట్టణమువిడిచి భేతాళపురమును ప్రవేశించిరి. వీరు భేతాళపురమును ప్రవేశించిన కొన్నిమాసములకుఁ దమ స్నేహితు నెడఁబాసి యుండఁజాలక పోవుటచేతనో మఱియేకారణముచేతనో మనకు వీరువ్రాసిన దినచర్యలవలన బోధపడలేదు కాని వారుమువ్వురు నాపురమునే చేరిరి. మొదలియారుగారును వారిస్నేహితులునుఁ బ్రసిద్ధపురుషులని వేరే చెప్పనవసరములేదు. వీరు భేతాళపురమును బ్రవేశించి యందు విశేషగౌరవముతో సంచరించుచు నాపురవాస్తవ్యుల గౌరవవిశ్వాసములకుఁ బాత్రులై కాలము గడపుచుండిరి. పరోపకారబుద్ధికల యీమహానుభావులు దేశక్షేమముకొఱకుఁ బనిచేయవలయునను పట్టుదలకలిగి యుండుటచే నాపురవాస్తవ్యులతోఁ దమ సదుద్దేశమును చెప్పి యొకసమాజమేర్పఱుప నిశ్చయించిరి. అట్టిసమాజము స్థాపించుటకొక విద్వజ్జన మహాజనసభ గావింప నవసరముగాఁ గనిపించుటచే నట్టిసభ చేయుటకుఁ బ్రయత్నించిరి. ఈసభ మిక్కిలి గొప్పదిగానుండవలెనని యెంచి స

భఁగావించుట కనువైన ప్రదేశముఁగూర్చి యాలోచించిరి. ఇట్టిమహాజనస భఁగావించుట కనువైన ప్రదేశము లింటనుఁబూర్వమె స్థాపింపఁబడి పనిసే యుచున్న సమాజమువారి యిష్టమువైనకాని చేకూరునట్లు కనిపించలేదు. ఇ దివఱకు కన్ని సమాజములుండి పనిసేయుచుండఁగా నిప్పుడు వేఱొక క్రొత్తస మాజమేర్పఱుచుటకేమి యావశ్యకముకలిగెనని శంకించి యీసమాజమువలనఁ ద మ సమాజమునకుఁ గండిపోవునని భయపడి తమ సత్ప్రయత్నమునను సఫలము కావించునని యోచించి యేకఫలాపేక్షితులు లాంఛనములను సహాయముచేయుట న టస్థించవని తెలిసికొని యాప్రయత్నమును మానివేసిరి. వీరువారి యీపురిజ నులలో నొక మహానుభావుఁడు దేవాలయములలోని ముఖమంటపము లిట్టిస భలకేర్పడినవి కావున నీమహాసభ యొకదేవాలయములోఁ గావించి యీశ్వర సన్నిధానమున నిట్టి సత్కార్యప్రారంభము చేసిన లాభముగూడ పొందవచ్చు ననెను.

అందునకింకొక మహాజనుఁడు శివాలయములలో సభకావించిన వైష్ణవు లు రాఁజాలరనియు విష్ణ్వాలయములలో సభజరపిన శైవులురారనియు నదియు ట్లుండ విగ్రహారాధన మే పనికిరాదను బ్రహ్మసమాజికులు మొదలేరారనియు మహమ్మదీయులు క్రైస్తవులు మొదలుగాగలవారు వచ్చుటకు మొదలే వీలుపడదని యు మతద్వేషమీదినములందే యిమహాయోగ్య ప్రబలముగా నుండుటచే నీప్రయత్న మంతగా నుచితముగాఁ గనిపించదనియుఁ జెప్పెను. అటుపిమ్మట యింకొక మహాపురుషుఁడు నాపురమునఁగల గృహస్థుల యిండ్లలో నొకవిశాలమైన యిం ట సభగావించిన నుచితముగ నుండునని యనెను. అందునకింకొకఁడు యీపుర మున నాలుగైదువిధములైన పార్టీలు ప్రబలి యొకపార్టీవారింకొకపార్టీ వారితోఁ గలసి పనిచేయుట యన్నఁడును నేవిధముగ మనసునఁ దటస్థించకుం డుటచే నేగృహస్థులింట సభగావించినను బహిరంగన్యాలందఱు రారని స్ప ష్టముగఁ జెప్పెను. అంత నందఱునుఁ గలసి సర్వజనామోదకరముగా నుండు నట్టుల స్థాపింపఁబడనున్న సమాజముకొఱకు ప్రత్యేకముగనే యిట్టి

యాటంకములుకల ప్రదేశములయందు మహాజనసభఁ గావించు టనుచితమని నిశ్చయించి యాపురముననున్న సంతదరిని నొక బహిరంగప్రదేశమున నొక 'యారుబైటసభ' గావించుటకు నిశ్చయించి ప్రచురపఱచి వార్తాపత్రికలకుఁ దంతి సమాచారములు పంపి యుచితప్రయత్నముల నన్నిఁటినిఁ జేసిరి.

అంతే నొకనాఁడు మధ్యాహ్నము నాలుగుగంటలకు సభప్రారంభింపఁబడెను. ఆసభకు మొదలియారుగారినే యగ్రాసనాధిపతిగా నందఱు నేకగ్రీవముగ నియమించిరి. మొదలియారుగారికిఁ దా నగ్రాసనాధిపతిగా నుండుటకిష్టములేకపోయినను సభాసదులబలవంతముపై నొప్పుకొ యగ్రపీఠమలంకరించిరి. మొదలియారుగారికి నత్తియున్నదని యిదివఱకే తెలుపఁబడినది. ఆయన చెప్పఁబూనుకొన్న యంశములు చాలకలవు. తాను గొప్పవక్తనని యాయనకు మనోగర్వముకలదు. ఆయన సభలోఁ జెప్పినయంశములన్నియు సవిస్తరముగా నిందు వివరించుట కష్టసాధ్యమయినను అందులోఁ గొన్నిటిని యిందు వివరించెదను.

## అగ్రాసనాధిపతి యుపన్యాసము.

మహాజనులారా! మీరు నన్నీసమయమున నీవిద్వజ్జనమహాజనసభ కగ్రాసనాధిపతిగా నేర్పఱచుటవలన మీరు ప్రకటించిన నాయందలి గౌరవవిశ్వాసములకు మిక్కిలి యానందించుచు మీకు నాయందుఁగల యనుగ్రహమునకుఁ గృతజ్ఞుఁడనై యున్నాను. దేశక్షేమమునకుఁ బాటుపడి త్రికరణశుద్ధిగాఁ బనిచేయుట మనకందఱకు విధాయకకృత్యము. (అందఱు చప్పట్లుగొట్టుదురు) మనుష్యసేవఁ జేయనివాఁడును దేశోపకారమొనరించి సంఘాభివృద్ధికిఁ దోడ్పడనివాఁడును మనుష్యుఁడని పిలువఁబడుట కర్హుఁడుగాఁడని నా తాత్పర్యము. ("నీతాత్పర్యమైతే నది కావచ్చునుగాని యది వాస్తవముకాదు" అని యొక కేక వినిపించును.) "లోకోభిన్నరుచిః" అను న్యాయమునుబట్టి యొక్కొక్కరి కొక్కొక్కవిషయము ముఖ్యముగాఁ గనిపించుటచేత మనదే

శమున ననేకసమాజములంకురించినవి. అవియన్నియు దేశక్షేమముకొఱకును సంఘాభివృద్ధికొఱకును నుద్దేశింపఁబడి స్థాపింపఁబడినవనుట కొంతమాత్రమును సందియములేదు. కాని యవి పరస్పరభేదములు గలవిగను విరుద్ధములుగను బనిచేయుచుండుట మిక్కిలి చింతాకరముగానున్నది. (ఆమాట వాస్తవముకాదు.) ఆసంగతటుండ మన ముఖ్యోద్దేశమైన దేశాభివృద్ధివిషయము మనము మఱచిపోక సర్వజనసమ్మతమైన యొకసమాజమును మనమిప్పుడు స్థాపింపవలయును. ("ఇదివఱకున్నవి చాలును యిప్పుడక్కఱలేదు" అని కొందఱును "వినండి వినండి" అనికొందఱును, "కామోష్" అనికొందఱును కేకలువేతురు.) ఇందువిషయమై నేను చాలకాలమునుంచి దూరమాలోచించి మనమిప్పుడేర్పఱుపఁబోవు సమాజముయొక్క యుద్దేశములను గొంతవఱకు నిశ్చయించినాను. ఆయంశముల నిప్పుడు మీతోఁ గస్తూరిశెట్టిగారు సవిస్తరముగా శెలవిచ్చెదరు.

కస్తూరి—అగ్రాసనాధిపా! సభాసదులారా!! నేనుచెప్పఁబోవు విషయమును మీరు సావధానచిత్తులై వినఁగోరుచున్నాను. మనదేశమభివృద్ధిలోనికిఁ దెచ్చి సంఘదురాచారములనెల్ల రూపుమాపి సదాచారములనెలకొలిపి హిందూదేశము పురాతనౌన్నత్యదశకుఁ దీసికొనివచ్చుట మనకందఱకుఁ గర్తవ్యాంశము. ఇందువిషయమై అనేకులు అనేకవిధములఁ బనిచేయుచుఁ దమ దేశాభిమానమును బ్రకటించుచునేయున్నారు. చంద్రునికొక నూలుపోగన్నట్లు నామట్టుకు నేనుడతాభక్తితో నైదారుసంవత్సరములక్రిందట నొకవారపత్రికను దేశభాషయగు తెలుగునఁ బ్రచురించి స్వదేశాభిమానముతో దేశాభివృద్ధికొఱకుఁ బనిచేయ నిశ్చయించుకొంటిని. (అందఱు చప్పట్లుకొట్టుచున్నారు) నావారపత్రికఁ బ్రకటింప మొదలుపెట్టినతరువాతఁ గొన్నిమాసములకది క్రమక్రమముగాఁ జదువరుల యనాదరణచే క్షీణింప వారపత్రికను బక్షపత్రికగాను మాసపత్రికగాను మార్చి తుదకాపత్రికామూలమునఁ గార్యసాధనమేమియులేదని నిశ్చయించుకొని యాప్రయత్నమును మానుకొనవలసినవాడనైనాడను. దేశక్షేమముకొఱకును దేశాభివృ

కొఱకును స్థాపింపఁబడవలసిన సమాజములన్నియు సదుద్దేశములతో స్థాపింపఁబడినను నదియంత దృఢస్థిరముగాఁ బనిచేయుచుండుటలేదని చెప్పుటను నాకు మిక్కిలి విచారకరముగానున్నది. ("అన్ని సమాజములనుగురించి యథార్థముగా చెప్పఁగూడదు; ఆమాట నిజముకాదు; ఇతరులను ద్వేషించి మాటలాడుట సభలలోఁ దగదు; వదలింపఁగూడదు" అను మొదలైనకేకలతోఁ జప్పట్లుగొట్టుదురు.) అన్నలారా! నేనన్నమాటకు మీరాగ్రహించవద్దు. ఆసమాజములు దృఢస్థిరముగా బనిచేయకున్నవని చెప్పుటవలన నాయాసమాజములవారియందు నాకెంతమాత్రము నగౌరవములేదని నేను దైవసాక్షిగా మీయందఱియెదుట నీసభలోఁ బ్రమాణముచేయఁగలను. అయినను నాసమాజములు కారణాంతరములచేఁ బరస్పరవిరోధములుగాఁ బనిచేయుచు నవియన్నియుఁ బ్రజలనందఱ నొక్కటిగా సమకూర్చుటను మాఱుగా వేఱుపఱచి యన్యోన్యకలహములకుఁ గారణభూతములైనవని నాయభిప్రాయము. ("దురుద్దేశముతో నితరులుచేయు సత్కార్యములను విఘ్నములు గల్పించి తమశత్రువులను దూషించుట కేర్పఱుపఁబడిన సమాజములు బయలువెడలినతరువాత నింక నేమగును" అనియొకఁడు గట్టిగా కేకలువెట్టెను. అప్పుడు మఱియొకఁడు "అట్టిదురుద్దేశముతో స్థాపింపఁబడి పనిచేయుచున్న సమాజమేదో చెప్పవలెను" అంతఁ గొందఱులేచి యొక్కసారిగా మాటలాడుదురు. కొందఱు చప్పట్లుగొట్టి లేవిడీఅని కేకలువేతురు.) సభాసదులారా! నేనుచెప్పఁబోవు నంశమునుగూర్చి సావధానచిత్తులై వినవలెను. ఈసంగతులన్నిటితో నిప్పుడు మనకుఁ బ్రసక్తి లేదు. దేశక్షేమముకొఱకును దేశాభివృద్ధికొఱకును బట్టుదలతోఁ బనిచేయుటకిప్పుడొకసమాజమును స్థాపింప మనమిప్పుడీసభ జరిపినాముగావున మనము వాగ్వాదముతో నింకఁ గాలహరణముఁ గావింపకఁ గార్యాచరణమునకుఁ బూనుకొనుటమంచిది. ("ఇదివఱకెన్ని సమాజములుండఁగా నిప్పుడింకొక సమాజముగూడ నెందుకు" "సమాజములతోఁ బ్రాణములు

విసుగుచున్నవి ; కంసాలిపొయ్యిలవలె సీసమాజములను విధివిరామములుం డవుగాకపోలు" అను మొదలైన కేకలతో నందఱు చప్పట్లుగొట్ట కొందఱు "కానండి, కానండి" అల్లరి చెయ్యవద్దు అందురు) ఇప్పుడు స్థాపింప నుద్దేశింపఁబడిన సమాజముయొక్క ముఖ్యోద్దేశములను మనవిచేయుచున్నాను. సావధానచిత్తులై నాతప్పులు క్షమించి నేను చెప్పుమాటల లోని పొరబాట్లను పాటింపక నాసదుద్దేశమును గ్రహించి నన్ను మన్నించి నాయందు దయతో వినుటకు మిమ్ములనందఱను జేతులుమోడ్చి నమస్కరించుచుఁ బ్రార్థించుచున్నాను.

ఇప్పుడు స్థాపింపఁబోవు సమాజముయొక్క ముఖ్యోద్దేశములు దేశక్షేమము సంపూర్ణాభివృద్ధియు నని నేను వేరే చెప్పనవసరములేదు. వానినే విశదీకరించి మీకిప్పుడు మనవిచేయుచున్నాను.

i ప్రజాదారిద్ర్య హేతువుచేతనుఁ బ్రజలకుఁ గలుగు నన్యాయకారణము చేతను బలవంతులవలన బలహీనులకును శిష్టులవలన దుష్టులకును సంభవించెడు కష్టములవలనను నింక నితరకారణములవలననుఁ బ్రజలకుఁ దటస్థించు క్లేశకష్టములన్నిటిని మాన్పించుట ;

ii దేశములోనున్న దురాచారములన్నిటిని నిర్మూలము చేసి సదాచారముల నెలకొలిపి ప్రజలకందఱకు నైకమత్యము కలుగఁజేసి అందుమూలముగఁ బ్రపంచకమంతయు నొకకోటిగఁ జేయుట;

iii అన్యాయము, అధర్మము, అవినీతి, దురాగ్రహము, ధనలోపము, పరస్త్రీయోసహనము, మాత్సర్యము, దురాశ మొదలగు దుర్గుణములు లేకుండ ప్రజలు సన్మార్గానువర్తులై సంచరించుచు స్త్రీపురుషులన్యోన్య గౌరవవిశ్వాసములతోడను భయభక్తులతో సంచరించుచు నేకపత్నీ, ఏకభర్తృన్యాయముతో సంచరించుచున్నట్లు చేయుట ;

iv ఏకార్యమును, నేయాచారమును, దేనిని నకారణముగ నిందించి దూషించక వాటిమూలకారణములను శ్రద్ధతోఁ గనిపెట్టి కర్తవ్యమును చేయుట ;

v ఎవరిపనివారు చేసుకొనునట్లు చేయుట ;

vi ప్రజ లందఱకును సమ్మతముగా నుండునట్లు ప్రవర్తింపఁ జేయుట ;

vii ప్రజలమౌఢ్యమును రూపుమాపుట ;

viii హిందూమతాచారధర్మములనుఁ గాపాడుట ;

ix జనులందఱు నొకభాషను నొకలిపిని నభ్యసించునట్లు చేయుట ;

x స్త్రీ పురుషుల నందఱిని విద్యాధికులుగను వివేకులుగనుఁ జేయుట ;

xi ఈశ్వరభక్తి, దేశాభిమానము, సత్యసంధత ప్రజలకుఁ గలుగఁ జేయుట ;

xii స్త్రీ పురుషులు యీశ్వరచోదితములై భగవదుద్దిష్టములై జాత్యానుసారముగఁ దమతమకార్యములను బట్టుదలతోఁ జేసుకొనునట్లు చేయుట ;

xiii ఇంకను దేశమునకు క్షేమకరములును లాభకరములును శ్రేయోదాయకములును నభివృద్ధిహేతువులును నగుపరోపకారకార్యముల నన్నిఁటినిఁ జేయుట ;

xiv ప్రజలకు నాగరికతఁ గలుగఁజేసి యన్నివిద్యలను నభివృద్ధిపఱచుట ;

xv ప్రపంచమండలి యధర్మములను బోఁగొట్టి ధర్మసంస్థాపనము సేయుట.

ఈయుద్దేశములు దేశాభివృద్ధికరములును లోకోపకారకారణములును

బరోపకార హేతుభూతములును ననిచెప్పుట కెంతమాత్రము సందియము లేదు. కాఁబట్టి యిట్టిసర్వోత్కృష్టమైన సమాజమును స్థాపించి మనమందఱముఁ బట్టుదలతోఁ బనిచేయవలయునని మీకు విన్నవించుచు మిమ్ములను బ్రార్థించుచున్నాను. (అందఱు చప్పట్లు గొట్టుచున్నారు.)

నాయుడు—ఇప్పుడు స్థాపింపఁబోవు సమాజముయొక్క యుద్దేశములు మీరెఱిఁగియే యున్నారు. ఇట్టి సమాజము ముఖ్యావశ్యకమని నేను వేఱే చెప్ప నవసరము లేదు. ఈసమాజమునకు "లోకోపకారసమాజ" మని పేరు పెట్టవలెనని నాయభిప్రాయము.

ఒకసభ్యుఁడు—ఈసమాజమునకు లోకోపకారసమాజమని పేరుపెట్టుటకంటె జనానుకూలసంఘ మని పేరుపెట్టు టుచితము.

మఱియొకసభ్యుఁడు—సంఘమనగా గుంపని యర్థమిచ్చును గాన నాపేరు పనికిరాదు.

ఇంకొకసభ్యుఁడు—ఈసమాజమునకుఁ బరోపకారకార్యనిర్వాహకసమాజ మనిపేరు పెట్టవలెనని నాతాత్పర్యము.

నాల్గవసభ్యుఁడు—ఇంత పెద్దపేరు పెట్టుటకంటె జనోపకారిణీసమాజ మనిపేరు పెట్టుట మంచిది.

అయిదవసభ్యుఁడు—ఈసమాజోద్దేశ ముపకారమాచరించుట కాదు కావున దీనిని లోకానుకూల సాధన సంప్రదాన సమాజ మనుట నాముఖ్యతాత్పర్యము.

ఆరవసభ్యుఁడు—దురాచారసంస్కరణసమాజ మని యీసమాజమును బిలుచుట సర్వజనసమ్మతముగా నుండునని నాయభిప్రాయము.

ఏడవసభ్యుఁడు—సంస్కరణపదమువలన నీసమాజము సంఘసంస్కరణసమాజమువంటిదని కొందఱనుమానింతురు గావున నాపేరు బొత్తిగాఁ బనికిరాదు.

ఎనిమిదవ సభ్యుఁడు— ఈసమాజమునకు న్యాయాభివర్ధనీ దివ్యజ్ఞాన సమాజమని పేరుపెట్టినయెడల నేవిధమయిన బాధ గలుగక సర్వజనసమ్మతముగా నుండును.

తొమ్మిదవ వాఁడు— "దివ్యజ్ఞాన" అను పదమువలన మనసమాజము దివ్యజ్ఞానసమాజముతో సంబంధము గలదని కొందఱనుకొనుటకవకాశ మున్నది. అట్టి యవకాశము కలుగఁజేయుట మన సమాజాభివృద్ధికి భంగముగా నుండునుగాన దీనిని "సదాచారస్థాపన కార్యనిర్వాహక సాధన సమీకరణ సంప్రదాన సమాజ" మనుట మంచిది.

పదియవవాఁడు— ఈపేరువలన దురాచారనిర్మూలనము సమాజోద్దేశమైనట్లు గనుపించదు. కావున నీపేరుకంటె "దురాచారదూషణ సదాచారభూషణ పరమభాగవతోత్తమ దివ్యమంగళ సమాజ" మను పేరుత్కృష్టతరముగా నుండును.

పదకొండవవాఁడు— ఈపేరువలన వైష్ణవసంప్రదాయము గనుపించుచున్నది. సమాజముయొక్క యుద్దేశములన్నియు దానిపేరువలననే జనులకుఁ దెలియఁజేయుటవలన మిక్కిలి లాభ మున్నది. అంతయుఁ బేరుతోనే యున్నది. కాఁబట్టి "లోకానుభవ జ్ఞానప్రకటనాదిసాధన ముఖ్యోద్దేశమూలక సర్వజనశ్రేయోభివర్ధనీన్యాయసంస్థాపనసమాజ' మని యీసమాజమునకుఁ బేరుపెట్టుట నాదృఢమైన ముఖ్యమైన వాస్తవమైన నిశ్చయమైన యభిప్రాయము.

పండ్రెండవవాఁడు— ఈపేరుఁ దప్పులేకుండఁ జెప్పఁగలవారు సామాజికులలోఁ జాలమంది యుండరని నానమ్మకము. కాఁబట్టి "దేశాభిమానపూర్వక ధర్మసంస్థాపనసమాజ" మని దీనికిఁ బేరుపెట్టి పిలుచుటుచితముగా నుండును.

పదమూడవవాడు—నేషనల్ ధర్మస్థాపన సమాజ మన్నఁజాలును. అందులో నింతయర్థము నున్నది.

పిల్ల—ఆపేరు మొదలే పనికిరాదు. నేషనల్ అను పదప్రయోగమువలన మనసమాజమున కటుండ నిప్పుడీసభగూడిన మనకందఱకును గూడ ముప్పు వచ్చును. మనమందఱము రాజద్రోహుల మని శంకింపఁబడి శిక్షింపఁబడుదుము. తరువాత మనము చేయఁగలదేమియు లేదు, మన మాపేరే తలపెట్టఁగూడదు. మన మిప్పుడీసమాజమును స్థాపించుటవలన నిదివఱకు దేశములోనున్న సమాజములన్నియు నడుగంటిపోవుట నిశ్చయము. ఇందుకు భయపడి కొన్నిసమాజములవా రిప్పుడే మనప్రయత్నములకు విఘ్నముఁ గావింప నిశ్చయించుకొని యీసమాజమే స్థాపింపఁబడకుండఁ జేయవలయునని యనేకవిధముల ననేకు లనేకపర్యాయములు మొదలియారుగారిని నాయనస్నేహితులను నిరుత్సాహులఁజేసిరి. కొందఱిట్టిసమాజమును స్థాపింపఁబూనుకొనవద్దని యనేకవిధములఁ బ్రతిమాలుకొనిరి. ఇట్లు ప్రతికక్షులు సామదానభేదదండోపాయముల మూలమునఁ జేసిన ప్రయత్నము లిన్నిన్నియని నేనిప్పుడు చెప్పుటవలనఁ గాలహరణ మగును గావున నింతటితో విరమించి యీసమాజమునకు నేషనల్ అను పదసంపర్క మెంతమాత్రమును లేకుండ జేసి ప్రతికక్షులను నిరాయుధులనుగాఁ జేయుఁడని మిమ్ముఁ బ్రతిమాలుకొనుచు బ్రార్థించుచున్నాను.

తరువాత నీసమాజమున కేపేరుఁ బెట్టిన నుచితముగా నుండునని చాల దూరము చర్చ జరిగినది. ఆచర్చలో సభ్యులు దమకుఁగల వక్తృత్వమును, వాదప్రతివాదములవలనఁ బుట్టు నీర్ష్యాజనితములైన కేకలును నహంభావమువలనఁ గలిగిన దూషణవాక్యములును యథేచ్ఛముగా నుపయోగపఱచిరి. సామాజికులలో మఱికొందఱు దమతమ వి

ద్యాబలమును శరీరబలమును గన్పఱచ నారంభించిరి. అప్పుడు మొదలియారుగారు లేచి యీనూతనసమాజమును విశేషపదావిశిష్టముగా "ధర్మసంస్థాపనసమాజ" మని జెప్పుట సర్వజనసమ్మతముగాను శ్రేయోదాయకముగాను నుండునని చెప్పి సభవారి నూరడించి శాంతచిత్తులనుగాఁ జేసిరి. తరువాత నగ్రాసనాధిపతిగా రగు మొదలియారుగారీవిధముగా సభ్యుల కుపన్యసించిరి.

## అగ్రాసనాధిపతి యుపన్యాసము.

"దేశాభిమాన మాననీయు లగు మహాజనులారా! సభికులారా!! నేను చెప్పఁబోవు విషయమును సావధానచిత్తులై వినఁగోరుచున్నాను. ఈవిషయమును గురించి మాటలాడుటకు నేనంతఁగాఁ దగినవాఁడను కాకపోయినను విద్యయందును బుద్ధిబలమునందును అనుభవమునందును వక్తృత్వమునందును వాఙ్నైపుణియందును నాకంటె ననేకవిధముల శతాంశ మెక్కు వగుమహనీయు లెందఱో యున్నను మీయందఱి యెదుట సాహసముగా నిలచి చెప్పఁబూనుకొనుటకు నాకే సిగ్గుగా నున్నది. అయినను మీయనుగ్రహమూలమునను మీకు నాయందుఁగల గౌరవముచేతను మీసహిష్ణుత్వముచేతను నే నీకార్యమునకు సందేహింపక ధైర్యముతోఁ బూనుకొన్న నన్ను మన్నించి నాతప్పులను బాటింపక నేను చెప్పఁబోవు నీతులయందలి యంతరార్థమును నాసదుద్దేశమును నాకార్యశూరత్వమును నిప్పుడు స్థాపింపఁబడిన సమాజముయొక్క యుపయోగమును నుత్కృష్టతను మీచిత్తములయందుంచుకొని సావధానచిత్తులై వినఁగోరుచు నేఁజెప్పెడు మాటలలోని పొరపాట్లను బాటించక నన్ను మన్నించి వినఁ బ్రార్థించుచున్నాను. ఈదినము గొప్పసుదినమని నాయభిప్రాయము. ఈపుణ్యదినమును దేశమంతయు జ్ఞాపకముంచుకొని యేఁటేఁట సంవత్సరోత్సవములతో మ

హావైభవముతో గౌరవింపవలయు నని నాముఖ్యతాత్పర్యము. మఱియు నీదినము దేశక్షేమమునకును సంఘాభివృద్ధికిని నారంభదినమని మనము దృఢవిశ్వాసము కలిగియుండవలసినదని నేను నొక్కి వక్కాణింపఁగలను. (అందఱు చప్పట్లుకొట్టుచున్నారు) నేఁడిట్టి యుత్తమోత్తమమయిన సమాజము స్థాపింపఁబడి నిర్వివాదంబును సర్వజనసమ్మతంబును నుచితమునగు నామకరణ మొసఁగఁబడుటచే మనమందఱము కృతకృత్యుల మైతిమని సంతోషింపక తప్పదు. (చప్పట్లుకొట్టుచున్నారు) మన మీసమాజమును స్థాపించిన విషయమును గుఱించి వార్తాపత్రిక లన్నిఁటిలోను బ్రచురించి వానికిప్పుడే తంత్రీసమాచారమును బంపుట మిక్కిలి యావశ్యకము. ఈసమాజము దేశమందున్న సమాజములన్నిఁటికి ననుకూలమయినది కాని, ప్రతికూలమైనది యెన్నఁడును కాదని నమ్మవలెను. దేశక్షేమము కొఱకును సంఘాభివృద్ధికొఱకును నెట్టివ్యయప్రయాసలకైన లోనై యెట్టికష్టములనైనఁ బాటింపక పరోపకారదీక్షాపరతంత్రతతోఁ బనిచేయ నేనును నాస్నేహితులగు శెట్టిగారును నాయెడమప్రక్కనుఁ గూర్చుండిన నాయుఁడుగారునుఁ బిళ్ళగారును దృఢనిశ్చయమైన మనస్సు కలిగి కంకణము కట్టుకొన్నార మని మీకు విన్నవించుటకు సాహసించుచున్నాను. (అందఱు గట్టిగ చప్పట్లు కొట్టుదురు) ఈమహాకార్యమును నెరవేర్పగలుగుటకు దైవమును మిమ్ములను నమ్మియున్నాము. కార్యశూరత్వ మొక్కటి దక్క నాయందే విశేషమును లేదని నేను నిశ్చయముగ నెఱుఁగుదును. అయినను నాకుఁ గల పరోపకారపరతంత్రత నన్నీకార్యమునకుఁ బురికొల్పినది. మన దేశములో స్థాపింపఁబడిన సమాజములందొక్కటియుఁ దృప్తికరముగఁ బనిచేయుచుండుట లేదు. ఇట్లు చెప్పుటకు నాకే మిక్కిలి విచారకరముగ నున్నది. అయినను వాస్తవము చెప్పక తీరదు. ఇందుకు మూలకారణము విచా

రింపవలసి యున్నది. జనులకు సమాజములన్న నిప్పుడు గౌరవమే పోయినది. సమాజములు స్థాపించి హానినిఁ జక్కఁగాఁ బని చేయింపఁ జాలకపోయినయెడల నట్టి సమాజములవలనఁ బ్రయోజన మేమున్నది. దురాచారమును మాన్పించుట కొకసమాజము నేర్పఱచి యాసమాజ మభివృద్ధిగా నుండవలయునని యుద్దేశించి తత్సామాజికులలో నందఱుఁ గొంచెముగనో గొప్పగనో దురాచారములు సేయుచున్నట్లు శంకించి కేవలము సమాజములజేరుట మాత్రముననే సామాజికులు సదాచారసంపన్నులు కారని తెలిసికొని వారిచేఁ బ్రమాణములు సేయించి వ్రాతమూలములయిన కరారునామాలు వ్రాయించుకొని సమాజోద్దేశము నెరవేర్చుకొనఁ జూచుటకంటెఁ వెఱ్ఱితనము లేదని నాయభిప్రాయము. ('ఇతరులనుద్దేశించి మాటలాడుచున్నారు జాగ్రత్త' అని యొకఁడును అప్రస్తుతప్రశంసమానుము, అని మఱియొకఁడును కేకలువేయఁ గొందఱు చప్పట్లుగొట్టి యల్లరిచేయుచున్నారు) మనసమాజోద్దేశములను మీకు సవిస్తరముగ శెట్టిగారు మనవిచేసిరియెయున్నారు. కావున మీరందఱు నీసమాజమునఁ జేరి దేశోపకారమొనరించి జనులవిశ్వాసమునకును గృతజ్ఞతకును గౌరవమునకును శ్లాఘనలకును వందనములకును బాత్రులగుదురని నమ్ముచున్నాను. ప్రస్తుతము ఈసభయందుండువారందఱు నీసమాజమునఁ జేరినట్లే నేనూహించెదను. అయినను నీసమాజమును జేరఁ గోరువారు తమ చిరునామాళను సంతకములను వ్రాసి దరఖాస్తులు శెట్టిగారికిఁ బంపించుకొనఁ గోరుచున్నాను. ఈసమాజములో పంద్రెండేండ్లకుమీరిన స్త్రీపురుషులందఱునుఁ జేరవచ్చును. సభలకుఁబోయినఁ జందాలకై పీడింతురని మీరు భయపడ నవసరము లేకుండ నీసమాజమునకుఁ బ్రస్తుతము నేనొక్కవేయిరూపాయీలు సమర్పించుకొనుచున్నాను. కావునఁ బ్రస్తుత మీసమాజమునఁ జేరు వారెవ్వరునుఁ జందా లీయ నక్కరలే

దు. నేడు మీరందఱు శ్రమపడి యిచ్చటకు దయచేసి యీ మహాసభ నలంకరించి యీ మహోద్యమమునకుఁ దోడ్పడి నేఁజెప్పినవాని సావధానచిత్తముతో విని నందులకు మీకందఱకుఁ గృతజ్ఞుఁడనై యనేకవందనము లాచరించి యింతట విరమించుచున్నాను.

తరువాత నొక సభికుఁడు లేచి దొరతనమువారికిని సభాసదులకును నగ్రాసనాధిపతిగారికిని యీసభ గావించుటకు సహాయము గావించిన మహాజనులకును సంతయిజారాదార్లకును గృతజ్ఞతాపూర్వకవందనములు గావింప సభ ముగింపఁబడెను.

ఈవిషయమును గురించి మొదలియారుగారు వార్తాపత్రికల కన్నిఁటికి తంతి సమాచారములపంపి వానిలోఁ బెద్దపెద్ద వ్యాసములను వ్రాసి ప్రచురింపించిరి. కాని యిందుఁ బ్రవేశించుటకెవ్వరును దరఖాస్తులను పంపుకొనరైరి. అంతటితో మొదలియారుగారు నిరుత్సాహులుగాక యాపురమునందుఁ గలప్రతిగృహస్థు నింటికిఁ బోయి యీసమాజమునఁ జేరవలసినదని ప్రార్థించి కొందఱిని మాత్రము సామాజికులుగా నేర్పఱచుకొని పనిచేయ నారంభించిరి. కాని యీసమాజము నొక్క సభలకు మొదలియారుగారును వారిస్నేహితులు ముగ్గురును గ్రామములో నొకరిద్దరుమాత్రము వచ్చుచుండిరి. సంవత్సరోత్సవములునుఁ బలహారములతోఁ గూడిన విశేషసభలకును నాయూరివారందఱు నాఁబాలవృద్ధముగ దయచేసి సంవత్సరమున కొకపర్యాయమైనను నా సమాజమునందుఁ గల యభిమానమును బ్రకటించుచుండిరి. ఇట్లు నాలుగైదు సంవత్సరములు గడచెను.

తరువాత మొదలియారుగారును నాయనస్నేహితులును మీటింగులువలనఁ బ్రయోజనము లేదనియు నవి జనులకు వినోదకరములుగను హాస్యాస్పదములుగను నుత్సవములుగను బరిణమించుచున్నవని

గ్రహించిరి. అయినను వీరు చేయఁదలపెట్టిన కార్యమును మాత్రము విడిచిపెట్టలేదు. మూర్ఖులని యెందఱెన్నివిధముల దూషించినను గార్యదీక్షాపరతంత్రులు తమప్రయత్నములను విడువరు. ఇదిమహామహులలక్షణము. ఒకనాఁడు మొదలియారుగారును నాయనస్నేహితులును గూర్చుండి యాలోచించి జనులు తమసత్కార్యములకుఁ దోడ్పడకుండుటకు నిరుత్సాహులుగాక నీసమాజము నామావశిష్టమగుచుండినందులకు మిక్కిలి విచారించుచుఁ గార్యాచరణమువలన జనుల నొప్పించి వారికి జ్ఞానము గలుగఁజేసి యీసమాజముయొక్క యుత్కృష్టత వారి హృదయములకు నాటు నట్లొనరించి యీసమాజము నభివృద్ధిలోనికిఁ దేవలయునని యూహించి పనిచేసి చూపవలయును కాని మాటలతోఁ బ్రసక్తి లేదని నిశ్చయించుకొనిరి.

జనుల సహాయము వడయుటకు వారియభిప్రాయములను గ్రహించుటకు దేశాటనము సేసి వారితో ముచ్చటించుట నత్యావశ్యకము. వారియభిప్రాయమును గ్రహించుటకు వారితోఁ గలసి మెలసి తిరుగుట ప్రధానము. వారితోఁ గలసి మెలసి తిరుగుటకు నతిశాంతముతోఁ బనిచేయుట ముఖ్యము. అని వీరు గ్రహించి జనులయభిప్రాయములను నాచారవ్యవహారములను చక్కఁగాఁ దెలిసికొనినఁ గాని యీకార్యము నిర్వహించుటకు వలనుపడదని నిశ్చయించి తాముగ్రహించినదంతయుఁ దమ యనుభవముతోఁ గూర్చి వ్రాసి తమ జీవితకాలములోఁ జేయఁగలిగినంతఁ బనిచేసి తక్కినది తమతర్వాత కార్యశూరులకు మార్గదర్శనముఁ గల్పింప నిశ్చయించుకొనిరి.



# మూడవ ప్రకరణము.

గుణదోషములు ప్రతిసంఘమందును గనుపించును. అన్నిదేశములయందును నన్నిజాతులయందును గుణము లెక్కువగనో దోషము లెక్కువగనో గనుపించుచుండును గాని కేవలము గుణములుగాని దోషములుగాని యుండుట తటస్థించదు. కొన్నిసమాజములవారు గుణములను గ్రహింపఁజాలక దోషములనే పరిగణించి గోరంతలు కొండంతలుగాఁ జేసి వానినిఁ బోఁగొట్టుకొనుటకుఁ బ్రయత్నించి పనిసేయుచుందురు. మరికొన్నిసమాజములవారు దోషములను పాటించక గుణములనే పరిగణించి దోషములను బోఁగొట్టుకొనవలయునని చేయుప్రయత్నముల వలన గుణములకుఁ గూడ భంగము కలుగునని యూహించి భయపడి వేగిరపాటుతోఁ గర్తవ్యమాలోచింపకుండ పనిచేయుట నష్టదాయకమని తలఁచుచుందురు. ఇప్పుడు దుష్టములుగను నష్టదాయకములుగను నిందాస్పదములుగను ననర్థహేతుభూతములుగను గనుపించు నాచారము లొకప్పుడు లాభకరములుగను శ్రేయోదాయకములుగను నుచితములుగను క్షేమకరములుగను నుండవచ్చును. సదుద్దేశముతో లాభముకొఱకును క్షేమముకొఱకును నేర్పరుపఁబడిన యాచారములు కాలక్రమమున నష్టదాయకములుగను నశ్రేయస్కరములుగనుఁ బరిణమించుచుండును. ఏయేకాలమునకు నేయేయవస్థకు నేయేయాచారములు లాభకరములో! యేవేవి నష్టకరములో! దూరాలోచనముతోఁ బరిశీలించి పనిసేయుట ముఖ్యము. మఱియు దోషములని కొన్నియాచారములను త్యజించుటవలన నాయాచారము లున్నప్పటికంటె నవి పోఁగొట్టుకొనినతరువాత మరియొకదురాచారము ప్రబలిపూర్వముకంటె నెక్కుడు నష్టము కలుగవచ్చును. ఒక జనసంఘముగాని యొకదేశముకాని దోషరహితమై గుణసమృద్ధితో నభివృ

ద్ధిలో నున్నదని మనము నిశ్చయింపఁగూడదు. దేశకాలపాత్రతలను బట్టి గుణదోషముల నెన్ని గ్రహింపవలసియున్నది. ఒకదేశమునకును నొకసంఘమునకును లాభకరముగాఁ గనిపించు నాచార మింకొకదేశమునకును సంఘమునకును లాభకరమని నిశ్చయించుటఁదగదు. జనుల నాగరికతను బట్టియు స్థితినిఁబట్టియు ననుభవజ్ఞానమునుబట్టియు దేశముయొక్క యభివృద్ధినిఁబట్టియుఁ బూర్వనాగరికస్థితులనుబట్టియు స్వభావసిద్ధములైన యితరకారణములనుబట్టియు నేయేసంఘమున కేయేదేశమున కేయేయాచారములు లాభకరములో యేవి నష్టదాయకములో చక్కఁగా యోజించి గ్రహింపవలసియున్నది. ఇది యిట్లుండ జనుల యభిప్రాయములను గ్రహింపవలసిన యవసర మొకటి ప్రధానము. దేశాభివృద్ధి కలుగఁజేయవలయునను దృఢాభిప్రాయముతో దురాచారములను పాఱఁద్రోలి సదాచారములను స్థాపింపవలయునను సత్కార్యాచరణపరతంత్రతాదీక్ష పూని తాము చేయు కార్యమువలన దేశమునకు నష్టముకలుగుచున్నదో లాభముకలుగుచున్నదో గ్రహింపఁజాలక తాముచేయుపని మంచిదియే యను నహంభావమున నొడలు మఱచి సంచరించుట దేశమునకు నష్టము కలుగఁజేయును. కాని లాభమెన్నఁటికినిఁ గలుగఁజేయదు. మనదేశములో నిప్పుడు ప్రబలియున్న దురాచారము లొకప్పుడు సదాచారములుగనే యుండి యుండవచ్చుననియు నిప్పుడు దురాచారములుగాఁ బరిణమించిన యాచారములు మొదట సదుద్దేశములు లాభకరములునగు సదాచారములనియు దేశమునకు క్షేమకరములనియు నిశ్చయించి యేర్పరుపఁబడినవనియు మనము నమ్మవలసియున్నది. ఒకప్పుడు లాభకరముగాను సదాచారములుగను నున్న యాచారము లిప్పుడు దురాచారములుగాఁ బరిణమించుటవలన ప్రస్తుత మవి నష్టదాయకములే యయినను వానిని నిర్మూలము చేయుటవలన నష్టము కలుగునో లాభముకలుగునో పరిశీలన

బుద్ధితో దూర మాలోచింపవలసియున్నది. దేశానుభవమించుకయు లేక జనుల యభిప్రాయములును స్థితియు ననుభవమునుఁ బాత్రతయు వివేకమును నడవడియు జ్ఞానస్థితియు నించుకైనఁ దెలిసికొనక కూపమండూకములవలె నొకచోఁ గూర్చుండి కదలనేరక తమయనుభవమే వాస్తవమనియుఁ దాము చేయు కార్యములే సత్కార్యములనియుఁ దమప్రయత్నములే యుచితప్రయత్నములనియుఁ దా మామోదించిన యాచారములే ప్రపంచమంతయు సదాచారములుగ శిరసా వహింపవలయుననియు నహంభావముతో నుద్దేశించుట మూర్ఖలక్షణమని చెప్పవలసియున్నది. సదుద్దేశముతో నితరులు సేయు హితోపదేశములు తమ సత్ప్రయత్నములకు నీర్ష్యాభావముతోఁ గల్పించు నాటంకములని వానినిఁ బాటింపకుండ లాభనష్టములను గుర్తెఱుఁగక యొక మార్గముననేఁ గన్నులనుఁ జెవులను మూసికొని సంచరింప నిశ్చయించుకొనిన వానిని మూర్ఖుఁడని పిలుచుటవలనఁ దప్పేమున్నది. ఆహా! మూర్ఖత్వమును నహంభావమును నెట్టెట్టి యాపదలకును నష్టములకునుఁ గారణభూతము లగుచుండునో కదా! అవియెట్టి యనుచితకార్యములను చేయించి జనుల నిందలకును హాస్యములకును నాస్పదము చేయునో కదా! మఱియు నీరెండును నవివేకముతోఁ గలసి గుణత్రయములై జనులచే నెట్టెట్టియకార్యములనైన నెట్టి నీతిబాహ్యములగు పనులనైనఁ జేయించి యెట్టెట్టిపాపమునకైనఁ బాలుసేయును. కావున నీగుణత్రితయముగల మహానుభావులందఱకు మీరు గార్యశూరులు కావలదని చేమోడ్చి నమస్కరించి ప్రార్థింపవలసియున్నది.

మొదలియారుగారికిని వారిస్నేహితులకును దేశక్షేమమును సంఘాభివృద్ధియుఁ గలుగఁజేయవలయునను దృఢనిశ్చయమైనబుద్ధియుఁ గార్యశూరత్వమును బరోపకారదీక్షాపరతంత్రతయుఁ దక్క నీదుర్గుణత్రితయము వారికి లేదని నిశ్చయముగాఁ జెప్పక తప్పదు. తాము

నూతనముగా భేతాళపురమున స్థాపించిన సమాజము దమసదుద్దేశముకనుగుణముగాఁ జక్కఁగఁ బనిచేయఁజాలక సర్వజనామోదకరముగా నుండకపోవుటకు వగచుచు నందులకు మూలకారణమును దెలసికొని జనుల యాచారవ్యవహారములను దేశకాలపాత్రతలను జక్కఁగా పరిశీలించి గ్రహించినఁగాని యుచితమగు గార్యాచరణమున కవకాశ ముండదనియు నట్టికార్యాచరణమునఁ గాని లాభము లేదనియు నిశ్చయించుకొని భేతాళపురమునుండి బయనమై దేశాటనము చేసి జనుల యాచారవ్యవహారములను బరిశీలించి విమర్శనాబుద్ధితో దేశాచారముల యోగ్యాయోగ్యతలను దెలసికొని తమ యనుభవమంతయు వ్రాసి తమకును దమ యనంతర మితరులకును దేశాభివృద్ధికరమగు కార్యములను జేయుటకు మార్గ మేర్పఱుప నిశ్చయించుకొనిరి. వీరియుద్దేశము మిక్కిలి శ్లాఘాపాత్రమైనదని చెప్పుట కెంతమాత్రము సందియము లేదు. వీరు స్వభావముచే నుత్తమోత్తములనియు నమాయకవృత్తికలవారనియు నిష్కపటహృదయులనియు నిదివఱకే జెప్పఁబడినది. ఆత్మగౌరవమును గాపాడుకొనవలయునను గోర్కెయుఁ దాము గౌరవపాత్రులమను నభిప్రాయమును మానధనులమను నుద్దేశమును బరోపకార మాచరించుచు లోకరంజకముగాఁ బ్రవర్తింపవలయునను దృఢమైన యభిప్రాయమును వీరికిఁ గలవు. తమ యాత్మగౌరవమును మానమర్యాదలను గాపాడుకొనుట వీరు ముఖ్యకార్యముగానెంచుకొని యన్ని కార్యములయందును నన్ని వేళలయందును బ్రవర్తించుచుందురు. వీరెన్నఁడును నేకార్యమందును బరులకు హానికలుగఁజేయలేదనియు మనసునందైనఁ బరులకుహానిఁదలపెట్టని నవనీతమువంటి హృదయముగలవారనియు బరులకష్టములను దుఃఖములను దమకష్టములుగను దుఃఖములుగను బరిగణించు చక్కనిహృదయధర్మము గలసత్పురుషులనియుఁ జెప్పుట కెంతమాత్రము సందియము లేదు.

వీరు నలుగురును దేశాటనము చేయుటకు నిశ్చయించుకొని యొ కనాడు బయనమగుట కేర్పఱచుకొని తమ తమ యిండ్లయొద్ద జేయ వలసిన యేర్పాటుల నన్నిఁటినిఁ జేసికొనిరి. అంత నొకనాడు లోక నాథమొదలియారుగారు ప్రయాణసన్నద్ధుఁడై యుదయ మూఁడుగంటల కు బయలువెడలి తన సామాను నొక బండిపై వేయించుకొని తా నొక బండిపైఁ గూర్చుండి రైలుస్టేషను చేరిరి. వీరు చేరిన నాలుగైదునిమిష ములకు శెట్టిగారును తరువాత నాయుఁడుగారునుఁ పిమ్మట పిళ్ళగారు ను వచ్చి చేరిరి. వీరు తమతో రాముఁ డను నొకవంటవానిని కుప్పసా మి యనునొకసేవకుని దీసికొని పోవుటకు నిశ్చయించుకొనిరి. తరువా త వీరునల్వురు 2 వ తరగతి రైలుటికెట్లు తీసికొని తమసేవకులను సామానుతో మూఁడవతరగతిలోఁ గూర్చుండఁబెట్టి రైలుబండి యెక్కి రి. వీ రాదినము పవలును రాత్రియుఁ బ్రయాణముసేసి మరునా డుద యము తొమ్మిదిగంటలకు రఘునాథపురమును జేరిరి. అక్కడ వారుదిగి యాయూర రెండుదినములుండుటకు నిశ్చయించుకొని తమసామానును సేవకులను నొకటి రెండు బండ్లలో నెక్కించి తాము రెండుబండ్లలోనెక్కి యాగ్రామమున నొకచోట బసకుదుర్చుకొని వంటచేయించుకొని భోజన ముసేసి విశ్రమించిరి. ప్రయాణాయాసముచే నొడలుమరచి నిద్రపోయి సాయంత్రము నాలుగుగంటలకు మేలుకొనిరి. అప్పుడువారు తమదుస్తుల ను తొడిగికొని రాత్రి వంటకుఁ దగిన యేర్పాటులనుచేసి తమసేవకుల కుఁ దమసామానంతయు నొప్పగించి యూరుఁజూడ షికారుపోయిరి. తాము బసదిగిన గృహస్థునివలన నాయూరఁగల గొప్పవారిని తెలిసికొ ని వారిపరిచయము సంపాదించుకొనుటకు వారిఁజూడ నిశ్చయించుకొని రి. ఆసాయంత్రము కొందఱి పెద్దమనుష్యుల యిండ్లకుఁ బోయి వారి పరిచయము సంపాదించి తరువాత నాయూరనున్న క్లబ్బునకుఁ బో యిరి. ఆక్లబ్బువా రఁదఱు వీరిని సగౌరవముగ మన్నించి వార్తా

పత్రికలను చదువనందించియు టెన్నీసు, బిలియర్డ్సు మొదలగు వ్యాయామక్రీడలకు బిలిచియు ననేకవిషయములను గురించి మాటలాడియు సన్మానించిరి. టెన్నిసయినను బిలియర్డ్సయినను నాడమని యా క్లబ్బువారితోఁ గలిసి మొదలియారుగారును శెట్టిగారును నాయుఁడుగారినిఁ బ్రోత్సాహపఱచిరి. పిళ్ళగారు చతురంగ మాడనారంభించిరి. మొదలియారుగారును శెట్టిగారును మాత్రము సభ్యులతో మాటలాడుచుఁ బ్రస్తుతవ్యవహారములు గురించి చర్చించుచుఁ గాలముఁగడిపిరి. ఇట్లుసాయంత్ర మెనిమిదిగంటలవఱకు క్లబ్బులోనుండి తరువాత నక్కడి పెద్దమనుష్యులయొద్ద సెలవు తీసికొని బసకువచ్చి భోజనముచేసి బసదిగినయింటి యజమానునితోఁ గొంచెముప్రొద్దు ముచ్చటించి నిద్రపోయిరి.

మరునా డుదయమున వీరు నలుగురు వేకువ నిద్రలేచి తమతమ దుస్తులను తొడిగికొని నూతనపరిచితులగు స్నేహితులఁ జూడఁబోయి పదునాకొండు గంటలవఱకునుఁ జూడగలిగినంత మందినిజూచి వారి పరిచయము సంపాదించుకొని బసకు మరలివచ్చి భోజనముచేసి విశ్రాంతిఁజెంది తిరిగి మూఁడుగంటలకుఁ బ్రయాణమై యైదారుగంటలవఱకు నందఱినిఁ జూడ వారివారి యిండ్లకుఁబోయి క్లబ్బుచేరిరి. అక్కడనున్నవారిలోఁ బార్థసారథియను నొకనూతనస్నేహితునివలన నాయూరికిఁ బదేనుమైళ్ళదూరమున నున్న సత్యవరమను గ్రామములో దేవుని కల్యాణమహోత్సవము జరుగుచున్నదనియు నాకల్యాణోత్సవమునకు ననేకప్రదేశములనుండి జను లనేకులు చూడవత్తురనియు సత్యవరము ప్రసిద్ధమయిన యొక గొప్పక్షేత్రమనియుఁ దెలిసికొనిరి. మఱియు నామరునాఁ డక్కడరథోత్సవము మహావైభవముతో జరుగుననియు నాయుత్సవమునకు డిప్యూటీకలెక్టరు, తహశ్శీలుదారు, పోలీసు డిప్యూటీసూపరింటెండెంటు మొదలగు యుద్యోగస్థు

లును గొప్పగృహస్థులును వెళ్ళుదురనియుఁ బార్థసారథి వీరిలోఁ జె
ప్పి తానుఁ గూడ బోయెద ననియెను. అప్పుడు మొదలియారుగారు రట్టిమ
హోత్సవములం దప్పక చూడవలెననియు నాయుత్సవము తాముకూడఁ
జూడఁదగినదే యనియుఁ జెప్పెను. శెట్టిగారత్యుత్సాహముతో మనము
తప్పక పోవలెననియెను. పిళ్ళగారు తాము సమయమునకు వచ్చితిమ
ని సంతోషించిరి. నాయుఁడుగారు తామీక్షేత్రమునుగురించి యిదివఱ
కే వినియుంటిననియు నాక్షేత్రమున నున్న రథము మిక్కిలి గొప్పద
నియు నట్టి గొప్పరథము ప్రపంచమున నెక్కడనులేదని వాఁడుకఁగఁ
జెప్పుదురనియు నాయుత్సవమునకు మనము తప్పక పోవలయునని
యుఁ జెప్పిరి. వీరునలుగురును తమతోఁ గలసి రమ్మని పార్థసారథి
గారి నడిగిరి. ఆయన యంతకుఁ బూర్వమే పోనిశ్చయించుకొనినవాఁ
డు కావునఁ దాను వారితోఁ బయనమయి పోవుటకు నొప్పుకొని
తానే యారాత్రి బండ్లను సిద్ధపఱచెదనని చెప్పి తెల్లవారుజామున నా
లుగుగంటలకుఁ బయనమై పోవుటకేర్పఱచెను. మొదలియారుగారును
నాయనస్నేహితులును నింటికిఁ దిరిగివచ్చి భోజనముసేసి తమసామా
నంతయుఁ దమతోఁ దీసికొనిపోవుటకు నిశ్చయపఱచి నిద్రపోయిరి.
పార్థసారథిగారు తెల్లవారుజామున మూఁడుగంటలకే లేచి మొదలి
యారుగారు బసదిగియున్న యింటికి వచ్చి వారినిఁ బ్రయాణముసేసి
యందఱునుఁ గలిసి బండ్లెక్కి సత్యవరమునకు బయలువెడలిరి. వీరు
మార్గమధ్యమునఁ బార్థసారథిగారితో ముచ్చటించుచు నాయూరి
సమాచారమును నచటియుత్సవవిశేషమునుగురించి చెప్పుకొనుచు కాల
ముఁగడిపిరి. పార్థసారథి గారొకసచ్ఛూద్రకుటుంబమున జన్మించిన
వారు. ఈతనితండ్రి పోలీసు ఇన్స్పెక్టరుపని సేసి విశేషద్రవ్యమార్జిం
చి చనిపోయిరి. పార్థసారథి కొంతవఱకు విద్యనభ్యసించి తరువా
త జదువు మానివేసి నాటకములయం దభిరుచిచే నొకనాటకకంపెనీ

నేర్పఱచి రఘునాథపురమున నున్న పెద్దమనుష్యులందఱితో స్నేహభావముతో సంచరించుచుఁ బ్రతికార్యమునందును దాను జోక్యముకలుగఁజేసికొనుచు మిక్కిలి పనియున్నవానివలెఁ దిరుగుచు గాలముఁ గడపుచుండెను.

ఇట్లు వీరందరు గలసి ఆయుదయ మెనిమిదిగంటలకు సత్యవరగ్రామమును బ్రవేశించిరి. ఆయూరప్పుడు మిక్కిలి జనసమ్మర్దము గలిగియుండెను. ఎక్కడఁ జూచినను యాత్రాపరులు గనుపించుచుండిరి. కొందఱు గృహస్థుల యిండ్లలోపలను, గొందఱు వీధియరుగులమీఁదను, గొందఱు చెట్లక్రిందను, గొందఱు గల్యాణోత్సవమునకు వేయఁబడిన పాకలలోను, పందెళ్ళలోను, గొందఱు సత్రమునందును బసదిగియుండిరి. ఊరంతయు జనులతో నిండియుండెను. దొమ్మరవాండ్రు, విప్రవినోదులు, పగటివేషగాండ్రు, బొబ్బిలిపాటపాడువారు, యాచకులు, వికలాంగులు, దొంగలు మొదలగువారు గుంపుగుంపులుగాఁ జేరి యాత్రాస్థులను బీడించుచు బాధించి నడచుటకు మార్గమైన లేకుండ గ్రామమంతయు నిండియుండిరి. పార్థసారధి సత్యవరగ్రామమును జక్కఁగా నెఱిగినవాఁడు గావునను నదివరకట్టికల్యాణోత్సవముల నెన్నిటినోఁజూచి యున్నవాఁడు గావునను నాయూర నొకపాతానులయింట నొక పెద్దసావడియు నొకవిశాలమైన గదియు బసయేర్పఱచి సామానంతయు నందుదింపి రాముని గుప్పసామిని వంటచేయుమని యాజ్ఞాపించి మొదలియారుగారిని శెట్టిగారిని బిళ్ళగారిని నాయుఁడుగారిని దీసికొని యాయుత్సవము జూడవచ్చిన గృహస్థుల బసలకుఁ బోయెను. మొదలియారుగారును ఆయనస్నేహితులును స్నేహపాత్రులును పెద్దగృహస్థుల పరిచయలాభమును గోరువారును గావున నప్పుడక్కడకు విచ్చేసియున్న డిప్యూటీకలెక్టరు, తహాశ్శీలుదారు, డిప్యూటీసూపరింటెండెంటు మొదలగు నుద్యోగస్థులను నితరగృహస్థు

లను జూడఁబోయిరి. వీరు మొదట తహశ్శీలుదారుగారిని పోలీసు డిప్యూటీసూపరింటెండెంటుగారిని జూచి వారి పరిచయము సంపాదించుకొని పిమ్మట డిప్యూటీకలెక్టరుగారి బసకుఁ బోయిరి. ఆడిప్యూటీకలెక్టరుగారిపేరు అరుణాచలమునాయుఁడుగారు. ఆయన యీకల్యాణోత్సవముఁ జక్కఁగా జరుగునట్లు చేయుటకును యాత్రాస్థలకుఁ దగిన సదుపాయముల నేర్పఱచి యుత్సవములు చక్కఁగా జరుగునట్లుచేయుటకును సత్యవరము వచ్చి వారముదినములనుండి యచ్చటయున్నారు. వీరు జనులకు మిక్కిలి యనుకూలమైన సదుపాయముల నేర్పఱచి తానును గొంతలాభమును బొందుచుండెను. అక్కడకు క్రయవిక్రయములు చేసికొని ధనమార్జించుకొనవచ్చిన వర్తకుల యొద్ద వస్తురూపముగాను పాకలు, పందిళ్ళు, వేయించిన కంట్రాక్టర్లయొద్ద రొక్కరూపముగాను సమయోచితముగా వీలునుబట్టి తాము చేసిన యుపకారమునకుఁ బారితోషికములను నజరానాలను గ్రహించుచు వస్తువుల నన్నిటిని రొక్కముగా మార్చుట కొకదుకాణమును బెట్టించి మిక్కిలి శ్రద్ధతో నాయుత్సవమున రాత్రిందివములు పాటుపడి పనిచేయుచుండిరి. ఈనాయుఁడుగారు మిక్కిలి సరసులును స్నేహపాత్రులును అని ధనికులందరు గౌరవింతురు. కాని కొందఱీయన సద్గుణములను సమయోచితప్రజ్ఞను గ్రహింపఁజాలక బోసిపులినాయుఁడుగారని యందురు. డిప్యూటీకలెక్టరుగారగు నరుణాచలమునాయుఁడుగారు పార్థసారథిగారినదివఱకే యెరిగినవారుగావున నాయనను గౌరవించి యాయనవలన మొదలియారుగారిని వారిస్నేహితులను దెలసికొని వారినందఱను గౌరవించి యుచితాసనములపై గూర్చుండబెట్టిరి. పార్థసారథిగారు డిప్యూటీకలెక్టరుగారిని గూర్చియు నాయన సద్గుణములను గూర్చియు నాయన యిట్టియుత్సవములలో భక్తిశ్రద్ధలతో చేయు పనులను గురించియు వారు రాత్రిందివములు పడుచున్న కష్టమును గూర్చి

యు జెప్పి వారిని శ్లాఘించెను. అప్పుడు మొదలియారుగారికిని ఆయ న స్నేహితులకును డిప్యూటీకలెక్టరుగారితో నీవిధముగా గొంత సంభాషణము జరిగినది.

డిప్యూ—నేఁడు మిక్కిలి సుదినము. మీసంగతి నేనిదివఱకు వినియుండుటయే కాని మీదర్శనము నెన్నఁడు చేసియుండలేదు. మీలో తిరుమరిగయాళ్వారు నాయుఁడుగారు మాకు మిక్కిలి యాప్తులు. వారు నన్నెరుఁగక పోయినను నేను వారినెరుఁగుదును. వారితండ్రిగారు మిక్కిలిగొప్పవారు. వారిని నేనెన్నటికిని మఱువఁజాలను. నాకు ప్రథమమున వారే యుద్యోగము నిప్పించినారు. వారియొద్ద నేనొక సంవత్సరముపైగా పనిచేసినాను. తరువాత వారిని మఱియొక జిల్లాకు బదలాయించిరి. నాయుఁడుగారూ! మీదర్శనము నాకిన్ని దినములకు లభించినందులకు నాకు మిక్కిలి సంతోషముగానున్నది. నాకు మీతండ్రిగారియందుఁగల విశ్వాసముచేతను గృతజ్ఞతచేతను పరలోకగతులైనవారి దర్శనలాభము ప్రస్తుతము లభించక పోయినను మిమ్ములనైనఁ జూడవలయునని చాలకాలమునుండి నాకు గోరికగలదని ప్రమాణము చేయగలను. అయినను నట్టి లాభప్రాప్తి నాకు జిరకాలమునుండి తటస్థపడలేదు. నేటికి నా యదృష్టము మంచిదగుటచే నాచిరకాలాభీప్సితము దీరినది. డిప్యూటీకలెక్టర్లమగు మేము సాహసించి సెలవుదీసికొన్నచో మా సెలవు దినములైన తరువాతఁ దిరిగి పూర్వస్థానమునకు రాగలుగుట తటస్థింపదు. నే నీజిల్లాలో నైదారుసంవత్సరములనుంచి పని చేయుచు నీజిల్లాలో గొన్ని సంబంధములు గూడ జేసినాను. నేను సెలవుపుచ్చుకొన్న యెడల నన్నేజిల్లాకు బదలాయింతురోయను భయముచేత నొకదినమైన సెలవుదీసికొనకుండఁ బనిచేయుచు మిమ్ములను జూచుట కవకాశము లేక నీశరీరమమ్ముకొని

యిట్లు పని చేయుచున్నాను. నేఁడు మీయందఱిదర్శనము కేవల ముల భ్యయోగ మనుట కెంతమాత్రమును సందేహము లేదు.

మొదలి—మీ యోగ్యతయంతయు నేను పార్థసారధిగారివలన విని మిమ్ములను జూచువఱకు నాప్రాణములు గొట్టుకొన నిక్కడకు వచ్చినాను. పార్థసారధిగారివలన మిమ్మునుగూర్చియు మీయోగ్యతను గూర్చియు నేనిదివరలో వినినదానికిని నిప్పుడు చూచినదానికిని మిక్కిలిసంతోషముగా నున్నది. తిరుమంగయాళ్వారునాయుఁడుగారు మీకెట్టి యాప్తులో మాకును నట్టియాప్తులే గావున మీరు మాకు ముఖ్యమైన స్నేహితులు.

శెట్టి—అరుణాచలంనాయుఁడుగారు డిప్యూటీకలెక్టర్లందరిలోను మిక్కిలి మంచివారనియు నుత్తమోత్తములనియు నిదివఱకే వినియున్నాము. డిప్యూటీకలెక్టర్లందఱు నిట్టివారయినయెడల మనదేశము మిక్కిలి త్వరలోనే యభివృద్ధికి వచ్చుట కెంతమాత్రము సందేహము లేదు.

పిళ్ళ—మీదర్శనలాభ మీకల్యాణోత్సవము కంటె మిక్కిలి యెక్కువయని నాయభిప్రాయము. మీస్నేహము మాకీదినమున లభించుట మాపుణ్యముగాని మఱియొకటి కాదు. ఇది మాకు పార్థసారధిగారిమూలమునఁ బ్రాప్తించినది. వారి నెన్నటికి మఱువరాదు.

పార్థ—డిప్యూటీకలెక్టరుగారి యోగ్యతయు సుగుణసంపత్తియు వారితో స్నేహముచేసినవారికే గాని యితరులకు దెలియదు. వీరు సంపన్నగృహస్థులు. అయిదారులక్షల రూపాయీలు రొక్కము సంపాదించినారు. ఈనడుమ ఆర్బత్ నాటుకంపెనీలో బోయిన ధనముగాక నిప్పు డయిదారులక్షలున్నవి. వీరు మిక్కిలి మర్యాదగలవారు. వీరు జనులందఱితోను దలలోనాలుకవలె సంచరించుచు వారి గౌరవవిశ్వాసములకుఁ బాత్రులయి యున్నారు.

డిప్యూ—మీ రిక్కడ నున్నంతవఱకు నిక్కడకే భోజనమునకు ద యచేయవలెను. పార్థసారథీ! నీవుండికూడ వారిని వేరేస్థలమం దు బసచేయించుట న్యాయముగాదు. మీరందఱు నిచ్చటికే వచ్చి యుండవలసినది.

మొదలి—ఈపూటకు మమ్ము మన్నించవలెను. మేము సాయంత్రము భోజనమున కిక్కడికే వచ్చెదము.

పార్థ—మీ రేతొందరపనిలో నుందురోయని యూహించి మీబసలో స్థలసదుపాయముండునో! లేదో! యని వారిని సాతాని సీనయ్యా గారియింట బసకుదిర్చి యచ్చట నుండున స్లేర్పఱచినాను. ఆయి ల్లు మిక్కిలి సదుపాయముగా నున్నది. సీనయ్యయు నాతనికొ మాళ్ళిద్దరును నుదయము మొదలు సాయంత్రమువఱకు నూరిలో ది రుగుచుందురు. ఆయింటిలో మిక్కిలి సదుపాయముగా బసకుదిరి నది. మీసెలవుప్రకార మందఱము రాత్రి కిక్కడకే భోజనమున కు వత్తుము.

డిప్యూ—వారిని బసకుఁ దీసికొనిపోయి యక్కడవిడచి నీవయిన ని క్కడకు భోజనమునకు రాక తప్పదు.

పార్థ—చిత్తము. (అని అందఱు సెలవుదీసికొనిరి)

తరువాత వీ రైదుగురును బసదిగిన యింటికిఁబోయిరి. పార్థసా రథి వారి నచ్చటఁ దిగబెట్టి డిప్యూటీకలెక్టరుగారియింటికి భోజనము నకుఁ బోయెను. మొదలియారుగారును వారిస్నేహితులును భోజనము చేసి విశ్రమించిరి. పార్థసారథి డిప్యూటీకలెక్టరుగారితో భోజనము చే సి కొంతసేపు పేకాడుచుఁ గూరుచుండి తరువాత విశ్రమించెను. పి మ్మట సాయంత్రము నాలుగుగంటలకుఁ బార్థసారథి మొదలియారు గారి బసయింటికిఁబోయి వారితోఁగలసి కల్యాణోత్సవముఁ జూడనే గు దెంచిన పెద్దమనుష్యులలో గొప్పవారినిఁ గొందఱిని జూచి దేవాల

యమునకుఁ బోయెను. అచ్చటను నొకయరగంట దాదాపుగా నుండి దేవునిదర్శనము చేసి కొంతనూర ముత్సవములోఁ దిరిగి చీకటిపడుసమయమున కింటికిఁ దిరిగివచ్చెను. డిప్యూటీకలెక్టరుగారు సాయంత్రము మేడుగంటలకే భోజనము లగునుగావునఁ దమ్ము ద్వరలో దయచేయుమన్నారని మీనలుగురితోఁ జెప్పుమనిరని పార్థసారథి వారితోఁ జెప్పి తాను వేరేవనిమీఁదఁ బోయెను. మొదలియారుగారును స్నేహితులను తమతమ దుస్తులను దీసివేసి ధోవతులను ధరించి డిప్యూటీకలెక్టరుగారియింటికి భోజనమునకుఁ బోయిరి. డిప్యూటీకలెక్టరుగారును వీరు వచ్చువఱకే వీరికొఱకెదురుచూచుచుండిరి. తరువాత నందఱుగలసి భోజనము చేసిరి. వీరి భోజనము లగునప్పటి కెనిమిదిగంటలయినది. పిమ్మట నొకపావుగంట తాంబూలములు వేసికొనుచు మాటలాడుచు గూరుచుండి తమ బసకుఁ బ్రయాణమయిరి. డిప్యూటీకలెక్టరుగారు పార్థసారథిని దీసికొని వేఱేపనిమీఁదఁ బోయిరి. ఇట్లు మొదలియారుగారు మొదలగు నలుగురును బసకు వచ్చుచుండగా మార్గమున వీరికి నూతనపరిచితుఁడగు నొక పెద్దమనిషి గానుపించి యారాత్రి జరుగు "రథోత్సవముఁ జూడరా!" యని యడిగి "చాలఁ గొప్పయుత్సవము జరుగు" నని యాయుత్సవమును గూర్చి కొనియాడుచుఁ బలికెను. అంత మొదలియారుగారు బసలోనికిఁబోయి మరల నుత్సవముఁ జూడ బయలువెడలెదమని చెప్పిరి. శెట్టిగారు దా మచ్చటకు వచ్చిన గారణ మన్నివినోదములును జూచుట దక్క మఱి యేమి మున్నదనిరి. పిళ్ళెగారు తప్పక తా మాయుత్సవమునకుఁ బోదగినదనియు నిక్కడి రథము మిక్కిలి గొప్పదని తామిదివఱకే వినియుంటిమనియు సెలవిచ్చిరి. నాయుఁడుగారు డిప్యూటీకలెక్టరుగా రుత్సవమునకు రారా? యని యడిగిరి. దాని కానూతనపరిచితుఁడు డిప్యూటీకలెక్టరుగారు భోగముమేళములు చూడరనియు వారు గొందఱిస్నేహముకొఱకును నితర

కారణముల చేతను క్రొత్తగా "యాంటీనాచిగరల్ మువ్‌మెంటులోఁ" జేరిరనియు బహిరంగముగా భోగము మేళములు జూడరుగాని రహస్యముగా సర్క్యూటులో నున్న పుడెల్ల భోగము వాండ్రతోనే రాత్రులన్నియుఁ గడపుదురనియుఁ జెప్పి కలెక్టరుగారి చర్యలను గూర్చి కొంచెము పన్యసించెను. మొదలియారుగారును వారి స్నేహితులును దమ నూతనపరిచితుని యొద్ద సెలవుఁ గైకొని "యాంటీనాచిగరల్ మువ్‌మెంటు" నుగూర్చి చర్చించుచు బసచేరి తమదమదుస్తులను దొడిగికొనిరి. అందరు ట్రౌజర్సు, బూట్సు, పెద్దకోట్లు దొడిగికొని తలపాగలను ధరించిరి. పురుషులకు వస్త్రాలంకారముకన్న వేఱె యలంకారము లేదనియుఁ బురుషులు దమ కుచితమయిన వస్త్రములను ధరించినఁగాని సామాన్యజనుల వలన గౌరవమును బొందఁజాలరనియుఁ బురుషుల గౌరవమును వస్త్రాలంకారములం బట్టియే జనులు గ్రహింపఁగలుగుదురనియుఁ జక్కఁగా గ్రహించుటచే వీరందఱు దుస్తులను వేసికొని యలంకరించుకొని రథోత్సవమునకుఁ బోయిరి.

ఆనాడు రథోత్సవముఁ జూచుటకు జను లనేకులు వేనవేలుగా ననేకప్రదేశములనుండి వచ్చిరి. ఉత్సవమందలి జనసమ్మర్ద మింతింతని చెప్ప శక్యముగాదు. రథోత్సవము సాయంత్రము మూఁడుగంటలకే ప్రారంభింపఁబడెను. వీరుత్సవముజేరునప్పటికి తొమ్మిదిగంటలు పైగా నైనది. అప్పు డాజనసమ్మర్దములో రథమువద్దకుఁ బోవుటయే మిక్కిలి కష్టసాధ్యముగానున్నను దూరమున నెచ్చటనో గుంపులో గలసి యనామధేయులగు సామాన్యులవలె నుత్సవముఁ జూచుట తమ యాత్మగౌరవమునకును నౌన్నత్యమునకును దగదని యెంచి విస్తారముగు నాజనసమ్మర్దములోఁ బడి ముందుకు వెనుకకు నెంటఁబడుచు మోచేతిదెబ్బలు తినుచు, నిటునటు నీడ్వఁబడుచుఁ దలపాగలు క్రిందబడకుండఁ గాపాడుకొనుచుఁ దిట్లుదినుచుఁ గాళ్ళుత్రొక్కించుకొనుచు జుట్టల

నిప్పునఁ గాల్పఁబడుచు నతికష్టతరముగా రథముదగ్గర కీనలుగురుఁ బోయిరి. వీరునలుగురు నొండొరులను విడచినచోఁ దిరిగి తాము గలసికొనుట గష్టమనియెంచి యొకరిచేతినొకరు బట్టుకొని నడచుచుండుటచే జనులకు మఱింత యాటంకముగానుండి వారు వీరిననేకవిధములుగా బాధించిరి. దడిగట్టినట్లు వీరునలుగురు గలసి నడచుచుండుటచే వీరిని గొందఱు చేతులతోను జేతికఱ్ఱలతోను గొట్టుటఁగూడ సంభవించినది. ఉత్సవము సాంతముగాఁ జూడకయే బసకుఁ దిరిగిపోవుట పురుషలక్షణమును ధీరోదాత్తలక్షణమును గాదని వీరు చక్కఁగా గ్రహించినవారగుటచే నెట్టికష్టములకైనఁ బాలయి యెంతశ్రమకైన నోర్చి యొకటిరెండు పరియాయములు గాలు జారి మొదలియారుగారును శెట్టిగారును గ్రిందబడుట దటస్థించినను బట్టుదలతో నెట్టకేలకు రథమును సమీపించిరి. అక్కడ నొకడు నాయుఁడుగారిని వెనుకనుంచి త్రోయ, వారు రథచక్రముమీఁదఁ బడి కొద్దిగాయముతగిలి లేచిరి. అంతటఁ బిళ్లగారితలపాగ యిలాయిమంట నంటుకొని వేడియాముదము మొగముమీఁదఁ బడుటచే నాయన మొగముప్రక్కను గొంచెము కాలెను. ఎన్ని యాటంకములు గలిగినను నెన్నికష్టములు సంభవించినను ధీరులు దాముచేయ నిశ్చయించుకొనిన గార్యమును ద్యజింపరు. ఇట్లు వీరు నలుగురు నమితబాధలకుఁ బాలయి యెట్టకేల కతికష్టముగా రథము ముంద రాడుచున్న భోగముమేళ మెదుట నిలఁబడిరి. నాయుఁడుగారి మోకాలికి రథచక్రము మీఁదఁబడుటవలన సంభవించిన గాయమును బిళ్ళగారికి మొగము గాలుటవలన సంభవించిన గాయమును నెట్టిబాధ గలిగించుచున్నను వీరుఁ దమపట్టుదలను మానుకొనక గాయములు దగలనివారివలె బాధలనన్నిఁటిని దిగమ్రింగి మిక్కిలి యోరిమితో నుండిరి. మొదలియారుగారును శెట్టిగారును శ్రమచే నొగర్చుచు శరీరమంతయు జెమటలు గ్రమ్మఁ దాము గ్రిందఁబడుటచే దమదు

స్తులకంటుకొన్న దుమ్మును బురదను దుడిచికొనుచు నేమియుఁ దట
స్థించనివారివలె నటించుచుఁ దమయాపదల నెవ్వరైనఁ గనిపెట్టుదు
రేమో! యని మనసులో శంకించుచు నలుదిక్కులు జూచుచు నిలచి
రి. జను లెవ్వరైనఁ దమకు దటస్థమయిన పరాభవములను గ్రహించి
నచోఁ దాము పరిహాసాస్పదుల మగుదుమని మనసులో వీరికి సందేహ
మును భయమును లేకపోలేదు. అయినను దమ యాత్మగౌరవమును
నిలఁబెట్టుకొనుట కెన్నెన్ని యుపాయములనైనఁ బన్నుచుఁ దాముపడి
న యాయాసమునుఁ బ్రకటీకృతముఁ గాకుండఁ బ్రవర్తించుచుండిరి.
అప్పుడీనలుగురిని జూచి మేళములోని బోగమువాండ్రందఱు నతిపిన
యభయభక్తులతో సగౌరవముగా నొక్కొక్కరి కొక్కొక్కదండము
చొప్పున మందహాసముతో దండములు పెట్టిరి. మొదలియారుగారును
వారిస్నేహితులును దమకు బోగమువాండ్రు పెట్టిన దండమునందుకొ
ని యొండొరులతో మాటలాడుకొనుచుఁ దాముజెందిన పరాభవముల
ను గ్రహించి వారుమందహాసముచేసిరేమో! యని కొంచెము శంకిం
చి వారదిగనిపెట్టుట కవకాశము లేదని యెంచి ధైర్యముఁ దెచ్చు
కొని మందహాసములు చేయుచు నిలచిరి. వీరినలుగురిలోఁ బిళ్ళగారికి
మొగముమీఁదఁ గొంచెము కాలియుండుటచే నాగాయమువలన నను
భవించుచున్న బాధ యెంతదుర్భరముగానున్నను దాని నితరులగం
డ్లబడకుండఁ దప్పిపెట్టుట కవకాశములే దనిగ్రహించి యించుకైన
బాధలేనివానివలె నటించవలెనన్న యభిప్రాయముచేతనో! తనకు
సంగీతమందును నభినయమునందును గల యభిరుచిని బ్రకటింపనెంచి
యో! లేకఁ దనకు వీనియందుగల యభినివేశ మా మేళములోని బో
గమువాండ్రకు దెలిపి వారివలన రసికాగ్రగణ్యుఁడనని గౌరవింపఁబ
డవలయునను నభీష్టముచేతనో! మనము స్పష్టముగాఁ జెప్పలేము గా
ని తన యొద్ద వగర్చుచు నిలచియున్న సంగీతాభినయసముద్రుఁడగు ఫా

ట్టిగారు పెదవి గదల్పక యూరకున్నను బిళ్ళగారు మేళములోనున్న షిడేలువాయించువానిని మెల్లగాఁబిలచి యొకజావళీ నభినయించున ట్లాయాటగత్తెతోఁ జెప్ప సెలవిచ్చిరి. ఆయాటగత్తె చిరునగవునవ్వు చు సిగ్గునభినయించి యాజావళీని నభినయింప మొదలువెట్టెను. తరు వాత బిళ్ళగారు దనకభిముఖురాలై నిలచి యాడుచుఁ దనయాజ్ఞను శిర సా వహించి తనయందమితగౌరవమును భక్తిని జూపుచున్న యా యాటగత్తెవిషయములో రాయబారుల నంపుట నావశ్యమనియు న నుచితమనియుఁ గూడ నెంచి తానే స్వయముగా నేమేమో హస్తముల ను బట్టుమని చెప్పియుఁ గొన్నిజావళీలను బదములను నభినయించుమని పురమాయించియుఁ దనసంగీతాభినయశాస్త్రాభినివేశము నంతను వి చ్చలవిడిగాఁ బ్రకటించి నాయకీనాయకభావములను గూర్చి యడుగు చుఁ దెలియనివెల్ల దాము సెలవిచ్చుచుఁ దనశృంగారశాస్త్రజ్ఞానమం తయు నామేళములోవారికిఁ దెలియఁజేసిరి. అంతనీరథోత్సవ మొక బహిరంగప్రదేశమునకు వచ్చెను. అక్కడ రథము నిలపి భాగవత మాడుటకు నేర్పాటుపఁబడినది. భాగవతము చూచుటకదివఱకే చాల మంది జనులు వచ్చి కూర్చుండియుండిరి. రథోత్సవముతోవచ్చిన వా రందఱు నొకరికన్న నొకరుముందుగాఁ గూర్చుండవలయు నని తొం దరగాఁ బరువులెత్తి యాప్రదేశమునఁ గిక్కిరిసికూర్చుండిరి. అప్పు డు మేళములోనున్న భోగమువాండ్రందఱు మొదలియారుగారికిని వారిస్నేహితులకును నందుముఖ్యముగాఁ బిళ్ళగారికిని దండములువెట్టి యింటికిఁబోవ సెలవిండని యడిగిరి. అప్పుడు పిళ్ళగారు "ఈమేళ ములోనున్న యాటకత్తె కేమియయిన బహుమానమిచ్చి పంపించుట యుచితము ; కాని యీసంగతి మన నూతనస్నేహితులకును డిప్యూటీ కలెక్టరుగారికిని దెలిసినచో బాగుగ నుండదు. వారు 'యాంటీనాచి గరల్ మువ్ మెంటు'లోఁ జేరినవాఁడనికూడ తెలిసినది. భోగము మేళము

చూచుటయే కాక యందరియాటకత్తెకు బహుమానమిచ్చుట మరియొక గొప్పనేరముగా నీయన బరిగణింపక మానఁడు. కాని దాదాపు రెండుగంటలకాలము మన మిష్టమువచ్చినట్లెల్ల యాయాటకత్తెచే హస్తములు పట్టించి పదములను జావళీలను నభినయింపఁ జేసి యిప్పుడేమియు నీయకయే పంపించుట నా గౌరవమునకుఁ దగదు. దీని కేమియైన నిచ్చినచో 'యాంటీనాచిగరల్ మువ్‌మెంటు' వారికిఁ దెలియుటకు వీలుగనుపింపదు. ఒకవేళ యీమేళములో వాండ్రే గొప్పకొఱకు మాకుఁ బిళ్ళగారు బహుమానమిచ్చిరని చెప్పుదురేమో! యనిసందేహముతోఁ చుచున్నది. నీకు బహుమానమిచ్చిన సంగతి యితరులతోఁ జెప్పవలదన్నచోఁ మన పిఱికితనము వెల్లడియగును. అందువలనఁ గార్యము మఱింత పాడుగావచ్చును" అనికొంతసేపాలోచించి "యింతకు నాయాత్మగౌరవమును మరియాదయు నిలబెట్టుకొనుట ముఖ్యము. గౌరవమును నిలబెట్టుకొనుటకు నాస్వంతద్రవ్యములోనుండి సంతోషపూర్వకముగ నాలుగురూపాయీ లిచ్చినచో నెవరికేమి నష్టమున్నది. ఈయాంటీనాచిగరల్ మూవు మెంటువారి పుట్టియేమి మునిఁగినది. ఈయాంటీనాచిగరల్ మూవు మెంటువారు జనులకు మహోపకారమును చేయుచున్నామను నహంభావముతో జనులస్వాతంత్ర్యమునకు నడ్డమువచ్చుచున్నారు. ఇదియెంతమాత్రమును నుచితము గాలేదు. ఈనడుమ యొక పెద్దమనుష్యుఁ డొకచారును మగవాండ్రునుఁ గలిసి యాడిన నాటకమును జూచి వారి నాటకప్రయోగములు మిక్కిలి యాహ్లాదకరముగా నుండుటచే సంతోషపూర్వకముగ బహుమానమిచ్చెను. ఆస్వల్పవిషయమును నత్యధికముఁ జేసి యతని నిందించుచు బహిరంగముగా నాక్షేపించుచు వార్తాపత్రికలకుఁగూడ వ్రాసి యల్లరిచేసినారు. ఇదియంతయు నీయాంటీనాచిగరల్ మువ్‌మెంటువారే ప్రకటించి పాపమాగృహస్థుని నవమానపఱచిరి. ఈయాంటీనాచిగరల్ మువ్‌మెంటువారు దూరాలోచనను

లేనివారని నా తాత్పర్యము. భోగమువాండ్ర యాటపాటలకుఁ బ్రోత్సాహము చేయకపోయినచో వాండ్రు గర్హితమగు తమవృత్తినిఁ ద్యజింతురని యూహించుట యంత సహేతుకముగా నాకుఁ గన్పింపదు. భోగమువాండ్రు తమయాటపాటలవలన ధనమార్జించి జీవనము సేయకపోయినచోఁ దమకాలమంతయు వ్యభిచారవృత్తియందే కడపి దేశమునకు హాని కలుగఁజేయుదురు. కాఁబట్టి వాండ్రను నాటపాటలకుఁ బిలువక నిరుత్సాహపఱచుటకంటె వారి యాటపాటలకుఁ బ్రోత్సాహము కలుగఁజేయుచు వారికి హితోపదేశము సేసి, గర్హితమయిన వృత్తిని విడిచి వివాహములు చేసికొని ధర్మపత్నులై సుఖమున గౌరవముతోఁ గాలముఁ గడపునట్లు చేయుట మంచిది. ఈకారణమునుబట్టియు మరియు నీభోగమువాండ్రకు నీయుత్సవముల లభించు స్వల్పలాభము నెంచియు నింతియె కాక వీరియుత్సవసమయములో స్వల్పలాభమునకు నాశపడి బహుదూరమునుండి తమవారిని విడిచి యిక్కడకు వచ్చి యాడుమన్నప్పు డాడి పాడుమన్నప్పుడు పాడి వెట్టికిఁ దహసీల్దారుగారు పోలీసుద్యోగస్థులు మొదలగువా రందఱియభీష్టములను దీర్చుచుఁ బాటుపడుచున్న వీరియందు జాలిచెందుట. న్యాయముగాని యాగ్రహపడుట న్యాయముగా దనిదలఁచియు వారికి హితోపదేశము చేసి సన్మార్గమునకుఁ దేవలయును గాని వారు గానాభినయవిద్యలను ద్యజించి మఱింతపాడై దేశమందుఁ బెనుభూతములవలె సంచరించుచు జనులను బాధచేయునట్లు చేయుట ధర్మముగాద'' నుగారణమును బట్టియు పిళ్లగారా యాటగత్తెకు బహుమానమిచ్చుటకే నిశ్చయించుకొనిరి. మఱియుఁ బిళ్ళగారీపనికి సాహసించుటకింకొక రహస్యకారణము గలదు. బహిరంగముగా భోగమువాండ్ర యాటపాటలను గనియు వినియు వారికిఁ బ్రోత్సాహముఁ గలుగఁజేయక "యాంటీనాచిగరల్ మువ్మెంటు" లోఁ జేరి యుపన్యాసపీఠములనుండి

నీతు లుపదేశించుచు రహస్యముగా లంజల గుడిసెలలో దూరు వాక్స్వారులగు మహానుభావుల నెందరినో యీయన రెఱుఁగుదురు. ఈ కారణము లటుండ నలువదియేండ్లకు లోపుండనివయసు గలిగి తమ గొమార్తెలకుఁగాని దమయక్క చెల్లెండ్ర కొమార్తెలకుఁగాని దమచెల్లెండ్రు మొదలగువారికిఁ గాని వివాహములు జేయువారును వివాహములు చేయఁదలపెట్టినవారును యాంటీనాచిగరల్ జాతిలో నెన్నఁబడక వారి యిండ్ల జరుగువివాహోత్సవములకుఁ బోయి వారి నాదరించి గౌరవించిన మహామహుల నెందరినో యీపిళ్ళగా రెఱుఁగుదురు. కాఁబట్టి యీబలమైనకారణములను బట్టి యేదోషము నెఱుఁగని యీపిళ్ళగా రామేశమందలి యాటగత్తెకు బహుమానమిచ్చుటకే నిశ్చయించుకొని కోటుజేబులో జేయివెట్టి యందేమియు లేకపోవుటచే ధారాళమైన మనస్సులో నించుకైన సందియముఁ బూనకఁ దనబస యానవాలు చెప్పి మరునా డుదయమే౯గంటలకుఁ దన్నుఁజూడుమని యాయాటగత్తెతోఁ జెప్పెను. ఆయాటగత్తెయు జిత్తమని వినయగౌరవములతో దండము వెట్టి సెలవుదీసికొని పోయెను.

తరువాత నాప్రదేశమున భాగవతము జరుగునని వీరు నలుగురు దెలిసికొని యీభాగవతము గూడ గొంతచూడవలయునని నిశ్చయించుకొని తమయాత్మగౌరవమునకును దమమర్యాదకునుఁ దగినప్రదేశమున ముందు గూర్చుండవలయునని యూహించి తమతరువాత వచ్చువారుఁగూడఁదమ ముందు గూర్చుండుట కవకాశములేకుండ భాగవత మాడుటకు మిగిలియున్న ప్రదేశములో సగము భాగ మాక్రమించుకొని స్వస్థచిత్తులై గూర్చుండిరి. తరువాతఁ గొంతసేపటికి భాగవత మారంభించుటకు భాగవతులు వచ్చిరి; కాని భాగవత మాడుటకు రంగస్థలము లేకపోవు టటుండ కాగడాలు వేయుటకైన నవకాశము గనుపించలేదు. అప్పుడు భాగవతము చూడవచ్చిన జనులను నీనలుగురిని

వెనుకకు జరుగుడని కాగడాలతోను కర్రలతోను పెద్దపెద్ద కేకలు పెట్టి చెప్పుచు వెనుకకుఁ దరిమిరి. అప్పుడు మొదలియారుగారును శెట్టిగారును వారి స్నేహితులిద్దరును దాము లేచినచోఁ దమ ముం దెవ్వరైన వచ్చి కూర్చుందురని శంకించి లేవకయే దమతమ శరీరలాఘవమునకు దగినంత తొందరగా వెనుకకు జరుగ నారంభించిరి. ఆసమయములో గొందఱు వీరి ముందుఁ గూర్చుండి వీరిని వెనుకకుఁ ద్రోయ నారంభించిరి. అట్లు వీరిముందుఁ గూర్చుండుట తటస్థించినవారు గదలఁగలిగినంత లాఘవముతో నీనలుగురును వెనుకకుఁ గదల జాలని కారణమును బట్టియుఁ బ్రక్కలనున్నవారు వీరిపై బడుటచే వీరు సులభముగా వారిని వారించుకొననేరని హేతువును బట్టియు శెట్టిగారి తలపాగ క్రిందబడుటయు మొదలియారుగారు వెల్లకిలఁబడుటయు నాయఁడుగారును బిళ్ళగారును గుంపులోఁ గదలనేరకఁ జిక్కులుపడుటయు మొదలైనగొన్ని బాధలు వీరికిఁ దటస్థమగుట సంభవించినది. ఈనలుగురు నీవిధముగా శరీరాయాసమును బడుచుఁ దమ్మెఱిగినవారెవ్వరు దాము పడుచున్న కష్టములను జూచుట సంభవించకుండు టీయవస్థలో నొకగొప్పయదృష్టముగా నెంచుకొనుచుండిరి. అప్పుడు వెనుకనున్న గుంపులో నిద్దరు లేచి గట్టిగా మాట్లాడుకొనుచు నొండొరులను దూషించుకొనుచుఁ గయ్యమాడఁ జొచ్చిరి. ఆయల్లరి విని కొందఱు లేచి యలజడి గలుగఁజేసిరి. ఈసమయములో నొకప్రక్కనుండి "వెఱ్ఱికుక్క వెఱ్ఱికుక్క" యను నొక కేక వినిపించ నాప్రక్కఁ గూర్చున్నవారందఱు నొక్కసారిగా లేచి రెండవప్రక్కకుఁ బోసాగిరి. ఇట్లందఱు లేచి యల్లకల్లోలముగా సభలో నల్లరి చేయుచుండ మన కథానాయకులగు నీనలుగురు పెద్దమనుష్యులును దాము గూర్చుండియున్న ప్రదేశమునుండి సులభముగా త్వరితముగా లేవఁగలుగుటకుఁ దమశరీరస్థితులను బట్టియు నాసమయమునఁ దామున్న యవస్థలను బ

ట్టియు వీలు గలిగియుండక పోవుటచేఁ గొందఱు కాళ్ళక్రిందఁ బడవలసిన యిఁకొక నూతనావస్థఁ గూడ వీరికి సంప్రాప్తమయ్యెను. ఈవిధముగా వీరు పలువిధములగు నవస్థలకుఁ బాలయి యెట్టకేలకు నేలఁజేతులానుకొని మెల్లగా లేఁచి నిలబడి తమనలుదస్తులను లేఁచి యిట్టిటుకదలుచున్న జనులగుంపులో నుండి యావలకుఁ దప్పించుకొని పోఁగలుగుట మిక్కిలి దుర్ఘటముగాఁ గనుపింప "లేవవద్దు కూర్చోండి, కూర్చోండి" యని కొందఱు పోలీసుభటులచేతను మఱికొందఱిచేతను సత్యవరగ్రామమునసబు కరణములచేతనుఁ బెద్దపెద్ద కేకలతోను చేతిబెత్తములతోను నదలింపఁబడిరి. తరువాత వీరతికష్టముమీఁద నీవలఁబడి యాయుత్సవమునకుఁ దమ నూతనపరిచితులగు డిప్యూటీకలెక్టరుగారు మొదలగువారు వత్తురను నుద్దేశముతో వచ్చితిమి గాని లేనిచో రాఁదగినది కాదని తమలోఁదా మనుకొనుచుఁ దమయవస్థ నంతనుఁ దమ్మెఱిగినవా రెవ్వరును జూచి యుండకుండు టొకగొప్ప యదృష్టమని సంతోషించుచుఁ దాముఁ బడినశ్రమచే వగర్చుచుఁ దలపాగలను సవరించుకొనుచు "నేమియుఁ బోలేదుగదా" యని యొండొరుల నడిగి దెలసికొనుచు మెల్లగా బసకుఁ దిరిగివచ్చిరి. వీరు బసకుఁ వచ్చువఱకు రాముఁడును గుప్పుసామియు వీథతలుపు తాళమువేసి యుత్సవముఁ జూడబోయిరి. ఇంటివారందఱు భాగవతముఁ జూడబోవుటచే నెన్ని కేకలు పెట్టి పిలచినను నెవ్వరును బలుకలేదు. అప్పుడు తాము చేయఁదగినదేమియు లేక శ్రమదీర్చుకొనుచుఁ జల్లగాలిచేఁ దమతమ యాయాస ముపశమింపఁజేసికొనుచు వీథియరుగుపైఁ గూర్చుండిరి. పిళ్ళగారును నాయుఁడుగారును దమకు సంప్రాప్తమైన గాయములకుఁ దత్కాలచికిత్సలనైనఁ జేసికొని బాధ నుపశమింపఁజేసికొనుట కుపాయము గానకఁ దమతమ బాధలనుఁ దమగడుపులోనే యిముడ్చుకొనియు మొదలియారుగారును శెట్టిగారును దమతమదుస్తులు కొన్నిచో

ట్లఁ జిరిగిపోయి వానికి దుమ్మంటుకొని యుండఁ గాలిదెబ్బలచేతను మోఁచేతిపోట్లవలనను దమ సుకుమారశరీరముల కాయాసము గలుగఁ దా మింతటితో నింటికిఁ దిరిగి రాగలుగుటకు సంతోషించుచుఁ దమసేవకుల కెదురుచూచుచు దూరమున నెవ్వరుఁగానుపించినను దమసేవకులేయని భ్రమచే సంతోషించుచు వారు దమ్ముఁ జేరరాక దారిని బోవుచుండుటఁ గాంచి యాశాభంగముచే మనసు నొవ్వ నేసాధనమును గానక నిమిష మొకసంవత్సరముగాఁ గడపుచుండిరి.

ఈవిధముగా వీరు రెండుమూడుగంటలకాలము గడపవలసివచ్చెను. తరువాత రాముఁడును గుప్పుసామియు వచ్చిరి. వారిమొగములు చూడఁ గలిగినప్పుడు వీరికొక గొప్పనిక్షేపము దొఱకినట్లును దమకష్టమంతయు దీరినట్లును వీరికిఁగలిగిన సంతోష మింతింతని చెప్పనశక్యము. ఆసంతోష మీనలుగురు నుండవలసివచ్చిన యవస్థలో నుండి యనుభవించిన వారికేగాని యితరులకుఁ దెలియదు గదా!

వీరునలుగురు నరుగుమీఁదఁ గూర్చున్నప్పుడు పిళ్ళగారికి మేళములో నాడినబోగముది బహుమానముకొఱకుఁ దెల్లవారినతోడనే తమ బసకు వచ్చునన్న సంగతి జ్ఞాపకమునకు వచ్చి గుండెలలో ఱాయిపడినది. పెద్దమనుష్యులమని చెప్పుకొనుచు గౌరవముగా నాయూర డిప్యూటీకలెక్టరు మొదలగు గొప్పవారితో స్నేహముచేసి వారిసన్మానములనందుచున్న దమయింటికిబహిరంగముగాఁ బట్టపగలేడుగంటలకిరువదియేండ్లవయసుగల బోగముదివచ్చుటందఱికండ్లఁబడక తప్పదనియు బోగముది దారినిబోవునప్పుడే పదిమంది వెంటఁబడుచుందురు గాన నట్టియుత్సవసమయములో నెందఱు వెంటవత్తురోయనియు, నదియొంటరిగా రాకఁ దనతోనెవరెవ్వరిని దీసికొనివచ్చునో యనియు, నిదియంతయుఁ జూచిన వారు బహుమానమందుకొనుటకేవచ్చినదని నమ్ముటఁ దటస్థింపదనియు నీసంగతి డిప్యూటీకలెక్టరుగారికిఁ దెలిసిన

చో నాయన 'యాంటీనాచిగరల్ సమాజము'లోనివాఁడగుటచేఁ దను
మానమర్యాదలకు భంగము గలుగుట నిశ్చయమనియుఁ దలఁచి యు
దివఱకుఁ దటస్థమయిన యాపదలటుండ నీగ్రొత్తయాపదగూడఁ దె
ల్లవారినతోడనే తటస్థమగునని గుండెలలో బ్రాయిపడ నాలోచించుచుఁ
బిళ్ళగారు మతిపోయినవానివలె గూరుచుండెను. అంత నాతఁడు దన
యాత్మగౌరవము నిలబెట్టుకొనుటకుఁ దానే తెల్లవారకపూర్వమే చీక
టియుండగా నాభోగముదానియింటికిఁ బోయి దానికియ్య నిశ్చయిం
చుకొని వాగ్దానముచేసిన బహుమానమును చేతఁదీసికొని దానికిచ్చి యు
ద తెల్లవారినతరువాత బసకు రాకుండఁజేసి యప్రతిష్ఠకును నపవాద
లకును బాలుగాకుండఁ దనమర్యాదను గాపాడుకొని తన వాగ్దానము
ను నెఱవేర్చి యన్నమాట దప్పకుండ సంచరించుటవలనఁ దన యం
తరాత్మకు సంతోషము గలుగఁజేసికొన నిశ్చయించుకొనెను. అట్లుగా
క నాభోగముదానియింటికా చీకటిలో నడచిపోవుట శ్రమయని బ
ద్ధకించి నిద్రబోయి మరునాడు వేకువతోడనే యేఁడుగంటలకుఁ బూర్వ
మే వీధిలోనికిఁబోయి భోగముదంటికివచ్చు సమయమున కింటలేకుం
డఁ దప్పించుకొందమన్నచోఁ దానిచ్చెదనన్న బహుమానమియ్యక
దానిని దప్పించుకొని మొగముదాచికొన్నట్లుండుననియుఁ దా నప్ప
డు దానికిఁ గనుపించకఁ దప్పించుకొనఁ గలిగినను నది దానాయూ
రనున్నంతవఱకుఁ బిశాచమువలెఁ బీడించి యొకమాటికిమారుగా బ
దపర్యాయములు దనయింటిచుట్టును దిరిగి "బహుమానముకొఱకింటికి
రమ్మని" రని యందఱితోఁ జెప్పి యల్లరిచేసి యందఱకుఁ దెలియున
ట్లు చేయుటవలన మఱింత యల్లరియగుననియుఁ దా నట్లుచేయుటవ
లన నిహపరములకు రెండిటికినిఁ గూడ హానిసంభవించుటయేగాకఁ
దనగౌరవమునకువిశేషభంగముఁగూడదటస్థించుననియుఁ దెలసికొనిరా
ముఁడును గుప్పుసామియు వచ్చి తలుపుదీసినతోడనే నాలుగురూపాయా

లు దీసికొని దానియింటికి వెళ్ళుటకు నిశ్చయించుకొని ప్రయాణోన్ము
ఖుఁడై వారికొఱ కెదురుచూచుచుండెను. ఒకవేళఁ గార్యావసరమె
ఱుఁగని యీయవివేకులుత్సవము జూచు వేడుకలోఁ దమయజమాను
లను మఱచిపోయి తెల్లవారువఱ కింటికి రాకపోవుట దటస్థించునేమో
యన్న భయమీతనకు లేకపోలేదు. ఏది జరిగినను యీయనా సమ
యమునఁ జేయఁదగిన దేమియు లేదుగదా! ఇట్టిసమయములో దైవస
హాయముకన్న నేమియు సాధనములేదని చదువరులే గ్రహింపవలెను.

రాముఁడును గుప్పసామియు నుత్సవముఁ జూచి బసకుఁ దిరిగివ
చ్చి తలుపు తాళముఁ దీసి తమయజమానుల నింటఁ బ్రవేశపెట్టునప్ప
టికి దాదాపు మూడుగంటలు గావచ్చినది. తలుపు తెఱచినతోడనే
పిళ్ళెగారు లోపలకుఁ బోయి నాలుగురూపాయీలు జేబులో వేసికొ
ని యిప్పుడే వత్తునని తనస్నేహితులతోఁ జెప్పి వీధిలోనికిఁ బోయెను.
మొదలియారును శెట్టియు నాయుఁడును దుస్తులను దీసివేసి తలుపు వి
గించక వెలుపలఁ దమసేవకులను బరుండుమని చెప్పి ఆయాసముచే
నొడలెఱుంగక నిద్రపోయిరి. ఇట్లు వీరు ముగ్గురును దమస్నేహితుఁడ
గు పిళ్ళెగారు దనమొగమునకుఁ దగిలినగాయమునకుఁ జికిత్స చేసికొ
నుటకు బోయిరని యనుకొనిన ననుకొని యుండవచ్చును గాని వా
రావలకు బోయిన రహస్యకారణము మాత్రము వారెఱుఁగరు. వారి
కాసంగతి దెలిసినను వారికామోదకరముగానే యుండును గాని త
ప్పులేదు. గాని పిళ్ళెగారు తెల్లవారకపూర్వమే యీకార్యమంతయు
సానుకూలము చేసి యింటికిఁ దిరిగి రావలయునని యావలకుఁ బోవు
తొందరలో నేసంగతియుఁ దనస్నేహితులతోఁ జెప్పలేదు. మొదలి
యారుగారును, శెట్టిగారును, నాయుఁడుగారును తమతమదుస్తులను దీ
సివేసి నిద్రపోవలయునన్న తొందరలో నెక్కడకుఁ బోవుచున్నావని
గాని యెప్పుడు తిరిగి వత్తువని గాని పిళ్ళెగారి నడుగలేదు. కాని తమ

స్నేహితుఁడు త్వరలో వచ్చునని మాత్రము నిశ్చయముగా నమ్మి తలుపు బిగించుకొనకయే నిద్రపోయిరి.

పిళ్ళగారు కొంతదూరము నడచి తాను దొడిగికొనియున్న దుస్తుతో భోగముదాండ్రు బసదగియున్న యింటికిఁ బోవుటవల్ల రహస్యముగాఁ జేయఁదలఁచిన కార్యము బహిరంగమై దానందఱి కండ్లబడుటయుఁ దనదుస్తునుబట్టి తన్నానవాలు పెట్టుట గూడఁ దటస్థమగునని యెంచి ధోవతిపైనఁ దాను ట్రౌజరు దొడిగికొన్న సంగతి జ్ఞాపకము దెచ్చుకొని దారిలో నొకచోట దనట్రౌజరును దీసి తలపాగను ట్రౌజరును చంకలోఁ బెట్టుకొని తాను దొడిగికొనియున్న పెద్దకోటు త్రిప్పి నెత్తికి ముసుగువేసికొనెను. ఇట్లు ముసుగువేసికొని కొంతదూరము నడచి తాను గాళ్ళకుఁ దొడుగుకొన్న బూడ్సు చప్పుడగుచుండుటయు నవి మధ్యమధ్య గిట్టుపెట్టుచుండుటయుఁ దెలసికొనియట్టిచప్పుడుతో నీరహస్యవ్యాపారమునకు బోవుట మంచిదికాదని యెంచి వానినూడదీసి వానిని మేజోడును గూడ చంకఁ బెట్టుకొని నడువనారంభించెను. అట్లు కొంతదూర మేగిన తరువాత భోగముదాండ్రు బసచేసియున్నచోటుఁ దెలియక యెచ్చటికిబోవుటకును దెలియక నేమిచేయుటకును దోచక యెచ్చటికిఁబోవలయునో దెలియకుండ బయలుదెడలినందుకుఁ దన్నుతానే నిందించుకొనుచు నెవ్వరినైన నడిగినచో రహస్యము వెల్లడియగుననియు నారాత్రి భోగముదాండ్రబసకు బోవుచున్న సంగతి దెలసి తన్నుగూర్చి యనుమానపడి యపవాదలాడుదురనియు నిట్టిసంగతులెంత రహస్యముగాఁ జేసినను వెల్లడికాకమానవనియు శంకించి యేమిచేయుటకును దోచక పిచ్చివానివలెఁ దిరుగనారంభించెను. తానింటికి దిరిగివచ్చినచోఁ దానుపడిన శ్రమయంతయు వృథాశ్రమ మగుటయే గాకఁ గార్యసానుకూలము కానేరదని యెంచి పిళ్ళగారు వెనుకఁదిరుగుట కిష్టపడలేదు. అప్పటికించుమించుగా నాలు

గుగంటలైనది. భోగమువాళ్ళ బసకొఱకు వీథులవెంబడిఁ దిరుగుట వలనఁ గాలహరణమై తెల్లవారుటయుఁ దానాస్థితిలో నందఱికండ్లఁ బడుటయు గూడఁ దటస్థమగునని పిళ్ళగారు భయపడి తనకెదురుగావచ్చుచున్న నొకపురుషుని గాంచి యాతనినడిగి భోగమువాండ్ర బస తెలిసికొందమని యూహించెను. కాని "భోగమువాండ్ర బసయొక్కడ" నని యడిగినచో నాతఁడనుమానపడక మానఁడనియు నాతఁ డొకవేళ దనకుఁ దెలియదన్నచోఁ దనరహస్యమతనికిఁ జెప్పియు లాభములేకయే పోవలసివచ్చుననియు నొకవేళ నాతఁడు బుద్ధిపూర్వకముగఁ గాని తెలియకగాని తప్పుత్రోవ చూపించినచో నెవరియింటికిఁ బోయి భోగమువాండ్ర యిల్లనుకొని మఱింత కష్టమునకుఁ బాలౌదునో! యనియు నితనికి సందేహము తోఁచెను. ఏమైననుఁ దెల్లవారులోపల యీ భోగముదానికి బహుమానమియ్యక తీరదు కావున నాతఁడేమనుకొన్నను నేమిసేసినను సరియే యని దైవముమీఁద భారమునైచి యాతని మెల్లఁగాఁ జేరి సంభాషణములోనికి దింపి యాతనికిఁ దెలియకుండ యుక్తియుక్తముగఁ దనగడుసుతనమును దెలివిని సంపూర్ణముగా వినియోగపఱచి భోగమువాండ్ర యిల్లు దెలిసికొన నిశ్చయించుకొని యాతనితో నీక్రిందివిధమున మాటలాడెను.

పిళ్ళ—మీరెచ్చటనుండి వచ్చుచున్నారు.

ఆమనిషి—ఉత్సవము చూడఁబోయి భాగవతము కొంత చూచి యింటికిఁ బోవుచున్నాను.

పిళ్ళ—ఈయుత్సవము బహుచక్కఁగా జరిగినదనుమండీ?

మని—ఈకళ్యాణోత్సవ మేటేట మిక్కిలి వైభవముతో జరుపఁబడును. ఈసంవత్సరము కూడ యదేప్రకారము చక్కఁగానే జరిగినది. మీరెచ్చటినుండి వచ్చుచున్నారు.

పిళ్ళ—నేనును కళ్యాణము చూచి యింటికిఁ బోవుచున్నాను. యా

గ్రాస్థులకు మంచినదుపాయములు సేయఁబడియున్నవి సుమండీ!

ముని—డిప్యూటీకలెక్టరుగారును తహస్సీలుదారుగారును వారమువది రోజులనుండి యిక్కడనే మకాము సేసి యీ సదుపాయములన్ని టిని జేసినారు.

పిళ్ళ—ఈరాత్రి యుత్సవములో నాఁడిన బోగముమేళ మెక్కడిదో కాని యందులో నభినయించిన బోగముమనిషి మిక్కిలి తెలివికల ది సుమండీ!

ముని—వాళ్ళ దీయూరు కాదండి నేఁడాడిన బోగముమనిషి చక్కఁగాఁ బాడకలదు. దానిపాట మీరు వినలేదని తోఁచుచున్నది. అదమి క్కిలి తెలివికలది. దానినీచుట్టుపట్ల మేళములకుఁ దరుచుగ బిలు చుచుందురు.

పిళ్ళ—పాపము వాళ్లెక్కడ బసచేసినారండి?

ముని—వాళ్ళకు బసయనఁగనేమి? ఏయింటి వీధిగదిలోనో బసచేసి యుందురు. రాత్రివేళల డిప్యూటీకలెక్టరుగారింటికో తహస్సీలుదా రుగారియింటికో మఱియేగృహస్థునియింటికో వచుచువాండ్రందరు పోయి యచ్చటనె బరుండుదురు. మేళములోనున్న ముసలిది మాత్రమొకతిరియె సామాను భద్రముగాఁ జూచుకొనుచు నాబసలో నిద్రించును. తక్కినమగవాండ్రు తమయిష్టమువచ్చినచోటికిఁ బో యి యుందురు. వీండ్రకు బసయనఁగనేమి. బోగమువాండ్రకు ర సికులయిండ్లన్నియు స్వగృహములే.

పిళ్ళ—ఈమేళ మెక్కడబసచేసినదండి?

ముని—ఆముందు గనిపించుచున్న యడ్డత్రోవను నెడమవైపునకుఁ బోనఁ గుడిచేతివైపున నాల్గవదైన రౌత్తరఁగులయింటిలో వీధిగది లో బసదిగినారు. (అనిచెప్పి) పిళ్ళగారి వేషమును నాతఁడు తన తో మాటలాడినసందర్భములేని మాటలనుబట్టి యీతఁడు బోగము

వాండ్ర బసకుఁ బోవుచున్నాఁడని గ్రహించి యాతఁడు కొంతదూరము పోయిన తరువాత యాతనికిఁ దెలియకుండ మెల్లఁగాఁ నాతనిఁ గనిపెట్టుచు నడువసాఁగెను. పిళ్ళగారు చీకటిచాటున మెల్లఁగా నడచి యారెత్తరఁగులయిల్లు సమీపించి గుమ్మములో నున్న మెట్లొకటి రొకటిగా మెల్లఁగనెక్కి యరఁగుమీఁద ప్రవేశించి గదిగుమ్మముఁ జేరి మెల్లఁగాఁ దలుపుఁ గొట్టెను.

లోపలనుండి—ఎవరువారు?

పిళ్ళ—తలుపుతీయుము.

లోపల—మీ రెవరో చెప్పినఁగాని తలుపుతీయుటకు వీలులేదు.

పిళ్ళ—నే నెవరో చెప్పెదను. ముందు తలుపుతీయుము.

లోపల—మీ రెవరో చెప్పనిదే యీరాత్రివేళ నే నెట్లు తలుపుతీయుదును! ఈయుత్సవములో దొంగలభయము విస్తారముగా నున్నది. మీ రెవరో యెందుకు వచ్చినారో! చెప్పనిదె నేను తలుపు తీయను.

పిళ్ళ—నేను దొంగను గాను, గొప్పవాఁడను, పెద్దమనిషిని నీవు సందేహింపవలదు. తలుపుతీయుము.

లోపల—ఈలాగున రాత్రివేళ వచ్చి తలుపు కొట్టడము పెద్దమనుష్యులకుఁ దగదు. మీరు పెద్దమనుష్యులమనిన నే నమ్మను. మీగౌరవము గీరవము నాకుఁ దెలియదు. నేను తలుపుతీయను.

పిళ్ళ—నామాట నమ్ము. నేను ప్రమాణముగాఁ జెప్పుచున్నాను. నే నొకమాట చెప్పి వెళ్లెదను. నీకులాభమున్నది. తలుపుతీయుము.

లోపల—మీప్రమాణములు సత్యములు నాకుఁ దెలియవు. నాకు లాభము గీభము నక్కరలేదు. నాతో మీరు చెప్పవలసినమాటలు లేవు. నేను వినవలసిన యవసరమును లేదు.

పిళ్ళ—లోపల యింకనెవరైన నున్నారా? ఎవరున్న నాకక్కరలే

దు. నేను లోపలకు రాను. తలుపు సగముతీసి నేచెప్పుమాట నొకటి విన్న చాలును.

లోపల—నేను తలుపు అసలే తీయను. లోపలెవరుండిన నీ కేందుకు. అరగంటనుంచి నిద్రపోనీయకుండ తలుపుకొట్టుచున్నావు. వెళ్ళి పో యిక్కడెవ్వరు లేరు. నిద్రపోనీ! నీవేమిచెప్పినను నే తలుపు తీయుదానను కాను. (అనిమాటలాడక యూరకుండెను)

తరువాత పిళ్ళగారు గుమ్మమువద్ద నిలఁబడి యనేకవిధములఁ బ్రాధేయించి బ్రతిమాలుకొని యేమేమో చెప్పసాఁగెను కాని లోపల నుండి యెవ్వరును పలుకకైరి. అంత నాతఁడు ప్రాణము విసిగి తలుపు కొంచెము గట్టిగఁ గొట్టనారంభించెను. అప్పుడు గదిలోఁ బరున్న భోగముది గట్టిగా "దొంగ! దొంగ!!" యని కేకలువేసెను. ఆకేకలు విని యింటిలోనున్న వారెల్ల భయపడి యులికిపడిలేచిరి. ఆసమయమునఁ బిళ్ళగారు కాళ్ళు గజగజవడఁక నేమిచేయుటకుఁ దోఁచక యరఁగెక్కినమార్గముననె దిగిపోయినచో నింటిలోనివారు వీధితలుపు తీసుకొనివచ్చి తన్నుఁ జూతురని యెంచి యరఁగుమీఁదినుండి క్రిందకు దుమికి పడి మోకాళ్ళకు దెబ్బలు తగల్చుకొని త్వరగా లేచి పరుగెత్తుకొని పోయినచో దొంగయని నిశ్చయించి వెంబడింతురని మెల్లఁగాఁ జాటుచాటున నడచుచు దారివెంబడిని పోవుచుండెను. ఇట్లాతఁడు అయిదారుబారల దూర మేగిన తరువాత యితనికి దారిలోఁ గనిపించి భోగమువాండ్రబస గుర్తు చెప్పిన మనుష్యుఁడు కనిపించి "ఏమయ్యా! నీవెందులకో యడుగుచున్నావనుకొంటిని; ఈరాత్రివేళ నొంటరిగాఁ బోయి భోగమువాండ్రు బసదిగియున్న గదితలుపుఁ గొట్టుట యేమిపని. సరసమునకుఁ బోవుటకు మిక్కిలి చక్కనిసమయమును చక్కనిమార్గమును నాలోచించితివి. మీరెవ్వరోగాని మీరుచేసిన పని యంతయుఁజూచిన మిక్కిలి యాశ్చర్యకరముగానున్నది. చాలు! చాలు'! అనియెను.

పిళ్ళె—ప్రమాణముగా వాస్తవముగాఁ జెప్పుచున్నాను. నాకేమి యుద్దేశమును లేదు. నేను భోగమువాండ్ర యిండ్లకుఁ బోవువాఁడను కాను. నేను సరసమునకుఁ బోలేదు. ఉత్సవములో భోగము మేళము చూచి యందరి యాటకత్తెకు నేమైన బహుమాన మియ్యవలయునని యెంచి యుదయమెనిమిదిగంటలకు నేను బసవిగిన యింటికి రమ్మని చెప్పినాను. అది బహిరంగముగఁ బట్టపగలు బాబనకు వచ్చుటవలన నాగౌరవమునకు హానికలుగును. వట్టియపవాదములు పుట్టునని యెంచి నేను దానికీయనిశ్చయించుకొన్న బహుమానము నీరాత్రియే నిచ్చివేసి దానిని నాయింటికి రాకుండఁ జేయవలయునని వచ్చినాను. ఇదివాస్తవము. నామాటనమ్ముము (రెండుచేతులు పట్టుకొని బతిమాలుకొనుచు) ఈసంగతి మీరెవ్వరికినిఁ దెలియనీయవద్దు. అయినదేమో యయినది. నన్ను నలుగురిలోఁ బెట్టినందువల్ల మీకేమియు లాభములేదు. నన్నురక్షించి యీసంగతి యంతయుఁ గప్పునఁ బెట్టుకొనవలెను. అనిఅతివినయముగాఁ బ్రార్థించెను.

ఆమని—పెద్దమనుష్యులను నల్లరిచేయరాదనియు వారినిఁ గూర్చి యితరులతోఁ జెప్పఁగూడదనియు నాకు మీరు వేఱే చెప్పనక్కఱలేదు. కాని మీపెద్దమనిషితరహా మాత్రము నాకుతెలియలేదు. మీచర్యలన్నియు చూచిన మిక్కిలి వింతగా నున్నవి. ఈమాట మీరు నాకు గనిపించినప్పుడే చెప్పినయెడల నేనాదైపునకే బోవుచున్నాను కావునను నేను వాళ్లమేళములోఁ జేరియుండుట చేతను మీకింతశ్రమ యక్కఱ లేకుండగనే నన్ను నమ్మి నాచేతి కాబహుమానమిచ్చినచో నేనది దానికిచ్చి దానిని మీయింటికి రాకుండు నట్లు చేసియుందును గదా! ఇంతకు మీరింత గడుసుతనమునకుఁ బోయి యీయిరంగుమీఁదనుంచి క్రిందఁబడి యింతశ్రమ పడవలసివచ్చినది. ఇదియంతయు మీరేచేసికొనినారు. నన్ను నమ్మి నాతోఁ జెప్పక

పోవుటచే నిధియంతయు తటస్థించినది. పోనీయండి దానికేమి.

పిళ్ళ—(చేతులు రెండును బట్టుకొని) మిమ్ములను నమ్మి మీతో నీసంగతి చెప్పలేదని మీరేమియు ననుకోవద్దు. మీరెవరో అనుకున్నాను. మీసంగతి నాకుఁదెలిసినది కాదు. క్షమించండి! ఇప్పుడానాలుగు రూపాయీలు మీచేతికిచ్చెదను. దానికివి యిచ్చి నాకీయుపకారము చేయక తప్పదు. అని (బతిమాలుకొనెను)

ఆమని—సరె, మీకునమ్మకముంటె అలాగుననే యిప్పించండి.

అప్పుడు పిళ్ళగారు కోటుజేబులో జేయిపెట్టి రూపాయీలందులోఁ గానక తక్కినజేబులన్నియు వెదకి కోటుతీసి త్రిప్పికప్పుకొన్నప్పుడు క్రిందఁ బడిపోయియుండునని నిశ్చయించుకొని, "రూపాయీలు క్రింద జారిపోయినట్లున్నవి. నాతో మీరు శ్రమయని యెంచక మాబసకుఁ రావలెను. రూపాయీలు యిచ్చెదను" అనెను.

అందు కామనుష్యుఁడు, మీరు రూపాయీలు లేకయె నాతో నట్లనుచున్నారని యును నేను మీబసవఱకు నడచి రాజాలననియు నాకు నిద్రగూర్కొని వచ్చుచుండుటచే నింటికిఁ బోయి నిద్రబోవలెననియుఁ జెప్పి నడువసాఁగెను. అప్పుడు పిళ్ళగారాతనియొద్దకుఁ బోయి చేయి పట్టుకొని దానికిచ్చెడు బహుమానముగాక మరినాలుగు రూపాయీలు లాతనికిచ్చెదనని బ్రతిమాలుకొనెను. ఎట్టకేలకుఁ దానుబసకు వచ్చినందుకు నాలుగురూపాయీ లిచ్చెదనని పిళ్ళగారిచే ననేక ఘోరప్రమాణములు చేయించి యతనివెంటబోయెను. పిళ్ళగారు తమకార్యమునకెట్టి విఘ్నములు నడుమ సంప్రాప్తమయిననుఁ దుదకీవిధముగ ననుకూలముగఁ బనిజరుగుటకు మిక్కిలి సంతోషించి తనయదృష్టమును మెచ్చుకొనుచు బసచేరి మెల్లగాఁ దలుపుతెఱచి లోనికిఁ బోయి యలమారులో సంచిలోనున్న రూపాయీలలో నాలుగురూపాయీలు బహుమానముక్రిందను నాలుగురూపాయీ లామనుష్యునకీయూనాముక్రిం

దనుఁ జప్పుడు కాకుండఁ దీసియావలకు వచ్చియారొనిమిదిరూపాయీలత
ని చేతిలోఁ బెట్టెను. అప్పుడాతఁడారొనిమిదిరూపాయీలు లెక్కపెట్టక
యె తీసికొని కొంగున మూటగట్టి యొడిలో దోపుకొని "దానిరూపాయీ
లే"వనియడిగెను. అందుకుఁ బిళ్ళగారు బోగముదానికీయవలసిన బహు
మానము రూపాయీలున్ను మీరూపాయీలున్నుఁ గలిపియే యిచ్చితిన
నెను. అందుకాతఁడు ఆరూపాయీలన్నియుఁ దనకిచ్చినవే యనియు
దానిరూపాయీలుగూడ యిచ్చినఁగాని యిచ్చటనుండి కదలననియుఁ
దన్నంతదూరమాయాసపెట్టి తీసికొనివచ్చి యూరక బొమ్మనుటేమి దు
ష్టమనిషితనమనియు గట్టిగా మాటలాడ నారంభించెను. అప్పుడు అ
లాగే రూపాయీలిచ్చెదను గాని గట్టిగా మాటలాడవలదని బ్రతిమాలు
కొని తలుపు దెఱచి గదిలోనికి వచ్చి సంచిలోఁ గావలసిన రూపాయీ
లు లేకపోవుటచేఁ బెట్టెతీయవలసిన యవసరము కలిగి యక్కడ న
డ్డముగ బరుండియున్న తనస్నేహితులను మెల్లఁగాఁ దప్పించుకొని
మెల్లఁగాఁ బెట్టెతెరచి నాలుగురూపాయీలు తీసి చేతఁ బట్టికొని తిరిగి
పెట్టె వేయుటలోఁ గొంచెము చప్పుడై మొదలియారుగారికి మెలకువ
వచ్చి యేమిటని యడుగుట సంభవించెను. పిళ్ళగారు దానికేమి
యు లేదని సమాధానముచెప్పి, తనప్రక్కమీఁద బరుండి మొదలియా
రుగారు తిరిగి కనుమూసి నిద్రచెందువఱకుఁ దానుబరున్నట్లభినయిం
చి తరువాత నాతనికా రూపాయీలిచ్చి పంపివేయవలయునని యూ
హించి యట్లుచేసెను. కాని యింతలో గుమ్మమువద్ద వేచియున్న
నామనుష్యుఁడు తొందరపడి "దానిరూపాయీలీయకుండ లోపలికి వె
ళ్ళి దాగియుండి యింకను రావేమని" బిగ్గరగా కేకలు పెట్ట నారంభిం
చెను. ఆకేకలు తనస్నేహితులు విందురనియుఁ బైవారుఁగూడ విన్న
చో నప్రతిష్ఠాకరముగ నుండుననియు నెంచి పిళ్ళగారు లేచి తలుపు
తెరువ నాతఁడు వెలుపలనుండి తలుపు నెంటుకొని లోపలకు రాఁబ

యత్నించెను. లోపలకు రావద్దని పిళ్ళగారాతని నడ్డుకొనుటకుఁ దలుపు దగ్గఱగా వేసెను. అటు పిళ్ళగారు తలుపుమూసిన కొలఁది నాతఁడు వెలుపలనుండి గెంట నారంభించెను. ఇట్లుకొన్ని నిమిషములు అయిన తరువాత నామనుష్యుఁడు తలుపులు గెంటుకొని లోపలకు వచ్చెను. ఈసందడికి మొదలియారుగారును శెట్టిగారును నాయుఁడుగారును లేచిరి. తరువాత మొదలియారుగారు పిళ్ళగారివల్ల సంగతియంతయు విని తెలిసికొని ముష్కరుఁడైన యామనుష్యుని నేవిధముగనైనఁ బంపివేయుట యుచితమని యెంచి యాతనికిఁ బదేనురూపాయీలిచ్చి బ్రతిమాలి యావలకుఁ బంపివేసెను.

అప్పటికయిదుగంటలాయెను. కాకులు నలుదిక్కులఁ గూయఁదొడగెను. పక్షులు తమ కులాయకూటములను విడిచి యార్చుచుఁ బరువులెత్తసాగెను. దేవాలయములో నన్నాయివాండ్రు మేలుకొలుపులు పాడుచుండిరి. తాము బసదిగిన గృహస్థుండును నాతని కుమారులును ద్వాదశోర్ధ్వపుండ్రములను ధరించి స్వచ్ఛముగాఁ దోముఁబడిన యక్షయపాత్రలను చేతఁబూని భుజములకు జోలెలు దగల్చుకొని హరినామసంకీర్తనము సేయుచు వీథియరఁగుపైఁ గూర్చుండిరి. రాముఁడు గుప్పుసామియు మాత్రము దారికడ్డముగా నొడలెఱుంగక బరుండి నిద్రించుచుండిరి. యాత్రస్థులు లేచి నడువసాగిరి. డప్పులు, జేగంటలు, భజనలు ధ్వని సేయుచు దారివెంబడిఁ బోవుచుండెను.



# నాల్గవ ప్రకరణము.



తరువాత నీనలుగురును దమతమదుస్తులను దోడిగికొని యాసిన మే-బయలువెడలిపోవుట కేర్పఱచుకొని తమ నూతనస్నేహితుఁడగు పార్థసారథిఁ గలుసుకొని ప్రయాణమునకుఁ దగినయేర్పాటులనుఁ జేసి కొనుటకు డిప్యూటీకలెక్టరుగారింటికిఁ బోయిరి. వీరు డిప్యూటీకలెక్టరుగారితో మాటలాడుచుండఁగాఁ బార్థసారధి యచ్చటికి వచ్చెను. మొదలియారు తామాదినమే ప్రయాణమై పోనిశ్చయించుకొన్నామని పార్థసారధితోఁ జెప్పెను. పార్థసారధి తానుఁ గూడ వారితోఁ బయలువెడలుటకు సిద్ధముగా నున్నానని చెప్పెను. డిప్యూటీకలెక్టరుగారు మరునాఁడుదయమునకుఁ దప్పక కలెక్టరునుఁ గలుసుకొనక తీరదు గనుక తామనువత్తుననిరి. డిప్యూటీకలెక్టరుగారి కొక గుఱ్ఱపుబండియు చిన్నగుఱ్ఱమును నున్నవి. ఆబండి స్వయముగాఁ దోలుకొనవలసిన 'డాగ్కార్టు' (Dog Cart) ఆబండిలోఁ దనతో నిఁక నొక్కరిని నెక్కించుకొని పోయెదనని చెప్పి డిప్యూటీసూపరింటెండెంటుగారి యొద్దకు వెంటనే పోయి వారి గుఱ్ఱముగాని బండిని గాని యడిగి తీసుకొని నీవును మరియొకరును వచ్చుటకు నేర్పఱచవలసినదని పార్థసారధితోఁ జెప్పెను. పార్థసారధి డిప్యూటీకలెక్టరుగారి గుఱ్ఱపుబండిలోఁ దానునుఁ దననలుగురిస్నేహితులలోనొకరును గూర్చుండిపోవచ్చునని యుద్దేశించెను. డిప్యూటీసూపరింటెండెంటుగారి కొక బండియు గుఱ్ఱమును నొక సవారిగుఱ్ఱమునుఁ గలవు. వారు గుఱ్ఱపుసవారిలో మిక్కిలి నేర్పరియనియు గుఱ్ఱమెక్కుటయే వారికి నిష్టమనియు డిప్యూటీకలెక్టరుగారునుఁ బార్థసారధియుఁ జెప్పుకొనుచు వారికి షికారునందును వేటయందును గల యభినివేశమునుఁ జెప్పుకొనుచు శ్లాఘింపఁ జొచ్చిరి. ఈమాట

లు విని శెట్టిగారు తమస్నేహితులగు తిరుమంగయాళ్వారు నాయుఁడుగారుకూడ మిక్కిలి నేర్పుతో గుఱ్ఱపుసవారీచేయఁగలవారనియు నెట్టిగుఱ్ఱమునైన నెక్కి స్వాధీనముచేసికొనఁగలరనియు గుఱ్ఱపుఁబందెములుకూడ వేయఁగలరనియు నిదివఱకనేకపందెములు వేసి గెల్చినారనియుఁ జెప్పిరి. మొదలియారుగారు తిరుమంగయాళ్వారునాయుఁడుగారిపేరుసెప్పిన గుఱ్ఱములు నీళ్లేత్రావవనియు నశ్వశాస్త్రములో నంతటిప్రవీణుఁడుసాధారణముగా హిందువులలో లేనేలేఁడనియుఁ జెప్పిరి. పిళ్ళగారు నకులునికన్న నెక్కువవాఁడనియు గుఱ్ఱము లీయన మొగము చూచినతోడనే గజగజవడఁకుననియు శ్లాఘించిరి. తిరుమంగయాళ్వారు నాయుఁడుగారు మందహాసముసేయుచుఁ దా ననేకగుఱ్ఱములు సవారీచేసితిననియుఁ వెనుక నొకబెదురుగల దుష్టజాతి పొగరుబోతుగుఱ్ఱమును గుఱ్ఱపువర్తకులు తీసికొనివచ్చి దాని నెవ్వరునుఁ గొనుటకు సాహసింపకఁ బోవుటచేఁ దా నాగుఱ్ఱమును మిక్కిలి చవుకగాఁ గొని దానిని నారనుదినములలోఁ గుక్కవలెఁ జేసితిననియు గుఱ్ఱపుసవారీలో నున్నరహస్యములన్నియుఁ దనకుఁ దెలియుటయేకాక అశ్వశాస్త్రమును నశ్వచికిత్సయుఁ గూడఁ దా నెఱుఁగుదుననియుఁ జెప్పిరి. అంతఁ బార్థసారథి యిప్పుడేవత్తు నని చెప్పి డిప్యూటీసూపరింటెండెంటుగారి యింటికిఁబోయి వారిని గుఱ్ఱపు బండి నెరువిమ్మని యడిగెను. డిప్యూటీసూపరింటెండెంటుగారు తా నొకకేసులో సాక్ష్యమిచ్చుటకు రాయవరగ్రామములో మరునా డుదయమునకు సిద్ధముగానుండవలయును గానఁ దా నాసాయంత్రమువఱకు సత్యవరములోనే యుండవలసియున్నదనియుఁ దాను చీఁకటిలో గుఱ్ఱమెక్కిపోఁజాలననియు సాయంత్రము భోజనముసేసి బండిపైనఁ బోవుట కేర్పఱచుకొంటిననియు సవారిగుఱ్ఱము కావలసిన యెడల నిచ్చెదననియుఁ జెప్పిరి. అందుపైనఁ దిరుమంగయాళ్వారునాయుఁడుగారు గుఱ్ఱపుసవారీలోఁ బ్రవీణుఁడు కా

పున వారికి గుఱ్ఱమిచ్చి డిప్యూటీకలెక్టరుగారి బండిలోఁ బంపివేసి తా నాసాయంత్రము వఱకు దటనే యుండి డిప్యూటీసూపరింటెండెంటుగారితో వారి బండిపై వెళ్లుటకు నిశ్చయించుకొని చేయవలసిన యేర్పాటులన్నియుఁ జేసి డిప్యూటీకలెక్టరుగారి యింటికిఁ దిరిగివచ్చి తాను చేసిన యేర్పాటులన్నియుఁ జెప్పెను. డిప్యూటీకలెక్టరుగా రాయేర్పాటులకు మిక్కిలిసంతోషించి తిరుమంగయాళ్వారు నాయుఁడుగారు తప్పక గుఱ్ఱమెక్కి తమబండితో వచ్చుటయె మంచిదనియు నట్లు వచ్చుటవలన నీస్నేహితులు నలుగురిలో నొకరు ముందును నొకరు వెనుకనుఁ బోయి యొకరికొఱకొకరు వేఁచి యుండవలసినయవసరముండదనియుఁ దాము భోజనముచేసి మధ్యాహ్నము రెండుగంటలకు బయలుదేరి సులభముగ రాత్రి భోజనమునకుఁ బోవచ్చుననియుఁ జెప్పిరి. పార్థసారధి తిరుమంగయాళ్వారునాయుఁడుగారికి గుఱ్ఱపువారీచేయు నదృష్టమును నవకాశమునుఁ గలుగచేయఁగలిగినందులకుఁ దనకు మిక్కిలి సంతోషకరముగా నున్నదనియెను. మొదలియారుగారును శాస్త్రిగారునుఁ బిళ్ళగారునుఁ దమస్నేహితుని గుఱ్ఱమెక్కి రమ్మని ప్రోత్సాహము చేసిరి.

తిరుమంగయాళ్వారునాయుఁడుగా రంతకుఁ బూర్వము పదిపదేనుసంవత్సరములనుండి గుఱ్ఱమెక్కి యెఱుఁగఁడు. గుఱ్ఱపువారి బొత్తిగా వీరు మరచిపోయియే యుండవచ్చును. ఒకవేళఁ బూర్వపరిచయముచే గుఱ్ఱపువారీ కొంచెము జ్ఞాపకమున్నను వారు రాత్రి గళ్యాణోత్సవములో రథచక్రముమీఁదఁ బడినప్పుడు మోకాలికిఁ దగిలిన గాయమువలన గుఱ్ఱమెక్కుటకుఁ దగిన స్థితిలో బొత్తిగా లేరని చెప్పవచ్చును. కాని గుఱ్ఱమెక్క లేనన్నచోఁ దనయాత్మగౌరవమునకునుఁ దన యశ్వశిక్షానైపుణ్యమునకును భంగముకలుగునని యెంచి మాటలాడక యూరకొనిరి. తనస్నేహితులందఱుఁ దిరుమంగయా

ఖ్వారు నాయుఁడుగారి చుట్టు చేరి గుఱ్ఱమెక్కుమని మరిమరి ప్రోత్సాహము చేయుచుండుటచే గుఱ్ఱమెక్కలేనని చెప్పుటకు సిగ్గును నభిమానమును గుఱ్ఱమెక్కినచోఁ దనకేమి హానిచేకూరునోయను భయమును గుఱ్ఱమెక్కుట కిష్టము లేదన్నచోఁ దన్నుఁగూర్చి తనస్నేహితులటుండ డిప్యూటీకలెక్టరుగారును భాగ్యసారధియు నేమనుకొందురో యనుసంశయమునుఁ దిరుమంగ యా ఖ్వారు నాయుఁడుగారినిఁ బీడింప వారిహృదయము మల్లకల్లోలమై యుండెను. జంతువులకుఁ బ్రాణభయమునకన్న మరియొక యెక్కువ భయమేదియు లేదుకద! గుఱ్ఱమెక్కునలవాటులేక దా నిప్పుడెక్కఁబోవు గుఱ్ఱమునుఁ దా నిదివఱకుఁ గన్నులతోనైనఁ జూచియుండక తనమోకాలునకుఁ దలిగిన గాయమువలన గుఱ్ఱముపైఁ గూర్చుండుటకయినఁ దగియుండని యీ నాయుఁడుగారికి గుఱ్ఱమెక్కవలసి వచ్చినందుల కప్పుడు గలిగిన భయమునుఁ బ్రాణములతోఁ దిరిగి తన భార్యాపుత్త్రులనుఁ జూడఁగలుగుదునో లేదో! యనుసందేహమును మిక్కుటముగాఁ గలిగెను. కానియేమైనను దైవముమీఁద భారము వైచి తనయాత్మగౌరవముఁ దక్కించుకొనుటకు గుఱ్ఱమెక్కక తప్పదని నాయుఁడుగారు నిశ్చయించుకొని దైవానుగ్రహమువలనఁ దనకాయుర్దాయమున్నచో భయముండఁగూడదని కొంచెము ధైర్యముఁ దెచ్చికొని గుఱ్ఱమెక్కెదనని నోటితోఁ జెప్పుటకు ధైర్యము లేకపోయిననుఁ దలయూఁచి యొప్పుకొనెను. తా నెక్కఁబోవు గుఱ్ఱ మల్లరిచేయునేమో! యను భయమునుఁ బొగరుమోతుదేమో, యను సంశయమును వీరికి లేకపోలేదు. ఏమైనను వీరు గుఱ్ఱము నెక్కిపోవుట తప్పినదికాదు. తరువాత గొంతసేపాలోచించి నాయుఁడుగారా గుఱ్ఱము పొగరుబోతుతనమును బెదురును లేనిదియే కదా! యని యడిగిరి. అందుకుఁ భాగ్యసారధియు డిప్యూటీకలెక్టరును నది మిక్కిలి సాధుస్వభావము కలదియే యనియు నా గుఱ్ఱమును డిప్యూటీ సూ

పరింటెండెంటుగారి పిల్లలుకూడ సవారిచేయుచుండ నెన్నియో పర్యాయములు చూచితిమనియుఁ జెప్పిరి. తిరుమంగయాళ్వారునాయుఁడుగారు తాను గుఱ్ఱమెక్కవలసివచ్చెనని దిగులుపడి తానాదినము లేచిన వేళమంచిదికాదని యాలోచించుచు దైవముమీఁద భారమువైచి గుఱ్ఱమెక్కి బండితోఁ బోవుట కొప్పుకొనెను. తరువాత వీరందఱుఁ గలసి దేవాలయములోనికిఁ బోయి యక్కడ దేవుని దర్శించి డిప్యూటీకలెక్టరుగారి బసకువచ్చి యందఱుఁ గలసి భోజనముచేసిరి.

భోజనమైన తరువాత మొదలియారుగారును వారిస్నేహితులునుఁ దమబసకువచ్చితమసామానంతయు సర్దుకొని రెండుబండ్లపైన వేసి రాముని గుప్పుసామిని నాసామాను బండ్లతో రాయవరము రమ్మని చెప్పి ప్రయాణోన్ముఖులై డిప్యూటీకలెక్టరుగారియింటికిఁ దిరిగివచ్చిరి. ప్రయాణమాసన్నమైనకొలఁదిఁ దిరుమంగయాళ్వారునాయుఁడుగారికి భయమభివృద్ధియై గుండెలలో రాయిపడెను. డిప్యూటీకలెక్టరుగారితో వీరు కొంచెముసేపు ముచ్చటించి రెండుగంటలకుఁ బలహారముసేసి బండికట్టించిరి. తిరుమంగయాళ్వారునాయుఁడుగారు తనకుఁ దటస్థమయిన యవస్థకుఁ జింతించుచు దారిలోఁ దనకు రాఁబోవు నాపదలనెల్ల నూహించుకొనుచు మతిపోయి పలహారమైనఁ దిన్నఁగాఁ జేయలేదు.

తరువాత డిప్యూటీకలెక్టరుగారును మొదలియారుగారును ముందువైపునను బిళ్ళయిశెట్టిగారును వెనుకవైపునను నాడాకార్టుపైఁ గూర్చుండ డిప్యూటీకలెక్టరుగారు బండితోలుచుండిరి. పార్థసారథి గుఱ్ఱమునకు జీనుకట్టి సిద్ధముగా నుంచమని డిప్యూటీసూపరింటెండెంటుగారికి వర్తమానమంపి నాయుఁడుగారినిఁ దీసుకొని పోయెను. తిరుమంగయాళ్వారునాయుఁడుగారు కాళ్ళీడ్చుకొనుచు మనసులో నేమేమియో యాలోచించుచు బలవంతముగాఁ బోయినట్లు డి

ఫ్యాటీసూపరింటెండెంటుగారి యింటికిఁ బోయెను. అప్పుడు గుఱ్ఱ ము సిద్ధపఱచి సూపరింటెండెంటుగారు వీరికై యెదురు చూచు చుండిరి. వీరిని చూచినతోడనే సగౌరవముగా వీరిని మన్నించి జీనుకట్టి గుఱ్ఱము సిద్ధముగానున్నదని చెప్పి గుఱ్ఱమును దీసుకొనిరమ్మని గుఱ్ఱపు వానికాజ్ఞాపించెను. గుఱ్ఱమును దీసికొనివచ్చినతోడనే దానినిఁ జూచితిరు మంగయాళ్వారునాయుఁడుగారు శరీరమంతయు వడఁక లేనిధైర్యమును దెచ్చికొని దైవమునకు మ్రొక్కికొని యాగుఱ్ఱము మిక్కిలి యెత్తైనది యుఁ జురుకైనదియు నగుటచేఁ బలవంతముగఁ గాళ్ళు వెనుకకు లాగ మెల్లగానడుగులిడుచుఁ బోయి దానిని సమీపించి గుఱ్ఱపువాఁడును మ ఱియొకఁడును దన్నుఁ బైకిఁ ద్రోయ నెట్టెటులో నతికష్టముమీఁద గోడ నెగఁబ్రాకునటు లాగుఱ్ఱముపై నెక్కి కూర్చుండి కళ్లెములు చేతఁ బట్టుకొని యప్పటికొకగండము తీరినదని సంతోషించుచు మెల్లఁగా న డువసాఁగెను. అట్లుకొంతదూరమేగినతరువాత పెద్దపెద్దకరతాళము లు వాయించుకొనుచు దీపపుశమ్యా నొకఁడుపట్టుకొనఁ గొందఱు నె మలికుచ్చులను పట్టుకొని పాడుచుఁ గాళ్ళకు గజ్జెలుకట్టుకొని యాడు చు భజనచేయుచున్నవారు కొందఱును వారితో నావేడుకలను చూ చుటకుఁ జట్టుగా గుంపుకట్టియున్న మఱికొందఱునుఁ గలసి నడచుట కైన నవకాశము గలుగకుండ మార్గమంతయు నాక్రమించుకొని నా యుఁడుగారికెదురుగా వచ్చుట తటస్థమాయెను. తాళములధ్వనికిని వారు బిగ్గరగాఁబాడుచున్న పాటలకును నెమలికుచ్చులకును నాయుఁ డుగారెక్కినగుఱ్ఱము కొంచెము బెదరనారంభింప నెమ్మదిగ నాజనుల నందఱినిఁ దప్పించుకొని గుఱ్ఱము వడివడిగా నడుచుచు నల్లరిఁజేయ జీనునుఁ గళ్లెమును గట్టిగాఁబట్టుకొని ప్రాణములను బిగపట్టుకొని కొంత దూరము పోయెను. అప్పటికి సాయంత్రము మూడుగంటలైనది. తరువా త కొంతదూరము గుఱ్ఱమును నెమ్మదిగా నడిపించుకొనుచు నూరు దాఁటి తన

స్నేహితులను డిప్యూటీకలెక్టరుగారిని గలసికొనెను. డిప్యూటీకలెక్టరుగారిబండిలో గుఱ్ఱపువాఁడుకూడ నుండ స్థలములేకపోయినందున వారునలుగురు మాత్రమే కూర్చుండిరి. అట్లు వీరు నెమ్మదిగా బండిని గుఱ్ఱమును నడిపించుకొని పోవుచు మాటలాడుకొనుచుఁ గొంతదూరమేగిరి. తిరుమంగయాళ్వారునాయుఁడుగారు గుఱ్ఱము బెదరకుండ బ్రతిమాలుకొనుచుఁ దానుఁ గ్రిందఁబడకుండ జీనును గట్టిగాఁ బట్టుకొని మొగమంతయుఁ జెమ్మటలుగ్రమ్మ వగర్చుచు బండిలోనివారాడిన వదిమాటలకొకమాట జవాబుచెప్పుచుఁ బోవుచుండెను. ఇట్లు కొంతదూరము పోయినపిమ్మట డిప్యూటీకలెక్టరుగారి చేతిలోని కొరడా క్రిందపడిపోయెను. ఆబండిలోఁ గూర్చుండియున్న మొదలియారుగారు శాస్త్రిగారు డిప్యూటీకలెక్టరుగారు పిళ్ళగారుఁగలసి తమవంటి గౌరవప్రపత్తులుగల తాము నలుగురునుఁ గూర్చుండియున్న బండి నాబక్క గుఱ్ఱమీడ్వఁగలుగుటకు దానికిగొరడా సహాయమత్యావశ్యకముగాఁ గావలెను కావున డిప్యూటీకలెక్టరుగారు కొంచెము ముందుకు బండినడిపింప క్రిందపడిన కొరడాను దయచేసి యందియ్యఁడని నాయుఁడుగారిని మొదలియారుగారు కోరిరి. అప్పుడు నాయుఁడుగారు తాను గుఱ్ఱముదిగినచోఁ దరిగి దానినెక్కలేనని భయపడియును శత్రునకైనఁ జేతియాయుధము క్రిందఁబడిపోయినప్పుడది యందిచ్చుట వీరపురుషలక్షణమనియు ధీరోత్తలక్షణమనియు శాస్త్రములు ఘోషింపుచుండఁ దాను సత్యవరగ్రామములోఁ గల్యాణోత్సవముఁ జూడనున్న స్వల్పకాలములోఁ దనకునుఁ దనస్నేహితులకును మిక్కిలి యాప్తుఁడై దనతండ్రి యొద్దఁబనిచేసిన డిప్యూటీకలెక్టరుగారివంటి స్నేహబాంధవుని యంతటివానికి నీస్వల్పసహాయము చేయకుండుటయు నదియటుండ తనకు బాల్యస్నేహితుఁడై పరమమిత్రుఁడుగానున్న మొదలియారుగారివంటియాప్తునిమాటత్రోసివేసి మిత్రద్రోహియగుటకును బండిలోనెక్కిన తనస్నే

హేతులు నలుగురు త్వరితముగాఁ దనతో గమ్యస్థానమును చేరఁగలుగఁజేసి తనకు మార్గమధ్యమునఁ దటస్థించు కష్టములకు వారు దాపుననేయుండి తనకు సహాయమొనఁగుటకు దగ్గరనుండఁ గలుగునట్లు చేసికొనుటకును ముఖ్యాధారభూతమగు నాకొరడా నందిచ్చుటకు సంశయించుటకన్న వెఱ్ఱితనము లేదని యూహింపవలసిన యీసమయమున నాతని హృదయమల్లకల్లోలముగఁ బరితపింప క్షోభించినవనుటకేమి సందియమున్నది. అప్పుడు 'ఏమైన నగుఁగాక' యని మతిపోయినవానివలెఁ గ్రిందదుమికి డిప్యూటీకలెక్టరునకాకొరడానందిచ్చి వారు సాఁగిపోవుచుండఁ దనగుఱ్ఱమును చేరి దానినెక్కఁ బ్రయత్నించుచుండ నది దనచుట్టును మండలాకృతిగా గిరగిర తిరఁగనారంభించెను. అప్పుడు కళ్లెమువట్టుకొని నాయుఁడుగారు ముందుకును గుఱ్ఱమువెనుకకును లాగుటకారంభించిరి. నాయుఁడుగారు గుఱ్ఱమునకుఁ "జెప్పినట్టు విని బుద్ధికలిగి నడచుకొమ్మ" ని మాటలతోఁ జెప్పి చూతమని యశ్వభాషకాఁబోలు మనకర్థముకాని యొకకేకతో దానికిఁ జెప్పెను. అశ్వశాస్త్రమెఱుఁగుదుననియు నశ్వశిక్షానిపుణుఁడననియు దంభములుకొట్టిన నీవంటి నిర్భాగ్యుఁడగు పిరికివానిని నింతవఱకు నామీఁద నెక్కించుకొని మోసుకొనివచ్చుటయేఁగాక నిప్పుడు నీవలన బెదరింపులుకూడ బడుదాననా యని యాతనిలక్ష్యపెట్టక నాతనిప్రక్కకు లాఁగనారంభించి కయ్యమునకుఁ గాలుద్రువ్వినట్లు తన వెనుకకాలొకటి యాతనివైపు దువ్వుచు నీబెదరింపులకా నేను బెదరుదానను నన్ను బెదరింప నీవెవ్వఁడవు; ఛీ పొమ్మని, నిర్లక్ష్యభావముతో ధిక్కరించినటులాతని రెండుమూఁడు పర్యాయములు వెనుకకును ముందుకును గెంటనారంభించెను. అప్పుడు డిప్యూటీకలెక్టరుగారు నాయుఁడుగారియవస్థను వెనుకకుఁ దిరిగి చూచి బండియాపి మొదలియారుగారిచేతికిఁ గళ్లెములందచ్చి తాను కొరడా చేతఁబట్టుకొని క్రిందదిగి నా

యుఁడుగారివైపు తొందరగా నడచెను. అది చూచి తన్నుఁ గొట్టుటకుఁ గాఁబోలునుఁ గొరడా తోవచ్చుచున్నాఁడని యాగుఱ్ఱము బెదరెను. నాయుఁడుగారా గుఱ్ఱమును లొంగదీసికొనకపోయినయెడల తన కప్రతిష్టాకరముగనుండునని యెంచి దానిదుష్ప్రయత్నమును లక్ష్యము చేయకఁ బట్టుదలతో దానికళ్లెములఁ బట్టుకొని విడువక, దానికిఁ గొంచెము సేపునకైన బుద్ధిరాకపోదని దానిచిత్తమువచ్చినట్లెగరనిచ్చి తనమోకాళ్ళను పాదములనుఁ గొట్టుకొని పోవునట్లు దానితోఁగూడఁ గొంతదూరముపోయి, ఛీ! దీనికిఁక బుద్ధిరాదని యెంచి, విడిచిపెట్టుటచే యథేచ్ఛముగా నాగుఱ్ఱము నాయుఁడుగారిని రోడ్డునకుఁ బ్రక్కనున్న ముండ్లకంపలోఁ గొంతదూరమునఁ దిగవిడిచి పాఱిపోయెను. అప్పుడు మొదలియారుగారు గూరకుండనోపక కళ్లెముల నిటు నటు గదల్చుటచేతనో, నాయుఁడుగారి యవస్థను బ్రక్కకుఁదిరిగి చూచుచు నప్రయత్నమున నొకప్రక్కకుఁ గళ్లెములు బిగియునట్లు వెనుకకు దిరుగుటచేతనో, జాత్యభిమానముచే నాగుఱ్ఱమొంటరిగాఁ బోవుచుండుట చూచుచుఁ గొంతదూరమైన శక్త్యనుసారముగఁ బోకుండుట ధర్మముకాదని యెంచియో, తమకు జాతిశత్రువుడుగా నుండి తమ్ము బీడించుకొని తినుచున్న నీమనుష్యజాతిలో నొకనినోడించి గెలిచితినన్న సంతోషముతోఁ బరుగెత్తుచున్న స్వజాతిలోనిదగు నాగుఱ్ఱమటు పరువిడుచుండ దానివైభవము నేత్రపర్వముగఁ జూచి యానందింపవలయునను గోరికచేతనో, గాని యాబండిగుఱ్ఱముగూడ నిటునటుబండినీడ్చి రెండుమార్లు వెనుకకాళ్ళుఝాడించి పోలుగఱ్ఱలలో నొకదానిని విఱుగఁగొట్టి తొట్రుపాటు కలుగఁజేయ నారంభించెను. అప్పుడు కొరడాను క్రిందపాఱవైచి డిప్యూటీకలెక్టరుగారు బండియొద్దకుఁ బరుగెత్తుకొనివచ్చి హార్నెస్సు (Harness)కొంతయూడదీసి తక్కినదికోసివేసి గుఱ్ఱమునీవలకుఁదీసి చేతితోఁబట్టుకొనినిలఁబడెను. మొదలియారుగారును శెట్టిగారునునెమ్మదిగా

క్రిందదిగిరి. తరువాత మొదలియారుగారును శెట్టిగారును నాయుఁడుగారున్న స్థలమునకుఁ బోయి వారిని నెమ్మదిగా లేవఁదీసి చెరియొకచేయిపట్టుకొని మెల్లగా బండియొద్దకుఁ దీసుకొనివచ్చి యక్కడ కూర్చుండఁబెట్టిరి. అప్పటికి సాయంత్రమారుగంటలైనది. బండిని గుఱ్ఱమును దీసుకొనివచ్చుటకు నప్పుడు మనుష్యులక్కడి కెనిమిది మైళ్ళదూరములోనున్న లోకలుఫండు సత్రమువద్ద కాని దొరకరని డిప్యూటీకలెక్టరుగారెఱుఁగుదురు. ఆసంగతి మొదలియారుగారును శెట్టిగారును విని పిళ్ళగారిని డిప్యూటీకలెక్టరుగారికిని నాయుఁడుగారికిని బండికిని సహాయముగా నక్కడ దిగవిడచి లోకలుఫండు సత్రమునకుఁ బోయి యచ్చట కూలీలను నొకయెద్దుబండిని దీసుకొని వత్తుమని బయలువెడల "మీకాసత్రము దెలియదుగనుక నేనేవెళ్ళి యచ్చట గుఱ్ఱమునుకట్టివేసి బండినిఁ గూలీలను తీసుకొని బండి విరిగిపోయిన స్థలమునకు వచ్చి నాయుఁడుగారిని నెద్దుబండిలోఁ గూర్చుండబెట్టి మనము నలుగురు విరిగిపోయిన బండిపైనెక్కి కూలీలచే బండిలాగించుకొని యారాత్రి యాసత్రమునఁ గడుపుద"మని డిప్యూటీకలెక్టరుగారు జెప్పుచుఁ దాను గుఱ్ఱమును దీసికొని నడువ; మొదలియారుగారు గూడ వారితోఁబోయిరి. వీరు లోకలుఫండుసత్రముఁ జేరునప్పటికి రాత్రి తొమ్మిదిగంటలాయెను. ఆసత్రమువద్ద యిళ్ళు లేవు. గ్రామమక్కడకొక మైలు దూరమునకుఁ దక్కువలేదు. ఆసత్రమునకొక ప్రక్కనున్న పూరింటిలో నొక కాపువాఁడును వానికొమార్తెలిద్దఱునుఁ వానిభార్య గతించినందునఁ దానియక్క యొకతెయుఁ గాపురముండి, నాలుగుబండ్లను, నైదారావులును, కొన్నిగేదెలను, పెట్టుకొని కొలఁదిగా వ్యవసాయము చేయుచుండిరి. సత్రములో నిద్దఱు ముసలివాండ్రును నేండ్లు గడచిన యిద్దఱు బ్రాహ్మణవితంతువులును పండ్రెండేండ్లు వయసుగల నొక చిన్నవాఁడును నొక వంటబ్రాహ్మణుఁడును కాపురముండిరి. ఇంతవఁ

దక్క నక్కడ రాత్రిచీకటిపడినతరువాత యాచుట్టుపట్ల మార్గస్థులు తప్పమరెవ్వరునుండరు. ఆనాటిరాత్రి వంటబ్రాహ్మణుఁడు కల్యాణోత్సవములో వంటచేయుటకుఁ బోయి యుండుటచే నతఁడక్కడ లేకపోవుటయుఁ గాపువాఁడు తాగాక చేరికిఁ బోయియుండుటచే నాఁడును లేకుండుటయుఁ దటస్థమాయెను. అప్పుడు డిప్యూటీకలెక్టరుగారు సత్రముయొద్దకుఁబోయి దాపుననున్న కాపువానినిఁ బిలిచెను. అంతట తలుపుతెరచి మునలిది కాఁపువాఁడు లేడని చెప్పెను. వంటబ్రాహ్మణుఁడున్నాఁడా? యని యడిగి యాతఁడు గూడ లేడని తెలిసికొనెను. అప్పుడు గుఱ్ఱమునక్కడ కట్టివేసి, తాను వెనుకకుఁ బోయి నాయుఁడుగారిని మాత్రము బండిమీఁదఁ గూర్చుండఁబెట్టి తాము నలుగురును బండిలాగుకొని వచ్చుట, యింకొక మైలుదూరము నడిచి గ్రామములోనికిఁబోయి యక్కడ కూలీలను బండ్లను సమకూర్చి పంపించుటకంటె మంచిదనియు, నా గ్రామమునకు పోయినను నక్కడకుఁ బోవునప్పటికిఁ బదిగంటలగుటచే నారాత్రివేళ బండియుఁగూలీలను సమకూర్పఁగలుగుటకూడ కష్టమేయనియు, నూహించి యాగుఱ్ఱమునక్కడ కట్టిపెట్టెదమనియు, దానినిఁ జూచుచుండవలసినదనియు, దానినక్కడగట్టినందుకొక యర్ధరూపాయియీనామిత్తుమనియు, నాకాపుదానితోఁ జెప్పిరి. అందుకాయాఁడుది దనకేమిచ్చినను గుఱ్ఱమును దమయింటగట్టుటకు వప్పుకొనననియు, నంతకుఁ బైదారునెలలకుఁ బూర్వమొకఁడొకనాటి సాయంత్రము రెండెడ్లను గీసికొనివచ్చి తమకొక రూపాయినిచ్చి కొంచెము గడ్డికొని తమయింటియొద్ద సావడిలోఁ గట్టిపెట్టి దాపుననున్న గ్రామమునకుఁ బోయి భోజనము చేసివచ్చి వాటినిఁ దెల్లవారుజామునఁ దోలుకొనిపోదునని చెప్పి యతఁడావలకుఁ బోయిన పదినిమిషములలో నిద్దరు పోలీసుబంట్రోతులనుఁ దీసికొనివచ్చి యింకొకఁడాయెడ్లు తనవని వానినిదోలుకొని పోలీసుస్టేషనుకుఁ బోయి నాలుగుమాసములు దన్నును దన మగనిని

కచేరీచుట్టు ద్రిప్పిరనియుఁ, బిణ్యామునకుఁబోయిన బాపమేగురయినదనియు, జెప్పి యాగుఱ్ఱమక్కడ గట్టుటకు వీలులేదని స్పష్టముగాఁ జెప్పివేసెను. అప్పుడు మొదలియారుగారును డిప్యూటీకలెక్టరుగారును నాకాపుదానినెంత బ్రతిమాలుకొనినను, నేమేమిచ్చెదనన్నను, నది గుఱ్ఱమునుగట్టుటకు నొప్పుకొనలేదు. అప్పు డేయుపాయమును దోఁచక యక్కడ దామాలస్యముచేసినచోఁ దెల్లవారులోపల దాము బండినీడ్చుకొని వచ్చుటకవకాశముండదనియుఁ దమ స్నేహితులను మార్గమధ్యమునఁ జీకటిలో విడచిపెట్టుట మిత్రద్రోహమనియుఁ దలఁచి గుఱ్ఱమును గూడ వెనుకకుఁ దీసికొనిపోయి, యొకరు గుఱ్ఱమునుఁ దీసికొనివచ్చుచుండ దక్కినముగ్గురే బండిలాగుకొని వచ్చుట యుచితమని నిశ్చయించి, గుఱ్ఱమునుదీసికొని దమ స్నేహితులను గలసికొన వెనుకకు వడిగా నడువ నారంభించిరి.

డిప్యూటీకలెక్టరుగారి నాకాపుదియెఱుఁగదు. ఆయన నెఱిఁగిన కాపువాడింటలేదు. మఱియు నీకాపుదానికి రేజీకటియు గొప్పజెవుడునుగూడ నుండుటచే నారాత్రివేళఁ దాను డిప్యూటీకలెక్టరునని బిగ్గరగా కేకలువేసియెంత చెప్పినను వినిపించనిదానివలె నటించెను. వాస్తవముదానికి వినిపించకుండుటచే నట్లు నటించెనో, లేక నాగుఱ్ఱమువల్ల దమకుఁ జిక్కి దటస్థించునని భయపడ మొగవాడింట లేనప్పుడు దాని విషయములో నించుకయినఁ దలయూచి యొప్పుకొనుట మంచిదకాదనియూహించి యట్లు వినిపించనిదానివలె నటించెనో, మనము స్పష్టముగాఁ జెప్పలేము. దానికి విస్తారము చెముడున్నదని మాత్రము చెప్పక దప్పదు.

తరువాత మొదలియారుగారునుగుఱ్ఱమును దీసికొని డిప్యూటీకలెక్టరుగారును దమస్నేహితులునుబండియు నున్నస్థలమునకా రాత్రియొంటిగంటయగునప్పటికి వచ్చిరి. నాయుఁడుగారిని నెమ్మదిగా బండిమీఁ

నఁ గూర్చుండఁ బెట్టి డిప్యూటీకలెక్టరు గారు గుఱ్ఱమును బట్టుకొని నడచుచుండ మొదలియారుగారును శెట్టిగారును బిళ్ళగారును బండిలాగ మొదలుపెట్టిరి. త్వరగా గమ్యస్థానమును జేరగలుగుదుమను నాశతో గుఱ్ఱపుబండిని గుఱ్ఱమును రొక్కి ప్రయాణమైన వీరు గుఱ్ఱమును బండిని మోసికొనిపోఁ దటస్థమగుట కేవలము దైవయోగముకాని వేరొకటి కాదుగదా! పాపమా రాత్రి వీరుపడిన శ్రమ చెప్పనలవి కాదు. తాము పడుచున్న కష్టములటుండఁ దెల్లవారులోపల నూరుల కండ్లఁబడకుండ సత్రమును జేరలేకపోయినచోఁ దమ గౌరవమునకు మిక్కిలి హానికరముగా నుండునని యెంతగష్టములకైన బాలయి నాలుగున్నర గంటలగునప్పటికి బండిని గుఱ్ఱమును దీసికొని సత్రముఁ బ్రవేశించిరి. అట్లు వీరు సత్రము చేరిన యొకగంటలో తెల్లవారినది. తరువాతఁ గొంత సేపటికిఁ గాఁపువాడింటికివచ్చెను. ఇతఁడు డిప్యూటీకలెక్టరుగారిని బాగుగా నెఱిఁగినవాడగుటచే నాయనకును ఆయన స్నేహితులకును గావలసిన సదుపాయములనెల్లఁ జేసెను.

అప్పుడు డిప్యూటీకలెక్టరుగారు దమస్నేహితు లొకటిరెండు దినములాసత్రమున నుందురుగాన వారికిఁ దగిన సదుపాయములనెల్లఁ జేయుమని చెప్పి తనగుఱ్ఱమును బండిని దీసికొనివచ్చుటకు గూలీలను సిద్ధముచేసి తానొక యెద్దుబండినెక్కి మొదలియారుగారు మొదలగువారి నచ్చట విడచిపెట్టి పోయిరి. తరువాత మొదలియారుగారును నాతనిస్నేహితులును ఆసత్రమునఁ గొన్నిదినములుండి నాయుఁడుగారును బిళ్ళగారును దమగాయములను మాన్పుకొనఁ గలిగినతరువాత నక్కడనుండి ప్రయాణమగుటకు నిశ్చయించుకొనిరి. రాముఁడును గుప్పసామియు రాయవరగ్రామమున కాదారినే బోవలయును గాన నొకటిరెండు గంటలలోఁ దమసామానంతయుఁ దీసికొని వచ్చుచుండుట గాంచి వారిని గూడ దమయొద్ద నక్కడనే యుండునట్లాపివేసిరి. ఇట్లు వీరరదలు

నాస్పత్రములోఁ గొన్నిదినములు బసదిగియుండిరి. డిప్యూటీకలెక్టరుగారు చెప్పినారని యీకాపువాఁడు మొదలియారుగారికిని వారిస్నేహితులకును గావలసిన సదుపాయముల నెల్లఁ జేయుచుండెను.

మొదలియారుగారును నాతని స్నేహితులును స్వస్థచిత్తులై యచ్చటనుండి కాపువాని సత్కారముల నందుచుండిరి. ఆతఁడుదయమున జల్లియన్నమును దిని పొలమునకుఁ బోయి సాయంత్రమింటికి వచ్చుచుండెను. తానింటలేనప్పుడు కాపువాని వదినెయు గొమార్తెలును వీరికన్నము వండిపెట్టి గుర్వసామిచే వారికి బంపి మిక్కిలి యాదరముతో వారిని గౌరవించుచు నాయుఁడుగారికిఁ దగిలిన గాయములకు గట్టుకట్టుచు వారికిఁ గావలసిన సదుపాయములనెల్లఁ జేయుచుండిరి. కాపువాఁడు సాయంత్రమింటికివచ్చిన తరువాత వీరియొద్దఁ గూర్చుండి, తన సంసారస్థితినిగూర్చియు, వ్యవసాయమునుగురించియు, నితరవిషయములనుగురించియు, మాటలాడుచు రాత్రి కొంతకాలము వారితోఁ గాలము గడపుచుండెను.

ఈకాపువాని వదినె పేరు ముత్యాలమ్మ. ఈమెభర్త యీమె చిన్నతనములోనే మృతినొందెను. తరువాతఁ దన చెల్లెలింటఁ జేరి, తనచెల్లెలిని మరదియగు నీకాపువానిని గనిపెట్టుకొని కొన్నిసంవత్సరములుండి, తరువాతఁ దనచెల్లెలు గతించినను నామెకుమార్తెల నిద్దరిని పెంచుచుఁ దనకెవ్వరును గావలసినవారు లేకపోవుటచే నచ్చటనేయుండెను. ఈమెకిప్పటికి నలుబదియైదు సంవత్సరముల వయసుండును. ఈమెకుఁ జిన్నతనమునుండియు మిక్కిలి చెవుడుగలదు. రాత్రులయందు దృష్టిగూడ నంతబాగుగాఁ గనిపించకుండెను. కొంచెము పొట్టిగాను స్థూలముగాను నల్లగాను గనుపించుచు మొగమంతయు స్ఫోటకపుమచ్చలతో నిండియుండి తలవెంట్రుకలు చాలభాగము నెరసియుండుటచే వానికి కాటుకరాని తన యంగవైకల్యమును

నుసలితనమును గనపడకుండ సాధ్యమగునంతవఱకుఁ గప్పుకొనుచుం
డెను. ఈమెకు తాను వయసులోనున్నదాననియుఁ, దనచెల్లెలు కు
మార్తెలయొక్కయుఁ దనమరదియొక్కయు క్షేమమాలోచించి తిరి
గి వివాహము చేసికొనక వారిని గనిపెట్టుకొని వారికి మహోపకారము
ను జేయుచుంటిననియు, నభిప్రాయము కలదు. కాపువానికిద్దరు
కొమార్తెలుగలరని యిదివఱకే చెప్పఁబడినది. ఆయిద్దరిలోఁ బెద్ద
దానిపేరు సుబ్బమ్మ; రెండవదానిపేరు లక్ష్మి. పెద్దదానికప్పటికి వ
దునైదు సంవత్సరములును, జిన్నదానికిపదునాలుగు సంవత్సరములును,
వయసుండును. ముత్యాలమ్మదగ్గర బంగారమును రొక్కమును గలసి
మూడువేలరూపాయీలకుఁ పైగా నాస్తియుండుటచే దాను ధనవంతు
రాలనన్న మనోగర్వముగూడ నీమెకులేకపోలేదు. కాపువాఁడుదనకొ
మార్తెలకిద్దరకిని వివాహములు చేసి యల్లుళ్ళను దమయింటనే యిల్లరికె
ముంచుకొనవలయుననియు నావివాహములకుఁ దనవదినెగారి సహాయ
మవశ్యముగాఁ గావలయుననియుఁ దలఁచుచుఁ, దనవదినెగారితో మం
చిమాటలాడుచు దానితోఁ దనకుమార్తెలు పోరాడునప్పుడు వారిని
చీవాట్లుపెట్టి దానిని బ్రతిమాలుకొనుచుఁ గాలము గడపుచుండెను.
కాపువాని కుమార్తెలలో లక్ష్మియనునది తనపెత్తల్లినిఁ జూచి యె
ప్పుడప్పుడు నవ్వుచు నది పడుచుదానివలె గనుపింపవలయునని పడు
చున్నపాట్లు కాక్షేపించుచుండుటచే దానికి మనసులో దానియందు కో
పముగలదు. ఆకోపము తరుచుగా దిట్లతోను నప్పుడప్పుడు బుగ్గపోట్ల
తోను దీర్చుకొనుచుండును. సుబ్బమ్మయు లక్ష్మియు నేమేమి మాట్లాడుకొను
చున్నను దన్నుగూర్చియే మాట్లాడుకొనుచున్నారని యనుమానపడి
వారాడుమాట లేమని యడిగి వారెంత బిగ్గరగా నరచిచెప్పినను దన
కు వినిపించకపోవుటచే మఱింత మండిపడి ముత్యాలమ్మ గేకలువే
యుచు నిల్లంతయు నల్లకల్లోలముగా చేసి తనమరది యింటికివచ్చినప్పటి

కేఁ దానిల్లువిడచి యెక్కడికైనఁ బోవుటకు సిద్ధముగాఁ బ్రయాణము గుచుఁ, గాఁపువాఁడును నాతని గోమాతెకాలును బ్రతిమాలుకొనఁ దిరిగీయింటిలోనికిఁబోయియెప్పటివలెనక్కడనేయుండుచుండుటయుఁదనుచుగాఁ బటస్థమగుచుండెను. లక్ష్మి స్వభావముచే మాటలాడునప్పుడు నవ్వుచుండును. అది నవ్వుచున్నప్పుడెల్లఁ దన్నుఁజూచియే నవ్వుచున్నదని ముత్యాలమ్మ యనుమానపడి దానినిదిట్టుచుండును. అందువలన ముత్యాలమ్మకు లక్ష్మియన్న నెంతమాత్రమును యిష్టములేదు; కాని దానియందుఁ బ్రేమ లేకపోలేదు. లక్ష్మి తల్లి చనిపోవునప్పటికిఁ దానికి రెండేండ్ల వయసుండును. అప్పటినుండియు దానిని, దానియక్క సుబ్బమ్మను ముత్యాలమ్మే పెంచెను. ఈయిద్దరిలో లక్ష్మిని ముత్యాలమ్మ దనపెంపుడుకూతురుగా భావించి దానికిఁ గొన్ని నగలను బెట్టెనుగాని యది పెద్దదైనతరువాత దానిమీఁదఁ గోపముచే సుబ్బమ్మనే కూఁతురుగా నెంచి దానికేమయిన గొనిపెట్టుచునుండెను. ముత్యాలమ్మకు దైవికముగాఁ గలిగిన చెముడును, ముసలితనమువల్లను చిన్నతనములో స్ఫోటకము బడుటవలనను గలిగిన యంగవైకల్యమును, గొంచెము ముకోపితనమును, దక్క నేదుర్గుణములును లేవు. సంసారము గడపుటలో నీమె మిక్కిలి నేర్పుగలది. ఆవులకును గేదెలకును దూడ్లకును సాయంత్రము నుదయమును చిట్టు, తవుడు, గుగ్గిళ్ళు మొదలగునవి దాను స్వయముగా బెట్టి సుబ్బమ్మను లక్ష్మిని గనిపెట్టుకొని మిక్కిలి జాగరూకతతో సంసారమంతయుఁ గడపుచుండెను. నాయుఁడుగారికిఁ దల్లివలె సంరక్షణచేయుచు నాయనకుఁ దగిలిన గాయములకు గట్లను గట్టుచు మొదలియారుగారికిని శెట్టిగారికిని బిళ్ళగారికిని మిక్కిలి వినయ భయభక్తులతోఁ గావలసిన సదుపాయములనెల్లఁ జేయుచుండెను. రాముఁడును గుప్పసామియుఁ బనియున్నను లేకపోయినను సుబ్బమ్మతోను లక్ష్మితోను నేదోయొకటి గల్పించుకొని మాట

లాడుచుఁ దమ దేశమందలి విచిత్రములను దమ యజమానుల గొప్ప తనమును జెప్పుచుండిరి. మొదలియారుగారికిని శెట్టిగారికిని బిళ్ళ గారికిని ముత్యాలమ్మ దమకుఁ జేయు గౌరవమును బట్టియు సదుపా యములను బట్టియు నామెయందు మిక్కిలి మంచియభిప్రాయముగలిగి, యామెవంటి తెలివిగలది లేదని, దలఁచుచుండిరి. నాయుఁడుగారికి ము త్యాలమ్మయందుఁ గలవిశ్వాసము జెప్ప శక్యమే కాదు. తనకుఁ జే యుచున్న చికిత్సలకును, సదుపాయములకును ముత్యాలమ్మయందు నాయుఁడుగారికి మంచియభిప్రాయమును, విశ్వాసమును, గౌరవము ను, దరువాత నభిమానపూర్వకమైన ప్రేమయుఁ, గ్రమక్రమముగా హృదయస్థమగు ననురాగమునుగూడగలిగినది. ఈ కారణముచే నాయుఁ డుగారును, నాయుఁడుగారి యభిప్రాయమును బట్టి దక్కినవారును, న క్కడఁ దాముండవలసినదినములకన్న నెక్కువదినము లుండిరి.

ఇట్లు వారక్కడ బసచేసియున్న దినములలో సంవత్సరాదిపం డుగ వచ్చినది. ఆపండుగకు మొదలియారుగారును శెట్టిగారును బిళ్ళ గారును దాపుననున్న గ్రామమందలి సంతలోఁ గొన్నిబట్టలను గొని తీసికొనివచ్చి కాపువానికిని, ముత్యాలమ్మకును, సుబ్బమ్మకును, లక్ష్మి కిని నిచ్చిరి. నాయుఁడుగా రొకపెద్దచీర కొని ముత్యాలమ్మ కిచ్చెను. రాముఁడును గుప్పుసామియు సుబ్బమ్మకును లక్ష్మికిని జెరియొకరైక గుడ్డను రూపాయియు నిచ్చిరి. నాయుఁడుగారు, దనకిచ్చిన చీరకు ముత్యాలమ్మ కప్పుడుగలిగిన సంతోషమింతింతని చెప్ప నలవికాదు. తరువాత ముత్యాలమ్మకును నాయుఁడుగారికిని నొండొరులయం దభి మానమును స్నేహమును నమ్మకమును నభివృద్ధియగుటవలన ముత్యా లమ్మ దనగృహచ్ఛిద్రములనుగూర్చియు, లక్ష్మికిఁగల పొగరుబోతుతన మును గూర్చియు, నాయుఁడుగారితోఁ జెప్పుచుండెను. నాయుఁడుగా రు, ముత్యాలమ్మ చెప్పిన మాటలు వినకున్నచో నామె కేమి కోప

ము వచ్చునో యని సందేహించి యూఁకొట్టుచుండెను.

అంత నొకనాఁడాసమీపమందున్న గ్రామములో గ్రామదేవతయగు బోలేరమ్మ యుత్సవము జరుగుచుండెను. ఆయుత్సవమునకుఁ గాపువాఁడు ప్రయాణమయ్యెను. మొదలియారుగారును, శెట్టిగారును బిళ్ళగారును గూడఁ బ్రయాణమైరి. తనకొమార్తెల నిద్దరి నొకబండిలో నెక్కించి మఱియొకబండిలో దాను దన నూతనస్నేహితులను ముగ్గురను గూర్చుండ బెట్టుకొని పోయెను. వారాదినము సాయంత్రము వఱ కుత్సవముజూచి యారాత్రి యొకచోట బసచేసిరి. ఆయుత్సవములో సుబ్బమ్మయు లక్ష్మమ్మయు వేడుకలన్నియుఁ జూచి యానందించి, ఆనాఁటికైన ముత్యాలమ్మవల్ల లేనిపోనిమాటలను, దిట్లను, బడుట దప్పెనని సంతోషముతో నుండిరి. పిళ్ళగారు కాపుగన్యకల కిద్దరికిఁ జెరియొకచీరెయు, రైకయుఁ, గొన్నిసామానులను గొనిపెట్టెను. ఆప్పుడు కాపువాని పూర్వస్నేహితుఁ డొకఁ డాతనికి గనుపించి యాతని బిల్లలకు మంచిసంబంధము లున్నవని చెప్ప నాతఁడు మిక్కిలి సంతోషించి యాతనిఁ దనయింటికి రమ్మని బ్రతిమాలి దీసికొనివచ్చుటకు నిశ్చయించెను. మొదలియారుగారును, శెట్టిగారును, బిళ్ళగారును దమ్మను దమస్నేహితుఁడగు నాయుఁడుగారిని మిక్కిలి వినయభయభక్తులతో నాదరించి సన్మానించుచున్న యాకాపువాని కొమార్తెలను దమకొమార్తెలనుగా నెంచి వారిపెండ్లిండ్లు త్వరలో సమకూరినయెడల నావివాహములు రెండును చేయించియె యచ్చటనుండి పోవలయునని యాలోచించిరి. ఆరాత్రి కాగ్రామమున బరుండి మరునాఁడు వేకువజామునఁ బండ్లుగట్టించుకొని యిల్లుచేరిరి. సుబ్బమ్మకును లక్ష్మమ్మకిని సంబంధములు గుదర్చెదనన్నవాఁడుగూడ వీరితోఁ గలసి వచ్చెను. ఆతనిపేరు వెంకన్న. కాపువాఁడిల్లుచేరినతోడనే వెంకన్న దనకుమార్తెలకు సంబంధములు గుదుర్చుటకును ఆసంగతిని గూర్చి మాటలాడు

టకును వచ్చెనని ముత్యాలమ్మతోను నాయుఁడుగారితోను జెప్పెను. పిళ్ళగారు సుబ్బమ్మకును లక్ష్మికిని గొనిపెట్టిన చీరెలను రైకలను నితరవస్తువులను జూచి తనకెవ్వరు నేమియుఁ గొని తీసికొనిరాకపోవుటచే నోర్వలేక మటమట మండిపడుచుఁ బెండ్లిమాటలాడునప్పుడు దనకేమియు సంబంధములేనిదానివలె నటించుచుండెను. అంత నొక నాఁడు సాయంత్రము నాలుగుగంటలవేళఁ గాపువాఁడు పొలమునకుఁ బోయిన సమయమున ముత్యాలమ్మ పశువులకు మేతబెట్టుచున్నప్పుడు నాయుఁడుగారు దనకామె యుపచారముచేసిన సంగతి యెఱిఁగి దానామెకు సహాయముచేయుట ధర్మమని యెంచి యామెను గూర్చుండుమని చెప్పి దానే స్వయముగాఁ బశువులకు మేతవెట్టి వానిని గట్టివేసెను. అప్పుడు ముత్యాలమ్మ నాయుఁడుగారి స్నేహభావమును గ్రహించి యాతనిఁ బరమాప్తునిగా దలఁచి తన కష్టసుఖములన్నియు నాతనితోఁ జెప్పనారంభించి, పిళ్ళగారు లక్ష్మికిని సుబ్బమ్మకును బట్టలుకొని తనకేమియుఁ దీసికొనిరాకపోవుటయు లక్ష్మి దన్నుఁ జూచి వెక్కిరించుచుఁ దనమనసు నొవ్వఁజేయుచుండుటయుఁ దనయొద్దనున్న ద్రవ్యమంతయు దీసికొని తన్నావలకుఁ ద్రోలివేయ నిశ్చయించుకొని కాపువాఁడు దన్ను మంచిమాటలతో బుజ్జగించుచుండుటయుఁ దాను తిరిగి వివాహము చేసికొనకఁ జాలకాలమునుండి సుబ్బమ్మను లక్ష్మిని బెంచుచుఁ గాపురమంతయుఁ గడపుచుఁ దనమఱఁదియగు కాపు వానిని గనిపెట్టుకొని యుండుటయు మొదలగు గృహచ్ఛిద్రముల నన్నిటిని గన్నీటిలో సవిస్తరముగాఁ జెప్పెను. నాయుఁడుగారితో నీసంగతులన్నియు ముత్యాలమ్మ చెప్పుటకుఁ గారణము పిళ్ళగారు సుబ్బమ్మకును లక్ష్మికిని బట్టలను గొని యిచ్చుటయొక్కటి దప్ప మరియొకటి లేదని మనము గ్రహింపవచ్చును. అయినను ఆడవాండ్రే కారణముచేతనైనఁ దమకష్టములను గూర్చి యితరులతోఁ జెప్పుకొనునప్పుడున్నవియు లే

నివియుఁ గూడ జెప్పుచుందురు. కావున నాసమయమున ముత్యాలమ్మ నాయుఁడుగారితోఁ దాను నరకబాధ పడుచున్నట్లు జెప్పసాగెను.

ఇట్లు నాయుఁడుగారును ముత్యాలమ్మయు పశువులపాకలో మాట్లాడుచుండుట గ్రహించి రాముఁడు గడ్డిమేటిచాటునఁ గనబడకుండ దాగి వారిమాటలనెల్ల వినుచు నాయుఁడుగారు ముత్యాలమ్మను మోహించెనని యూహించి యాసంగతి తక్షణమే సుబ్బమ్మతోను లక్ష్మితోను వెంకన్నతోను జెప్పెను. లక్ష్మియు సుబ్బమ్మయు యథాప్రకారము ముత్యాలమ్మను ప్రేమించి గౌరవించుచున్నను నామెమాత్రము వారితోఁ దిన్నగా మాటలాడక నేమేమో నోటిలో గొణుగుకొనుచుఁ గౌరవము లేకుండఁ గోపించి వారిని దిట్టుచుండెను. వెంకన్న, ముత్యాలమ్మను నాయుఁడుగారు మోహించిరన్న మాట నమ్మలేదుగాని రామునియొద్ద మాత్రము నమ్మినట్లు నటించి "ముత్యాలమ్మ ద్వారలోఁ దన బ్రతుకు దెరువు జూచుకొనుట మంచిదిరో" యనియుఁ దానినిఁ గాపువాఁడు దనకొమార్తెల వివాహమైనతక్షణమే సొత్తంతయుఁ దీసికొని యిల్లువెడలఁగొట్టి తాను దిరుగ వివాహమాడి దనకొమార్తెలతోను అల్లుండ్రతోను గలసి కాలము గడపనిశ్చయించుకొన్నాడనియుఁ జెప్పెను. వీరు మాటలాడుకొన్న మాటలు దనకు వినిపించకపోయినను యీసంగతంతయుఁ గండ్లతోఁ జూచుచుండుటచే ముత్యాలమ్మ యొకరాత్రి రాముని దూరముగా దీసికొనిపోయి వెంకన్న చెప్పినమాట లేమని యడిగి, యంతయు నాతఁడు దనచెవిలో బిగ్గరగాఁ జెప్పుచుండ విని తెలిసికొనెను. ఈమాటలు వినినప్పటినుండియు ముత్యాలమ్మ గుండెల్లోఁ రాయిపడ దాను దనసొత్తంతయుఁ దీసికొని కాపువానియిల్లువిడచి పోవలయునని నిశ్చయించుకొని వెంకన్ననడిగి యంతయుఁ దెలిసికొనవలెనని యాతని నాశ్రయించి యాతనితో మంచిమాటలాడ నారంభించెను. కొందఱు దానము చూచుచుండగా నిద్దరేమైనరహస్యముగా

మాటలాడుకొనుచుండ వారు మాటలాడుకొన్నమాట లేవియో తమ కుఁ దెలియునంతవఱకు నేమియుఁ దోఁచక మిక్కిలి యాతురతతో నుందురు. కొందరు రెదుటఁ దమకుఁ దెలియకుండ నేమైన మాట లాడుకొన్నచోఁ దమ్ముగూర్చియే మాటలాడుకొనుచున్నారని లేనిపో ని యనుమానమును మనసులో బెట్టుకొని లేనిబాధ దెచ్చుకొందురు. ఈగుణములు పురుషులకంటె స్త్రీలలో నెక్కువయనియు నందులోఁ జె విటివారిలో నీగుణము మిక్కిలి యెక్కువగా గానిపించుననియుఁ జ దువరులే యెఱుఁగుదురు. అది మొదలెవ్వరిద్ద రేమి మాట్లాడుకొ న్నను ముత్యాలమ్మ కనుమానమెక్కువగాఁజొచ్చి తా నాయిల్లెవ్వడు విడచిపోదునా, యని యాలోచించుచుండెను. ఒకనాఁడు రాత్రి ప డ్రెండుగంటలవేళ నందరు నిద్రపోయిన తరువాత ముత్యాలమ్మయు వెంకన్నయు దూరముగాఁ బోయి చాలసేపు మాట్లాడుకొని యామఱు నాఁడు రాత్రి యిద్దరును గలసి భీమునిపట్నము పోయి యచ్చట స్టీమ రెక్కి రంగము (రంగూన్) వెళ్ళుటకు నిశ్చయించుకొనిరి. మఱునా ఁడు వెంకన్న గాపువాని గొమార్తెల వివాహవిషయమై కాపువాని తో నాలోచించి, త్వరలోఁ బోయి వరులనిద్దఱను దీసికొనివచ్చుటకుఁ బ్రయత్నములు చేయుచున్నట్లు నటించెను. వెంకన్నకుఁ గ్రొత్తబట్టల నుబహుమానమిచ్చి కాపువాఁడాతనికి విందుగూడఁ జేసెను. ముత్యాల మ్మదనయొద్దనున్న బంగారమును రొక్కము రూపాయీలును మూటగ ట్టి సిద్ధముగానుండెను. కాపువానికిఁ బొలములోఁ బనియుండుటచేఁ దా నారాత్రి ప్రొద్దుపోయివచ్చెదనని చెప్పి వెంకన్నతోఁ దనకొమా ర్తెల సంబంధముల విషయమై తిరిగి చెప్పి యావలకుఁ బోయెను. తరువాతఁ గొంతసేపు వెంకన్న నాయుఁడుగారితోను బిళ్ళగారితోను మొదలియారుగారితోను శెట్టిగారితోను మాటలాడుచు కాలముగడపి కాపువాఁడు తనకు మాగఁణపుఖర్చులక్రింద నేమియు నియ్యక మఱచి

పోయి తొందరగాఁ బోయెననియు దనకుఁ బదిరూపాయీలు బదులు పూర్వకముగా నిచ్చినచోఁ దిరిగి తాను ద్వరలోనే యిత్తుననియుఁ బిళ్ళగారితోఁ జెప్పెను. కాపువానియందును నాతనికొమార్తెలయందును దామందఱు మిక్కిలి ప్రేమగలిగియుండుటచే బిళ్ళగా రాతనికి వెంటనే పదిరూపాయీల నిచ్చి త్వరలోఁ గాపువాని యిల్లుళ్ళను దీసికొనిరమ్మని మరిమరి చెప్పిరి. పిళ్ళగారు లక్ష్మియందును శెట్టిగారు సుబ్బమ్మయందును మిక్కిలి యభిమానమును ప్రేమను జూపించుచుండిరి. కాని వీరునలుగురు నీకన్యకలను దమకొమార్తెలవలెఁ గారవించుచుండిరి. ముత్యాలమ్మవంటి యోగ్యురాలును, తెలివియు నేర్పును గలదియు, లేదని మొదలియారుగా రామెయందు మిక్కిలి యభిమానమును గౌరవమును గలిగి యామె యమాయికస్వభావమునకుఁ దోడామెకు బధిరత్వముగూడ సంప్రాప్తమైనందులకును దైవ మామెకాలోచ మొక్కటి దెచ్చిపెట్టినందులకును విచారించుచు నామెవంటి యుత్తమోత్తమురా లాగాపువానికిఁ బుణ్యవశమునఁ దటస్థమైనదని దలఁచుచుండెను. నాయఁడుగారు దన కీమె చేయుచున్న యుపచారమున కామెయందు విశ్వాసముగలిగి, యామెను మెచ్చుకొనుచుండెను. వెంకన్న మంచివడిగా నడువగల యెద్దులుగట్టినబండి నొకదానిని సిద్ధముచేసి యారాత్రి భోజనము చేసినతోడనే ముత్యాలమ్మను దీసికొని ప్రయాణమై పోయెను.

ఇట్లు వీరిద్దరును బ్రయాణమై పోయిన రెండుగంటలకుఁ గాపువాఁ డింటికివచ్చెను. ముత్యాలమ్మ కనుపించుట లేదనియు, నామెపెట్టెగూడ లేదనియు, సుబ్బమ్మయు లక్ష్మియుఁ దండ్రితోఁ జెప్ప నాతఁడామెను వెంకన్న దీసికొనిపోయియుండవచ్చునని యనుమానపడి మొదలియారుగారితో నీసంగతి చెప్పెను. తరువాత శెట్టిగారును, నాయఁడుగారును, బిళ్ళగారును గలసి యాదుర్మార్గుఁ డీకార్యమును దప్ప

కచేసెననినిశ్చయించిరి. వెంకన్న యిట్టిదుష్కార్యమును దలపెట్టి చేయుటయేగాకఁ దనయొద్ద దారిఖర్చులక్రిందఁ బదిరూపాయీ "లప్ప" ని చెప్పి దీసికొనినసంగతిచెప్పి యాతఁడు దనకంటఁ బడినచోఁ జంపవలెనన్నంత కోపముగలిగి యుండెను. సుబ్బమ్మయు లక్ష్మియు ముసలిదానికీపనిచేయఁదగదనియు నామెకీవయసున నిట్టిదుర్బుద్ధిపుట్టుట మిక్కిలి యాశ్చర్యకరముగా నున్నదనియుఁ జెప్పిరి. నాయఁడుగారు సుబ్బమ్మకును లక్ష్మికిని బెండ్లిళ్ళుచేయఁదలపెట్టి వెంకన్నయింటికివచ్చి పెండ్లిమాటలాడనారంభించినది మొదలుగా నీమెకు మాత్సర్యమును నోర్వలేనితనమును నంకురించినదనియుఁ దన్ను మోసముచేసి తనసొత్తంతయుఁ దీసికొని యావలకుఁ బంపివేతురను సందేహముగూడ దృఢముగాఁ గలిగినదనియుఁ జెప్పెను. ముత్యాలమ్మయు వెంకన్నయుఁ గలసి భీమునిపట్నముపోవు మార్గమున బండినెక్కిపోవుచుండిరని చూచినవారు గొందరు చెప్పిరి. ఈమాటవినినతోడనే గాపువాఁడును, మొదలియారుగారును, బిళ్ళగారును, నొకబండినెక్కి వారిని బట్టుకొనుటకు బయలువెడలిరి. అట్లు వీరారాత్రియంతయు బండిమొద్లను బరిగెత్తించి మరునాడుదయ మెనిమిదిగంటలకు భీమునిపట్నము చేరిరి.

వెంకన్న ముత్యాలమ్మను దీసికొని యారాత్రి మూడుగంటలకే భీమునిపట్నము చేరి యొకయింట బసదిగి యామరునాఁడే స్టీమరొకటి రంగమునకుఁ బ్రయాణమయి పోవునని విని తెల్లవారినతోడనే స్టీమరుటికెట్లను దీసికొని పోవుటకు నిశ్చయించుకొనెను. తరువాతఁ దెల్లవారినతోడనే వెంకన్న వీధిలోనికిఁ బోయి "కొప్పుల వెంకన్న, వెంకన్నభార్య ముత్యాలమ్మ" యని వ్రాయఁబడిన రెండుటికెట్లను కొని బజారులోఁ గొంతసామానును గొనుక్కొని యింటికివచ్చెను. ఇతఁడింటికి వచ్చులోపలఁ గాపువాఁడును, మొదలియారుగారును, బిళ్ళగారును, బండ్లవాండ్రు నడిగి, ముత్యాలమ్మయు, వెంకన్నయు, బ

నదిగినయిల్లు దెలసికొని యక్కడకువచ్చిరి. అప్పుడు ముత్యాలమ్మ యొంటరిగానుండుటచే నామెను సమీపించి యేమేమో నామెతో మాటలాడుచుండ వెంకన్న వచ్చెను. అప్పుడు మొదలియారుగారు నీవిట్లు నమ్మించి కాపువానిని మోసముచేయుటఁ దగదనియు, నిన్ను ఖైదులోఁ బెట్టింతుమనియు, మిక్కిలి యాగ్రహముతోఁ బలికిరి. పిళ్ళగారాతనిఁదిట్టనారంభించిరి. కాపువాడును వెంకన్న చేసిన యకార్యమున కాతని నేమేమో దిట్టనారంభించెను. ముత్యాలమ్మ దన్ను వీరు పట్టుకొన్నందుకు విచారించుచుఁ దన్ను దిరిగి యింటికిఁ దీసికొని పోదురని భయపడుచుఁ దనకు వారాడుమాటలు స్పష్టముగాఁ దెలియకపోయినను, మతిపోయిన దానివలె నోటమాటలేక యూరకుండెను. వెంకన్న చిఱునగవునవ్వుచు ముత్యాలమ్మ దనభార్యయనియు నామెను గడచినరాత్రి పెండ్లాడితిననియుఁ దానినింటికి రమ్మని బలవంతపెట్టుటకు మీరెవ్వరనియు బదులుచెప్పి స్టీమరు టిక్కెట్టులోఁ గూడ ముత్యాలమ్మ దన భార్యయని వ్రాయఁబడియున్నదని చూపించెను. పిళ్ళగారు కోపముబట్టలేకఁ దనచేతికఱ్ఱతో వెంకన్ననొక దెబ్బకొట్టిరి. ముత్యాలమ్మ బిగ్గరగా కేకలుపెట్టుచు నేడ్వ మొదలుపెట్టెఁ, గాపువాఁడామె చెంపపైఁ జేతితోఁ గొట్టెను. వెంకన్నను బోలీసువారికప్పగించి కొట్లో బెట్టించెదనని మొదలియారుగారాగ్రహముతోఁ బలికిరి. వెంకన్న పిళ్ళగారిని గొట్టి మొదలియారుగారిని గొంతుకపట్టుకొని క్రిందఁ బడవైచి "నాభార్యను గొట్టుటకు నీనెవ్వఁడ" వని కాపువానితోఁ బోరాడ మొదలుపెట్టెను. ముత్యాలమ్మ భయపడుచు మాటలాడనేరకయూరకుండెను. ఇట్లు కాపువాఁడును వెంకన్నయుఁ బిళ్ళగారును గొంతసేపు పోరాడి తిట్టుకొనుచు గొట్టుకొనుచుండ మొదలియారుగారు దెప్పిరిలి క్రిందబడిలేచి వెంకన్నతోఁ బోట్లాడుటవలన లాభములేదనియు ముత్యాలమ్మ దాదాపు ఏబదిసంవత్సరముల వయసుగలదగుట

చే మైనరని చెప్పుట కెంతమాత్రము వీలులేదనియు వెంకన్న ముత్యాలమ్మను పెండ్లిచేసికొన్నట్లు చెప్పుచు నామె దనభార్యయని టికెట్టులో గూడ వ్రాయించియుండుటచే యది నిజముకాదని రుజువు చేయగలుగుట మిక్కిలి గష్టమనియు ముత్యాలమ్మ యిల్లువిడచి యింతదూరము వచ్చినతరువాతఁ దాను వెంకన్న మాటాడును గాని నిజముచెప్పదనియు నిట్టి వ్యవహారములో వీనిపై ఫిర్యాదుచేసి యల్లరిపడుటకంటె రాజీని ఫైసలు చేసికొనుట మంచిదనియు నూహించి న్యాయశాస్త్రపండితుఁడగుటచే శాంతము దెచ్చుకొని వెంకన్న దనగొంతు పిసికి నేలఁబడవేసినను నాతనిపై గోపమించుకయు లేకఁ గార్యవాదుల కాగ్రహమనుచితమని గ్రహించి యాతని జేయిపట్టుకొని యావలకుఁ దీసికొనిపోయి "నీకేమైనఁ గావువానిచే నిప్పించెదనుగాన ముత్యాలమ్మనింటికిబంపివేయు" మని బ్రతిమాలుకొనెను. వెంకన్న దనకు ముత్యాలమ్మయందుఁ గల మోహముచే నామెను వివాహమాడవలయునని యిల్లువెడలదీసి తీసికొనిరాకపోవుటచేతను నామె నాతఁడు వాస్తవముగాఁ బెండ్లాడియుండకపోవుటచేతనుఁ గొంత సేపు దానామెను విడువఁజాలననియు నామెయందుఁ దనకు మోహముగలిగి చిరకాలమునుండి యామెను వివాహమాడగోరి దైవానుగ్రహమున గడచినరాత్రియే నామెను వివాహమాడగలిగితిననియు రాత్రి వివాహమాడి యుదయమున భార్యను విడచిపెట్టుటకుఁ దన కెంతమాత్రము నిష్టము లేదనియు మొదలియారుగారితోఁ జెప్పి యామెను విడచిపెట్టుట కెంతమాత్రము సమ్మతించ లేదు. కాని మొదలియారుగారాతని ననేకవిధముల బ్రతిమాలి "నీవుకోరినంత సొమ్మిప్పించెద" నని చెప్పెను. వెంకన్న చాల సేపు మొదలియారుగారిమాటకు సమ్మతింపక ద్రవ్యాశ చేనవ్వ భార్యనమ్ముకొనునట్లగుమ గాన తన భార్యాయగుముత్యాలమ్మ నెంత ధనమిచ్చినను విడువననెను. మొదలియారుగారు బ్రతిమాలినకొలఁది

వెంకన్న సమ్మతించనని చెప్పుచు, వెంకన్న సమ్మతించనని తన హితోపదేశమును నిరాకరించినకొలఁది మొదలియారుగారాతని బ్రతిమాలుకొనుచునొకగంటకాలము గడపినతరువాతదుదకు ముత్యాలమ్మ దనభార్యగావున నామెయొద్దనున్నసొత్తంతయుఁ దనకిచ్చివేసినచో నామెనువిడచిపెట్టెదనని యాతఁడుచెప్పెను. కానియామెనువిడచిపెట్టినంతమాత్రమున కాతని కంతసొమ్మిచ్చుటకు మొదలియారుగారి కెంతమాత్రము నిష్టములేదు. ముత్యాలమ్మ తాను వెంకన్నతోఁ బారిపోవుట కవకాశము లేకుండ నీవిధముగాఁ బట్టుబడి తిరిగి యింటికిఁ బోవలసివచ్చుటకైన నిష్టపడునుగాని దనసొత్తులో నేమియు వెంకన్నకిచ్చుట కెంతమాత్రము నిష్టపడదని మొదలియారుగారికి నిశ్చయముగా దెలియును. అది యటుండ ముత్యాలమ్మ ప్రథమకోపమప్పటికిఁ గొంచెము తగ్గి తిరిగి యింటికిఁ బోవుట కిష్టముగలిగియే యున్నదనియు మొదలియారుగారి కొకధైర్యముగూడఁ గలిగెను. వెంకన్న "నాభార్య" యని తన్ననుటవలనను దన్ను వివాహమాడకయె యట్లనుటయేగాకఁ దనసొత్తంతయు "నాదే" యని చెప్పుచుండుటచేతను నాతనియందుఁ గొంత విరక్తియు ననిష్టమును గూడ నీమె హృదయమం దంకురించినసంగతిగూడ మొదలియారుగారు గ్రహించెను. కాపువాఁడుముత్యాలమ్మకొఱ కంత ద్రవ్యము వెంకన్న కిచ్చుట కిష్టపడడనియు నాతఁ డంతధనము గలవాఁడు గాడనియు మొదలియారెఱుఁగుటయే గాకఁ దాను స్వయముగా నంతసొమ్మిచ్చుటకు బొత్తుగా నిష్టములేనివాఁడై యుండి, వెంకన్న నేవిధముననైన నొకటిరెండువందలరూపాయీలతో సమాధానపఱచి యొప్పించి ముత్యాలమ్మ నింటికిఁ దీసికొనిపోవలయుననియాతనితో బేరమాడనారంభించెను. అంత నాయింటికిసమీపముననున్న యొకఁ డీసంగతంతయు గ్రహించి తన స్నేహితుఁడగు నాయూరిపోలీసు సబ్ యినస్పెక్టరుతోఁ జెప్పెను. ఆతఁడు మంచివ్యవహా

రము దొఱకినదని సంతోషించుచుఁ దనయదృష్టమునకు మనసులో నానందించి యొకనిముసమైన వృథబుచ్చక ముత్యాలమ్మయు వెంకన్నయు మొదలగువా రున్న యింటికిఁ బరుగెత్తుకొనివచ్చి సంగతంతయు మొదలియారుగారివలనను గాపువానివలనను బిళ్ళగారివలనను వెంకన్నవలనను విని దెలసికొని కాపువాని వాఙ్మూలమును వెంకన్న వాఙ్మూలమును, దీసికొని తన కీవ్యవహారము మిక్కిలి యనుమానాస్పదముగా నున్నదనియు, నిది యొక గొప్ప కేసనియు, నిది దనపైయధికారులకుఁ దెలియపఱచి దీనిపరియవసానమంతయుఁ దేల్చినపిమ్మటఁగాని వారిని వదలిపెట్టుటకు వీలులేదనియు, నంతవఱకు ముత్యాలమ్మను వెంకన్నను దక్కిన యీముగ్గురిని వదలిపెట్టుటకు వీలులేదనియుఁ, జెప్పెను. మొదలియారుగారా పోలీసు సబ్ యినస్పెక్టరుతో ననేకవిధముల న్యాయశాస్త్రానుసారముగా వాదించి బ్రతిమాలుకొన్నను నాపోలీసుద్యోగస్థుఁడు గేసుచేయక మాననని యు, మీరైదుగురిని విడచిపెట్టననియుఁ జెప్పెను. ఆపోలీసుద్యోగస్థున కీవ్యవహారములో విశేషముగా ధనము దొఱకునన్న యాసయొకటి దృఢముగా నుండుటచే నెవ్వరేమిచెప్పినను ముత్యాలమ్మ స్వయముగా దాను వెంకన్నను బెండ్లాడలేదని యెన్నెన్ని ఘోరప్రమాణములు చేసినను వెంకన్నగూడఁ దానాడుమాటలలోఁ దడబడుచు వివాహముజరిగినదని యొకమాటును నప్పటికి జరుగలేదుగాని వివాహముచేసికొనుట కేర్పఱచుకొంటిమని యువ్యవధిచాలక పోవుటచే వివాహమాడలేదుగాని యాదినము తప్పక వివాహము చేసికొన నిశ్చయించుకొంటిమనియు మఱియొకమాటును ననేకవిధములుగాఁ జెప్పుచున్నను, సబ్ యినస్పెక్టరు "నిజముచెప్పుము"ని గట్టిగా బెదరించుచు ముత్యాలమ్మను దాను వివాహమాడలేదన్నప్పుడెల్లమండిపడిపళ్ళుగొఱకుచుఁగండ్లెఱ్ఱఁజేసిచూచి వెంకన్నను బెదరించుచు, వివాహముచేసికొంటిననిచెప్పినప్పుడెల్ల "సరే ఆలానిజముచెప్పుము"

ని శాంతముతో మాటలాడుచు నకారణముగాఁ గాపువానిపైఁ గోపగించుచు "యీకేసు నేను విడచిపెట్టుటకు వీలులే" దని చెప్పుచుండెను. మొదలియారుగారు దమన్యాయశాస్త్రపాండిత్య మంతయు వినియోగపఱచి యాతనితో నేమేమిచెప్పినను యెంతెంత వాదించినను గాపువాఁడెంతెంత బ్రతిమాలుకొనినను బిళ్ళగారెన్ని విధములఁ బ్రమాణము చేసి వాస్తవముచెప్పినను యాతఁడు దనపట్టుదలను విడువక వారిమాటల నిందుకైనఁ జెవినిబెట్టలేదు. ముత్యాలమ్మ పోలీసుద్యోగస్థునిఁ జూచి దాను గచేరీలెక్కవలసివచ్చునని భయపడుచు మతిపోయినదానివలె దనపెట్టెను మూటను జాగ్రత్తగాఁ జూచుకొనుచు నొకమూలఁ గూరుచుండెను. పోలీసు వబుయిన్స్పెక్టరుతో నిది నేర మెన్నటికిఁ గాదనియు ముత్యాలమ్మ వివాహమును చేసికొనలేదని స్పష్టముగాఁ జెప్పుచుండుటచే నీనేరములో వెంకన్నయే ముద్దాయియనియు, నది యటుండ నీ నేరములోఁ బోలీసువా రెంతమాత్రము జోక్యము గలుగఁజేసికొన గూడదనియు, నెన్ని విధముల నెట్లెట్లు వాదించి చెప్పినను వాతఁడు చెవినిబెట్టక నీవ్యవహారమాస్తితో గూడినదిగనుక పీనల్ కోడ్ 379-403 శెక్షన్ల ననుసరించి తాను జోక్యముగలుగఁజేసికొని కేసుచేయక మానననియుఁ, దరువాత మేజస్ట్రీటుగారియొద్దఁ గేసు కొట్టివేయించుకొనఁగలిగిన యెడల గొట్టివేయించుకొనవచ్చును గాని తానప్పుడు కేసుచేయకపోయినచోఁ! దనయుద్యోగమునకు భంగముగలుగును గావున వారిని విడచిపెట్టననియుఁ, జెప్పి వెంకన్నా నావలకు దూరముగాఁ దీసికొనిపోయి ముత్యాలమ్మను వివాహము చేసికొనలేదని యెంతమాత్రము చెప్పవద్దనియు, నట్లు చెప్పకపోయినచోఁ దమకిద్దఱకుఁగూడ లాభమున్నదనియు, దానట్లుచెప్పకపోయినచో నాస్తితో ముత్యాలమ్మను దీసికొనివచ్చి నట్లాతనిపై నేరము మోపుదలచేసి శిక్షింపఁబడునట్లు చేతుననియుఁ, బాతనేరస్థుఁడవగుటచేఁగఠినముగా శిక్షవిధింపఁబడక మాన

వనియుఁ జెప్పి యాతని భయపెట్టెను. తాను నేరస్థుఁడు గాకుండఁ జెరసాలలో నుండవలసిన యాపద దప్పించుకొనగలుగుటయే గాక నీ వ్యవహారములోఁ గొంత ద్రవ్యము సంపాదించుకొనుట కవకాశము గూడ గలిగియుండుటకు వెంకన్న సంతోషించి యాతని సలహా నంగీకరించి ముత్యాలమ్మ తప్పకఁ దన భార్యయే నని చెప్పనారంభించెను. పోలీసు సబ్ యినస్పెక్టరు వెంకన్న వాఙ్మూలమును, కాపువాని వాఙ్మూలమును బిళ్ళగారి వాఙ్మూలమును మొదలియారుగారి సాక్ష్యమును వ్రాసికొని వీరందఱను ముత్యాలమ్మతో స్టేషనుకుఁ దీసికొనిపోదు నని బెదరించి, నూరురూపాయీలు వారియొద్దఁ బుచ్చుకొని జామీనుమీఁద వారిని విడచిపెట్టి, వెంకన్న వీరితోఁ గలసి తన లాభమును బోగొట్టునని భయపడి యాతని మాత్రము దనతోఁ దీసికొనిపోయెను.

తరువాత మొదలియారుగారును గాపువాఁడును బిళ్ళగారును ముత్యాలమ్మయు నాబసలోనె నేమియుఁ దోఁచక గూరుచుండి కర్తవ్యమాలోచించుకొనుచు నీవ్యవహారమీవిధముగాఁ బరిణమించినందుకు విచారించుచుండిరి. ఇదంతయుఁ గేసుచేయఁబడి తనవదినెగారితో మేజిస్ట్రేటుకచేరికిఁ బోవలసివచ్చుటచే సంభవించు నప్రతిష్ఠకును నవమానమునకు నందువలనఁ దనకొమార్తెలకు మంచిసంబంధములు చేకూరక పోవునను భయముచే విచారించుచు ముత్యాలమ్మ చేసిన దాని కామెపైఁ దన కెంతకోపము వచ్చినను యామె నేమైన నన్నచోఁ గార్యము చెడిపోవునని దనకోపమంతయు దిగమ్రింగి తనహృదయములో నిముడ్చుకొని, వెంకన్నపైఁ దన కెంతయాగ్రహమున్నను నేమియుఁ జేయలేక నాపత్సముద్రములోఁ బడి తనగ్రహచారదినములు మంచివిగావని దలఁచుచు మతిపోయినవానివలెఁ దనలో దానాలోచించుచు నొకచోటఁ గూరుచుండెను. ముత్యాలమ్మయు దాను దప్పక కచేరికిఁ బోయి నలుగురిగండ్ల బడవలసివచ్చుననియుఁ దన కవమానము వచ్చునని

యు, నింకనేమైన యాపదఁగూడ తటస్థించిన, దటస్థించవలసివచ్చునని యు భయపడి కండ్ల నీరుఁగార్చుచు నొకమూలనుండెను. మొదలియారుగారును బిళ్ళగారును, వెంకన్నను నేరస్థునిగా రుజువుచేసి యాతనికి శిక్ష వేయించవలెననియు, నాతని నేమిచేసినను జేయదగినదేయనియుఁ, జెప్పుచుఁ గోపము పట్టఁజాలక పండ్లు పటపటఁగొఱుకుచు, వెంకన్న దమయెదుటనున్నట్లును నాతనిగొట్టుచున్నట్లును గోడలను స్థంభములనుఁ జేతులతో గుద్దుచుఁ గాళ్ళతో దన్నుచు నటునిటు దిరుగుచుఁ బోలీసు యినస్పెక్టరుమీఁద ఫిర్యాదుచేసి యాతని యుద్యోగమూడబెరికించెదమనియు, నీవ్యవహారమును గూర్చి నాలుగుదినములైనను నెన్నిదినములైనను నక్కడనుందుమనియు, నీవిషయమై యెంతధనమైనను గర్చుపఱచెదమనియుఁ, జెప్పుచుండిరి. కాపువాఁడు దనవ్యవహారమును బశువులను విడచి పెండ్లిగాని తనకొమార్తెల నొంటరిగా నింటదిగవిడచి యచ్చట నెన్నిదినములుండవలసివచ్చునో! యని భయపడుచుండెను. మొదలియారుగారును బిళ్ళగారును దమస్నేహితులగు నాయుఁడుగారిని శెట్టిగారిని విడచి కొన్నిదినము లక్కడనేయున్నచో వారికిఁ దమసంగతి దెలియక నేమేమిదొట్రుపాటుపడుచుందురో యని మనసులో సందేహించుచు వెంకన్నపై కోపముపట్టఁజాలక నేమియుఁ జేయగలసాధనములేకఁ జీకాకుపడుచుండిరి. కాపువానియొద్దగాని మొదలియారుగారియొద్దగాని నొకదమ్మిడీయైనను లేదు. పిళ్ళగారిజేబులో నాలుగురూపాయీలు మాత్రముండెను. ఆరూపాయీలను దీసికొని తమకెక్కివచ్చిన బండియెడ్లకు గొంత గడ్డికొనివేసి వానినొకచోటగట్టి మొదలియారుగారిని బిళ్ళగారిని ముత్యాలమ్మయొద్దఁగాపుంచి యాకాపువా డొకవంటపూటియింటికిఁ బోయి దానుభోజనముచేసి వారుముగ్గిరికిని నన్నముదీసికొనివచ్చి పెట్టెను. వీరు భోజనముచేయునప్పటికి మధ్యాహ్నము బండ్రెండుగంటలైనది. అప్పటికి

మొదలియారుగారికిఁ గొంచెము కోపము తగ్గి శాంతమువచ్చినది.

తరువాత మొదలియారుగారి కేసు పర్యవసానమేమయినను నామీవిషయమై పడవలసినశ్రమయంతయు నాలోచించి ముత్యాలమ్మ వెంకన్నను పెండ్లిచేసికొనలేదని రుజువుచేయవలసిన బాధ్యత గొంతవఱకైన దమకుదప్పదనియు, నామెయుఁ గాపువాఁడును నీకేసులో నప్రతిష్ఠకుఁబాలగుట విధాయకమనియు, నీవ్యవహారము త్వరలో దేలకపోవుటచే దాము దమస్నేహితులను సేవకులను విడచి గట్టుకొనుటకు బట్టలైన లేక యక్కడఁగొన్నిదినములుండక దప్పదనియు, నీకేసుమూలమునఁ గాపువానియొక్కయు ముత్యాలమ్మయొక్కయు గౌరవహాని యటుండ, నిరపరాధులగు నాతనిగొమార్తెలకిద్దఱకును వివాహములు గాకపోవుటగూడఁ దటస్థమగుననియు, గ్రహించి యీసంగతంతయు బిళ్ళగారితోఁ జెప్పి యీకేసేవిధముగానైన బోలీసువారిని సమాధానపఱచి దప్పిపోవునట్లు చేసికొనుట మంచిదని నిశ్చయించుకొని యీసంగతంతయుఁ గాపువానితోఁ జెప్పి యాతనిగూడ నందుకొప్పించెను. ఇట్లీముగ్గురా కేసు పైకిరాకుండఁ జేసికొనుటకు నిశ్చయించుకొని మధ్యాహ్నము మూఁడుగంటలకు మొదలియారుగారు సబ్‌యినస్పెక్టరుతోఁ గలసి మాట్లాడుటకుఁ బోలీసుస్టేషనుకుఁ బోయెను. సబ్‌యినస్పెక్టరు మొదలియారుగారిని జూచి కూర్చుండుమని చెప్పి యేమేమో పనియున్నవానివలె నటించుచు గొంతసేపు మాటలాడక తరువాత నాతని దీసికొని యావలికిఁబోయి మొదలియారుగారుచెప్పినదంతయు విని కార్యము మించినదనియుఁ, దానదివఱకే వాఙ్మూలములు దీసికొన్నట్టు రికార్డుగా చేసితిననియుఁ, జెప్పెను. మొదలియారుగారాపై నాతని ననేకవిధముల బ్రతిమాలి వెంకన్నకును నినస్పెక్టరుకును గలపి వెయ్యి రూపాయీలిచ్చుటకును, కేసు చెయ్యకుండ నావ్యవహారమును సవరణ చేయుటకును, నాతని నొప్పించి సాయంత్రమారుగంటలకు బసయొద్ద

కుఁ దిరిగివచ్చి కాపువానిని గలసికొని సంగతంతయు నాతనితోను బి ళ్ళగారితోనుఁ జెప్పెను. కాపువానియొద్ద నేమియు లేకపోవుటచే నా తడవ్వు డంతసొమ్మియ్యలేననియుఁ, దనకెవ్వరైన నాయాపత్సమయ మున నీసొమ్మిచ్చి సహాయముచేసినచోఁ దానింటికిఁ బోయినతోడనే యప్పైనఁ జేసి యాసొమ్మిచ్చివేతుననియుఁ, జెప్పెను. ముత్యాలమ్మ నా నమయములో సొమ్మడిగినచోఁ గార్యము చెడుటయే గాకఁ దమతో రాదని వీరు భయపడిరి. అప్పుడుచేయఁదగిన దేమియు గానుపించక పోవుటచే దయాసముద్రుఁడును నాపద్బాంధవుఁడును నగు నామొద లియారుగారు దనవజ్రముల దమ్మెట్లను బంగారపువాచీని బొత్తాముల ను గొదువపెట్టి సొమ్ముదెచ్చి పోలీసువారికిని వెంకన్నకును యిచ్చివే యుటకు నిశ్చయించుకొనెను. కాని యావస్తువులు గొదువపట్టి నె య్యరూపాయీ లాయూరనెవ్వరు నియ్యకపోవుటచే వాని నమ్ముట కి ష్టములేకఁ దనయింటికిఁ దంతిసమాచారమంపి పదియేనువందలరూ పాయిలా మరునాటికిఁ దెప్పించి పోలీసు సబ్ యినస్పెక్టరుకును వెం కన్నకును యిచ్చి సాయింత్రమగుటచే నారాత్రి చీకటిలోఁ బ్రయాణ మై పోవుట కిష్టములేక మరునాడు బయలుదేరుట కేర్పఱచుకొనిరి. ఇట్లు వారునలుగురు భీమునిపట్నములో రెండుమూడుదినములీ వ్యవ హారమునఁ దగులుకొని యుండవలసివచ్చెను.

ఈవిధముగా మొదలియారుగారును బిళ్ళగారును గాపువాఁ డును ముత్యాలమ్మయు భీమునిపట్నమున నీవ్యవహారములో దగుల్కొ ని యచ్చట శ్రమనొందుచుండ, నాయుఁడుగారును శెట్టిగారును లోక లు ఫండునత్రముదగ్గిరనున్న కాపువానియింటనే యుండి దమస్నేహి తులు గాపువాని కొమార్తెలకు సంబంధములు నిశ్చయముచేసి వరుల తో నింటికి వత్తురనియు, నందువలన వారింటికిఁ దిరిగివచ్చుట కాలస్య మైనదనియుఁ దలఁచుచుండిరి. కాని ముత్యాలమ్మొకవేళఁ దిరిగివచ్చు

ట కిష్టపడకపోయి యుండవచ్చుననియు నామె వీరికి గనుపించకనే యుండియుండవచ్చుననియు వీరికనుమానము లేకపోలేదు. సుబ్బమ్మయు లక్ష్మియు మాత్రము ముత్యాలమ్మవిషయమై యంతగా నాలోచించి యామెదిరిగివచ్చునో లేదో యని సందేహించకఁ దమ్ముఁ బెండ్లాడువరులను గూర్చియు దమవివాహములను గూర్చియు మనసులో నాలోచించుకొనుచు నత్యుత్సాహముతో నుండిరి. నాయుఁడుగారికి వీరిరువురు నతివినయభయభక్తులతో నుపచారము చేయుచు శెట్టిగారుపాడు సంగీతమును, జదువు పద్యములను, చెప్పెడికథలను వినుచు వీరిద్దరిని మిక్కిలి గౌరవించుచుండిరి. స్వభావముచే లక్ష్మి మాటలాడుచున్నప్పుడు నవ్వుచుండునని యిదివఱకేఁ జెప్పఁబడియున్నది. నాయుఁడుగారితో లక్ష్మి మాటలాడునప్పుడెల్ల నవ్వుచు మాటలాడుచు నాయనయొద్దఁ దరచుగా గూరుచుండుటయు సుబ్బమ్మ శెట్టిగారిపాటను, కథలను వినుచుండుటయు వీరిసేవకులగు రామునికిని గుప్పుసామికిని మనసులో గొంచెమనుమానమంకురింపఁజేయ, వారిరువురు నొకరితో నొకరు గుసగుసలాడుచు, నేమేమో మాటలాడుకొనుచుండిరి. అంతసత్రములోనున్న వంటబ్రాహ్మణుఁడు సత్యవరమునుండి తిరిగివచ్చెను. ఇతఁడు నలువది సంవత్సరములు వయసు గలిగి కొంచెము పొడుగుగ బలమైన శరీరముతో నుండెను. ఇతని చేతులకు బంగారు మురుగులు గలవు. పదిరూపాయల జీతమున కాసత్రములో నైదారుసంవత్సరములనుండి పనిచేయుచు నక్కడనే కాపురముండి వివాహముగానివాఁడు గావున రాత్రులందక్కడకు సమీపముననున్న గ్రామమునకుఁ బోయి నుదయమునఁ దిరిగి యాసత్రమునకు వచ్చి పనిచేయుచు నితఁడు గాలము గడపుచుండెను. ఇతఁడు దరచుగా ముత్యాలమ్మ యనుగ్రహమునకుఁ బాత్రుఁడై సత్రములోనున్న యూరగాయలు, బచ్చళ్ళు, గూరలు మొదలగువానిని నామెకిచ్చుచు నామెయొద్దఁ దనకుఁ గావలసివచ్చినప్పుడు స్వల్పమొత్తములుగా సొమ్ము

బదులుపుచ్చుకొనుచుండెను. కాపువాని గొమార్తెలమీఁద నీతఁడు గన్నువైచి వారిని స్వాధీనపఱచుకొనవలయునను నభిప్రాయమంతరంగమున దృఢముగా గలిగియుండెను గాని ముత్యాలమ్మకును గాపువానికిని మిక్కిలి భయపడుచుఁ దన దురుద్దేశమును బ్రకటించి తన యభీష్టముకొఱకుఁ బ్రయత్నించుటకు మిక్కిలి భయపడుచుండెను. ముత్యాలమ్మయుఁ గాపువాఁడును యింటలేనిసమయ మీతనికెంతకుఁ బూర్వమెన్నఁడును దటస్థముగాక యిప్పుడు తటస్థమగుటయు నట్టిమంచిసమయము దటస్థమైనప్పుడీనాయుఁడుగారును శెట్టిగారును దనకడ్డముగానుండుటయు, సుబ్బమ్మయు లక్ష్మియు నీయిద్దరితో మిక్కిలి చనువుతో నవ్వుచు మాటలాడుచుండుటయు నీతనిమనసును వేధించుచుండ తనపుట్టంతయు మునిగిపోయినట్లు దుఃఖించుచు నోర్వజాలనివానివలె నమితబాధలఁబడుచు రాముఁడు గుప్పుసామియు రహస్యముగా గుసగుసలాడుచు, మాటలాడుచుండుటఁ జూచి వారిస్నేహము చేసి వారితోఁ గలసి తానును రహస్యముగా మాటలాడుచుండెను. అంత నొకనాఁడు సాయంత్రము లక్ష్మి దమపెరటిగుమ్మము దగ్గరఁ గాలుజారిపడెను. ఆమె పడుటఁజూచి శెట్టిగారు లేవదీసిరి. దెబ్బతగులక పోవుటచే లక్ష్మి పకపకనవ్వుచు లేవ శెట్టిగారామెను జూచినవ్వుచుఁ “పెండ్లికొమార్తెకేమియు దెబ్బదగులకపోవుట మిక్కిలి సంతోషకరముగానున్నది” అని “పెండ్లికొమారుఁ డింటికివచ్చుసమయమునకుఁ బెండ్లికొమార్తె గుంటుచు నడచుచుండవలసిన యవస్థ దప్పినది” అని గేలిచేసిరి. ఇదంతయు రాముఁడు దడియావల నుండి తొంగిచూచి “లక్ష్మిని శెట్టిగారాలింగనముచేసికొని గేలిసేయుచు ముద్దాడి” రని యాతక్షణమేపోయి కుప్పుసామితోను సత్రములోనున్న వంటబ్రాహ్మణునితోను నక్రూడఁ దనకగుపించిన యితరులందఱితోను జెప్పెను. ఈసంగతి విని నతరువాత నాబ్రాహ్మణునకసలే మతిపోయినది. అతఁడు దనపని

గూడ మానివేసి రాత్రివేళ నకన్నెడనే యుండి సుబ్బమ్మను లక్ష్మిని గనిపెట్టి చూచుచుc గాచుకొని తిరుగుచుండెను. సుబ్బమ్మయు లక్ష్మియు న మాయకస్వభావముతో నెప్పటియట్లు నాయుcడుగారితోను శెట్టిగారితోను జనువుగా నవ్వుచు మాటలాడుచుండిరి. శెట్టిగారును నాయుcడుగారును దమయందు వీరికిc గల గౌరవభయభక్తులనుబట్టియుc వారు దమకుచేయు నుపచారములనుబట్టియు వారిని మిక్కిలి ప్రేమతోc దమ గొమార్తెలవలె గారవించుచుండిరి. రాముcడును వంటబ్రాహ్మణుcడును దమయిష్టమువచ్చినట్లు కథలుగల్పించి వీరిని గురించి యపవాదలాడుచు లక్ష్మికిని సుబ్బమ్మకును నాయుcడుగారితోను శెట్టిగారితోను సంబంధము గలదనియుc దాము స్వయముగాc జూచితిమనియు నెన్నెన్నియో గల్పించి యందఱితోcజెప్పిరి. మఱియు శెట్టిగారు గొన్నిదినముల క్రిందట వీరికి బట్టలను రైకలను గొన్నివస్తువులను గొనిపెట్టిన యంశ మీయపవాదను బలపఱచెను. సుబ్బమ్మయు లక్ష్మియు శెట్టిగారితోను నాయుcడుగారితోను నేమిమాట్లాడినను వీరు వారిరువురతో నేమి చెప్పినను వీరేమేమి చేసినను నంతయు శృంగారచేష్టలుగాను నాయికానాయకభావ ప్రకటనలుగాను నర్థముచేసికొని రాముcడును గుప్పుసామియు వంటబ్రాహ్మణుcడును లేనివన్నియుc గల్పించి యందఱితోc జెప్పుచుండిరి. రాముcడు మిక్కిలి భోజనప్రియత్వము గలవాcడు. నిద్రలో నీతcడు గలియుగకుంభకర్ణుcడనుట కింతమాత్రము నందియములేదు. వీనికి వంటబ్రాహ్మణుని స్నేహము లభించిన తరువాతc దనయంతరంగమంతయు నాతనికిందుకయిన దాచక బయలుపెట్టుచు నాతనికిc బ్రాణమిత్రుcడై సత్రమున నీతcడు వండినదంతయు స్వేచ్ఛగాc గడుపునిండ దినుచు నెప్పటియట్లు కాపువాని యింట భోజనము చేయుచుండెను.

అంత నొకనాcడుదయమునc దొమ్మిదిగంటలకు భోజనముచేసి

ముత్యాలమ్మయు మొదలియారుగారును బిళ్ళగారును బండిలోఁగూర్చుండి యుండఁ గాపువాఁడా బండి దోలుచు నింటికిఁ బ్రయాణమాయెను. వీరు దారిలో వెంకన్నపై దమకుఁ గల యాగ్రహమంతయు యథేచ్ఛముగాఁ బ్రకటించుచు విచ్చలవిడిగాఁ దమనోటికి వచ్చినట్లాతనిఁ దిట్టుచుఁ బోవుచుండిరి. వెంకన్న దుర్మార్గుఁడనియుఁ దన్ను మోసము చేసి తనసొత్తంతయుఁ దీసికొనిపోవుటకాతఁడు దన్ను వివాహము చేసుకొనువానివలె నటించి యిన్నికష్టములకును, నప్రతిష్ఠకును బాలుచేసెననియు ముత్యాలమ్మకప్పటికిఁదోఁచి యామెఁగూడ నాతనిఁ దిట్టనారంభించెను. కాపువాఁడు దనకు మొదలియారుగారు చేసిన సహాయమునకును నుపకారమునకును "మీరుచేసిన మేలుమఱువజాల" నని యాయనను శ్లాఘించుచు నర్థసహాయములేక నట్టికార్యములు సాధింపఁబడవని చెప్పఁ బిళ్ళగారట్టి విషయములలో నర్థబలము కన్న నంగబలమే ముఖ్యముగాఁ గావలయుననిరి. ఇట్లు కొంతదూర మీవిధముగా మాటలాడుకొనుచుఁ బోయినతరువాత మొదలియారుగారు గాపువానిఁ జూచి ముత్యాలమ్మ నింక నసహాయురాలినిగా వెంకన్నవంటి దుర్మార్గులు చేయు మోసకృత్యములకుఁ బాలగునట్లొంటరిగానుంచుట మంచిదిగాదనియు "స్త్రీలచిత్తములు దురవగాహములును నస్థిరములును నమ్మనర్హములుగానివియు న" నిశాస్త్రములు ఘోషించుచుండుటచే నికముందైన జాగ్రతపడకుండుట హానికరముగావున "నేండ్ల కామెకన్నఁ జిన్నవాఁడవైనను సంసారము క్షేమమును గుటుంబస్వాస్థ్యమును నెంచి యామె నించుకయిన నాలస్యముచేయక నింటికిఁబోయినతోడనే వివాహము చేసికొమ్మ" ని హితము చెప్పెను. పిళ్ళగా రావని యత్యుత్కృష్టమైనదిగావున నించుకయిన సందేహింపక యారాత్రిగాని మరునాఁడుగాని ముత్యాలమ్మను వివాహము చేసికొనవలసినదే యనియు, నందువల్ల గాపువాని కమితలాభమున్నదనియు, నాతని సంసారస్థితి

యంతయు మిక్కిలి జక్కగా నుండుననియు, నాతనికిఁ బుత్రసంతానముగూడఁ ద్వరలో గలుగుట కెంతమాత్రము సందియములేదనియు, నీవివాహము స్వయముగాఁ జేయించినతరువాత నే దామచ్చటనుండి పోవచ్చుననియుఁ, జెప్పెను. ముత్యాలమ్మ కీమాటలన్నియు స్పష్టముగా వినిపించకపోయినను దనమరిదిని దన్ను వివాహము చేసికొమ్మని చెప్పుచున్నారని గ్రహించి మునిమునినవ్వులు నవ్వుచు సిగ్గుగనబరచుచుఁ దల యొంచుకొని చెవిటిరామచిలుకవలె వీరాదుమాటలను జెవియొగ్గి వినుచుండెను. కాపువానికి మాత్ర మీమెను వివాహమాడుట కెంతమాత్రము నిష్టము లేదు. ముత్యాలమ్మకప్పుడు నలువదిరెండేండ్లకుఁ దక్కువవయసుండకపోయిననుఁ జూచుటకు ముప్పదియేండ్లకు లోపువయసుగలదిగా గనుపించుటచేతను నామెకంతకుఁ బూర్వము చిన్నతనములో వివాహమైనను భర్తతోఁ గాపురముచేసియుండని గారణమును బట్టియు వివాహయోగ్యతగల కన్యయే ననియు మొదలియారుగారు సెలవియ్యఁ బిళ్ళగా "రట్టి యోగ్యతగల పెండ్లికూఁతురు దటస్థమగుట గాపువాని పూర్వపుణ్యము" ని శ్లాఘించిరి. అప్పుడు ముత్యాలమ్మ దనసిగ్గును గొంచెమావలకుఁ ద్రోచి యట్టిసమయమున సిగ్గుపడి యూరకుండుట రసహీనమనియుఁ గార్యసాధనమునకుఁ దగనిదనియు జక్కగా గ్రహింపఁగల యుచితజ్ఞురాలు గావున సమయోచితముగా నప్పటి కర్హమైన శృంగారమును బ్రకటింపుచు స్త్రీయోచితములగు రసభావములచే శక్త్యానుసారముగా నుత్కలికలను విలసిల్లఁజేసి తల యొంచుకొని తనపెండ్లికొమార్తెతనమున కత్యావశ్యమైన ముగ్ధాలక్షణముల నభినయించుచుఁ దనకు నలువదియేండ్లు వయసులేదనియుఁ, జిన్నతనములోఁ దాను స్ఫోటకము పడుటవలన మొగముమీఁద గంట్లును జెముడును నొకగంటఁ గొంచెము పువ్వును మాత్రము దటస్థమైనవనియు, నైనను వానియడ్డ మెంతమాత్రము లేకుండఁ దనకుఁ జక్క-

గా మాటలు వినిపించుననియు, రాత్రివేళ నల్లపూస గూడ గనుపించకపోదనియుఁ, జెప్పి పైట సవరించుకొని తనయందమునకుఁ దానే యానందించుచుండెను. అప్పుడు పిళ్ళగారు సంసారస్త్రీలకును వివాహమాడుస్త్రీలకును సౌందర్య మనావశ్యకమనియు, శీలమును, స్వభావమును, గుణములును, మాత్రమే ముఖ్యమనియు, ముత్యాలమ్మ నల్లగానున్నను కురూపికాదనియు, నామెశరీరమున లావణ్యముగూడ స్పష్టముగా గండ్లు మిరుమిట్లుగొలుపఁ గనుపించుచున్నదనియుఁ జెప్ప, మొదలియారుగారు ముత్యాలమ్మనుఁ జూచినదాది దనవంటిపిల్లలుగలవానికేఁ దిరిగి యామెను వివాహమాడి యదివఱకే చిరకాలము క్రిందట మఱచిపోయిన తన యౌవనస్థితియందలి శృంగారరసభావములన్నియు నొక్కసారిగా వివేకమంతయు ముంచివేయ, నిశ్చలమైన మనసుగలవాఁడగుటచేఁ దనవివేకమంతయు సంపూర్ణముగాఁ గొట్టికొనిపోకుండఁ గొంతగాకపోయినఁ గొంతయైనను గాపాడుకొనఁగలిగితిననియుఁ, జెప్పి; కాపువానికి సర్వవిధములచేతను నట్టియుచితమైన వస్తువు దొరుకుట కేవలముఁ బూర్వకర్మపరిపాకమాహాత్మ్య మని యనేక విధములుగాఁ దననోటికివచ్చినట్లెల్ల శ్లాఘించెను. ముత్యాలమ్మ మందహాసముచేయుచు గవ్వలగుత్తులవంటి తనదంతముల శోభ గొంచెముగాఁ గానుపింప, మొదలియారుగారు దన్నుగూర్చి యాడిన మాటల కాయనపై ముగ్ధోచితమును శృంగారరససమన్వితమును నగు గోపమును వీక్షణమాత్రమున గనఁబరచి సవ్రీ తలవంచుకొని పైటసవరించుచు, నాతని శరీరముఁ దనకుఁ దగులకుండ నావలకు మెల్లగా జరిగి, తాను చిన్నతనములో స్ఫోటకముపడినప్పుడు దలంతయు గంట్లుపడుటచే శిరోజములు మిక్కిలి పొట్టిగాను పలచగాను నుండుటయు, నవి బాలనెఱుపుచేతఁ బండియుండుటయుఁ దటస్థమయినదనియు, నది లక్ష్మికి హాస్యాస్పదముగాఁ దోచుచున్నదనియుఁ, దానొక

వారము దినములు శ్రద్ధతోఁ బనిచేసిన యెడల జూడవీలుగాకుండఁ జేయగలననియు, "మొగుడులేని దానికి శృంగారమేల" యనియుఁ దనశృంగారము జూచి యానందించువారెవ్వరనియు, నదివఱకు విరక్తితోనశ్రద్ధ చేసితిననియుఁ, జెప్పి తనకీనాటికి గన్నెచెఱ వదలిపోవుటకుఁ గల్యాణకాలము వచ్చినదని సంతోషింపసాగెను. కాని యాగాపువాని కామెను వివాహముచేసికొనుట కెంతమాత్రము నిష్టములేకున్నను దనకమితోపకారమాచరించి ద్రవ్యసహాయముగూడఁ జేసి యాపద్బాంధవుఁడుగానున్న మొదలియారుగారియొక్కయుఁ, బిళ్ళగారియొక్కయు, మాటలకెదురాడ నోరురాక మాటలాడ కూరకుండెను. అంత ముత్యాలమ్మ దనతలకు నాగరమును, జెవులకు జూకాలునుఁ, జేతులకు వంకీలును, మురిడీగొలుసులును; మెడలోనికిఁ గాసులపేరును, గాళ్ళకుఁ బాంజేబులును, నడుమునకు మువ్వలవడ్డాణమును, ముక్కుకు మంచి బులాకీయుఁ జేయించుకొన్నచో బాగుగా నుండునాయనియుఁ దన కేరంగు బనారసుచీరఁ దగియుండునో జెప్పుమనియు, సిగ్గుతో మెల్లగాఁ బలికి, ప్రకృతిమధురముగల తనస్వభావసౌందర్యమునకు వేషరచన లావణ్యకములయినను భావిశోభనవ్యాపారోచితముగాఁ దనపెండ్లికొమార్తెతనమున కాభరణములు ముఖ్యములని గ్రహించి, తానీవస్తువులను మఱికొన్ని చిన్నవస్తువులను గూడ వెంటనే చేయించుకొనుటకు నిశ్చయించుకొంటినని, తనయంతరంగమందలి యభిప్రాయమంతయుఁ బ్రకటించి, తనభర్తయగు నా గాపువాఁడును దానును వివాహమాడి చేయు శృంగారచేష్టలన్నిఁటిని మనసులోఁ దలచుకొని సిగ్గుపడుచుఁ బెండ్లికొమార్తెవలెఁ దనమరిది దనవైపు జూచునప్పుడెల్ల సిగ్గుపడి మొగమువంచుకొనుచు యౌవనమప్పుడే యంకురించినట్లు నవోఢాభావములో నుండెను. తరువాతఁ బిళ్ళగారును మొదలియారుగారును ముత్యాలమ్మ వివాహమునకుఁ జేయవలసిన యేర్పాటులన్నిఁటిని గురిం

చియుఁ జర్చించుచుఁ గాపువానిసమాధానములో నవసరములేకయే నాయిరువురకు వివాహము రహితమయి ప్రధానముగూడ నయినట్లానందించుచుండిరి. ఇట్లు వీరుమాటలాడుకొనుచు ముత్యాలమ్మ వివాహము దామస్వయముగానుండి సత్వరముగా మహావైభవముతోఁ జరిగింప నిశ్చయించుకొని, మొదలియారుగారును బిళ్ళగారును దామీశుభకార్యమును జేయు దటస్థమైనందుల కానందసముద్రములో నోలలాడుచుఁ దాముపడిన మాగాయాసమంతయు మఱచిపోయిరి. ముత్యాలమ్మ గాపువాని యిల్లు సమీపించినకొలది భర్తృగృహము సమీపించు ముగ్ధాంగనవలె సంచరించుచు బండిలోనుండి మొదలియారుగారును బిళ్ళగారును జేతులుపట్టుకొని దింపువఱకుఁ దిగక గర్భాదానమందిరము జేరు గన్యవలెఁ దన్ను సుబ్బమ్మయు లక్ష్మియు లోపలికిఁ దీసికొనిపో మెల్లగా నడుగులిడుచు గాని యిల్లుచేరకపోయెను. ఉదయమైదుగంటలు మొదలుకొని యెక్కడజూచినను దానే గనిపించుచు లక్ష్మినో సుబ్బమ్మనో ఆవులనో యెడ్లనోదిట్టుచుఁ, బోరాడుచు, బిగ్గరగా మాటలాడుచు దిరుగుచున్న యీమె, యీవిధముగా మారిపోవుటఁజూచి యక్కడివారందఱును నాయుఁడుగారును శెట్టిగారును గూడ, నీమె యింటికిఁ దిరిగివచ్చుట కిష్టములేకఁ దనకు జరిగిన యవమానమునకుఁ జింతించుచు బలవంతముమీఁదఁ దిరిగి యింటికి రాగలుగుటవలన మొగముచెల్లక సిగ్గుపడుచుండెనని యూహించిరి. కాని యీమెమాత్రము దనగన్నె చెఱ వదలుటకు గల్యాణకాలము దటస్థమగుటచేతనే వెంకన్నకీబుద్ధి పుట్టుటయుఁ, దానాతనితోఁ గలసి రంగముదాకఁ గాకపోయినను భీమునిపట్నమువఱకైనఁ బోగలుగుటయుఁ బ్రాప్తమైనదని మనసులో సంతోషించుచు, వెంకన్నమూలమునఁ దన గన్నెచెఱ వదలి దానెక్కడకును బోవలసిన యవసరములేకయే స్వస్థానమునఁ దనవారందఱుఁ జూచుచుండఁ బెండ్లిపీటపై గూర్చుండు నదృష్టము సంభవించెనని మహానందముగు

రాలయి నెవ్వరేమి మాటలాడినను మారుబలుకక తన యానందమును తానే యనుభవించుచు నొకచోటఁ గూర్చుండెను.

కాపువాఁడు బండియెడ్లకు మేతఁబెట్టి వానిని గట్టివేసెను. శెట్టిగారును నాయుఁడుగారును ముత్యాలమ్మ నింటికిఁ దీసికొనిరాఁగలిగినందుకు మిక్కిలి సంతోషించిరి. మొదలియారుగారును బిళ్ళయు ముత్యాలమ్మను గాపువాఁడు వివాహమాడుట కేర్పఱుపఁబడినదనియు, నావివాహము త్వరలోనే మిక్కిలి వైభవముతోఁ దామందఱు గలసి చేయింపవలయుననియు, నాయుఁడుగారితోను శెట్టిగారితోనుఁ జెప్పిరి. రాముఁడీమాటలు విని పరుగెత్తుకొని పోయి సుబ్బమ్మతోను లక్ష్మితోను సత్రములోనున్న వంటబ్రాహ్మణునితోను జెప్పెను. ఈమాట విని సుబ్బమ్మయు లక్ష్మియు నీమునలిదానికీవయసున నీబుద్ధిపుట్టుటకును దమతండ్రి దమకు వివాహములు చేయఁదలపెట్టి తుదకుఁ దానే వివాహమాడుటకు నిశ్చయించుకొన్నందుకును నత్యాశ్చర్యము నందుచుఁ దమపెత్తల్లియగు ముత్యాలమ్మ యికముందు దమకు సవతితల్లికూడ యగుననియుఁ దమ్ముఁ బూర్వముకన్న నెక్కువ బాధలను బెట్టుననియు భయపడుచుండిరి. ముత్యాలమ్మ మాత్రము తా ననుభవింపఁబోవు శృంగారమును సౌఖ్యమును మనసులోఁ దలచుకొనుచుఁ, దాను చేయించుకొనవలసిన యాభరణములను గూర్చి యాలోచించుచు మిక్కిలి సంతోషముతో నుండెను. శెట్టిగారును నాయుఁడుగారును ముత్యాలమ్మను కాపువాఁడు వివాహమాడుట కేర్పఱుపఁబడి నిశ్చయింపఁబడినదని వినినతోడనే కొంచె మాశ్చర్యముగాఁ దలచినను మొదలియారుగారును బిళ్ళగారును జెప్పినకారణములనుఁ బట్టి యావివాహ మత్యుత్కృష్టమనియే నిశ్చయించిరి.

తరువాత రాముఁడును గుప్పుసామియు సత్రపు వంటబ్రాహ్మణుఁడును ముత్యాలమ్మ వివాహమును గూర్చి మాటలాడుకొనుచు నామె

యంగవైకల్యమును గూర్చియు ముసలితనమును గూర్చియుఁ జెప్పుకొని నవ్వుకొనుచు, ముత్యాలమ్మ కీవయసున నిట్టి బుద్ధిపుట్టుటకును కాపువాఁడా మెను వివాహమాడఁదలచినచో నిన్నాళ్ళూరకుండి యిప్పుడీ కార్యమును దలపెట్టినందులకును నాశ్చర్యమందుచుండిరి. సత్రపువంటబ్రాహ్మణుఁ డీసంగతంతయు దూరమాలోచించి యావివాహము దమస్నేహితులగు శెట్టిగారును నాయుఁడుగారును సుబ్బమ్మను లక్ష్మిని దీసికొని పారిపోఁగలుగుటకు మొదలియారుగారును బిళ్ళగారును కపటోద్దేశముతోఁ బన్నినతంత్రమని నిశ్చయించుకొని, ముత్యాలమ్మను కాపువానికిఁ గట్టబెట్టి యాతని కొమార్తెలను దీసికొనిపోదురని రాముని తోను గుప్పసామితోను చెప్పెను. రాముఁడును గుప్పసామియు నాగాపుకన్యక లిద్దరుఁ దమతో వత్తురని యానందించిరి. కాని సత్రపువంటబ్రాహ్మణునకు మాత్రమిదియంతయు మఱెంత మనోవ్యాకులమునకును దుఃఖమునకును కారణమయి యాతఁడు మతిపోయినవానివలె సంచరిందుచుండెను. రాత్రి భోజనమైన తరువాతఁ గాపువాఁడును మొదలియారుగారును బిళ్ళగారును మార్గాయానమున బండుకొని నిద్రపోయినతరువాత సత్రపువంటబ్రాహ్మణుఁడు ముత్యాలమ్మనేమో పనియున్నవానివలె నీవలకుఁ బిలచి "నీవు పెండ్లాడబోవుదువని విని మిక్కిలి సంతోషించితి" ననిచెప్పి "వివాహముగాని కన్యలను నాయుఁడుగారి యొద్దను శెట్టిగారియొద్దను దిగవిడచిపోవుట, మిక్కిలి యప్రతిష్ఠకు కారణమైనదినుమా" యనెను. ఆమాటవిన్నతోడనే ముత్యాలమ్మ వంటబ్రాహ్మణుని దూరముగాఁదీసికొనిపోయి యాసంగతిగ్రుచ్చిగ్రుచ్చి యడుగ నారంభింపఁగా వంటబ్రాహ్మణుఁడు "నాయుఁడుగారికిని శెట్టిగారికిని సుబ్బమ్మతోనులక్ష్మితోను సంబంధముగలిగినది; నీవింటలేని యీ రెండు మూడుదినములుమ యిల్లంతయు నీనలుగురును గలసి యల్లకల్లోలముగాఁ జేసిరి; ఈసంగతి యందఱకుఁ దెలిసినది; ఆకన్యల కింక వివాహములు

గావుక ఇదియంతయు వారి సేవకులగు రాముఁడును గుప్పసామియు దము గండ్లారఁ జూచి" రని యున్నవియు లేనివియుఁ గల్పించి బిగ్గరగా జెప్పెను. ఈమాటలు వినినతోడనే ముత్యాలమ్మకుఁ దనవివాహవిషయమైన సంతోషముటుండ సుబ్బమ్మయు లక్ష్మియు నిట్టిపనిచేసిరని విచారమును వారిపైఁ బట్టరాని యసహిష్ణుత్వమును గలిగినది. తాను కాపువానిని వివాహమాడి పూర్వముకన్న నెక్కువ స్వతంత్రముతో సుబ్బమ్మను లక్ష్మిని సవతితల్లి ప్రేమతో దనయధికారమున నుందుకొని లక్ష్మిమీఁదఁ దనకుఁగల కోపమంతయుఁ దీర్చుకొనగలుగుట కవకాశము గలుగదని యెంచియో, యాకన్యకలకు నాయుఁడుగారు శెట్టిగార్లవంటి మంచి భర్తలు దొరికిరని దలచి వారియదృష్టమున కోర్వజాలని హేతువును బట్టియో, దమకుటుంబమున కప్రతిష్ఠాకరమగు నట్టిదుష్కార్యము జరిగినదను గారణమును బట్టియో, మనము స్పష్టముగాఁ జెప్పలేము గాని, ముత్యాలమ్మ మాటవినినప్పటినుండియు మతిలేనిదానివలెఁ బట్టరాని యాగ్రహముతో నింటిలోనికిఁ బోయి నిద్రపోవుచున్న సుబ్బమ్మను లక్ష్మిని దిట్టుచు దనవివాహము సంగతంతయు మఱచిపోయి నిద్రపోఁజాలక యింటిలోనికిఁ బోవుచు నీవలకువచ్చి కొంత సేపరుగుమీఁదఁ గూర్చుండుచు నటునిటు దిరుగుచు నారాత్రియంతయు దయ్యముపట్టినదానివలె గడపెను. మొదలియారుగారును పిళ్ళగారునుఁ గాపువాఁడును శెట్టిగారును నాయుఁడుగారును యేపాపమెఱుఁగని సుబ్బమ్మయు లక్ష్మియు నాడలెఱుంగక స్వస్థచిత్తులై నిద్రపోయిరి. ముత్యాలమ్మ రామునితో మాటలాడి యాతఁడు చూచినదంతయు సవిస్తరముగాఁ దెలిసికొనవలెనని యాతఁడు పరున్నచోటికిఁ బోయి యాతని ననేకపర్యాయము లెన్నెన్ని విధములనో గట్టిగాఁ గేకలు పెట్టియు, గిల్లియుఁ, గొట్టియు, లేపఁ బ్రయత్నించెనుగాని యామె ప్రయత్నములన్నియు నిష్ఫలములగుటయే గాక, నామె నాతఁడు దనగాఢనిద్రలో కాళ్ళతోఁ దన్ను

టయుఁ జేతులతో గొట్టుటయు గూడఁ దటస్థమయ్యెను. రామునితో మాటలాడి యాతఁడు దనకన్నులారఁ జూచిన సంగతంతయుఁ దెలసికొనుదాక ముత్యాలమ్మ కేమియు దోచకుండెను. ముత్యాలమ్మ రాముని నిదనుండి లేపుటకుఁ జేసిన సాధములును బ్రయత్నములును నన్నియు వృథయయ్యెను. ఇట్లా రాత్రి యంతయు ముత్యాలమ్మ దయ్యమువలె మేలుకొని గడపి తెల్లవారక పూర్వమె పెద్దపెద్ద కేకలు పెట్టుచుఁ దన చేతిలోని చీపురుగట్టతో సుబ్బమ్మను లక్ష్మిని లేపి తననోటికివచ్చినట్లెల్ల వారిని తిట్టనారంభించెను. ఈ కేకలు విని యింటిలోనివారందఱు లేచిరి. ఇట్లు ముత్యాలమ్మ దన నూతనవధూత్వమున కుచితమైన ముగ్ధత్వమును, దానంతకుఁ బూర్వము కొన్నిగంటలక్రిందటఁ బ్రకటించుచుండిన నవోఢాభావములను, హఠాత్తుగా నొకసారిగాఁ ద్యజించి కోపినియై గయ్యాళిగాఁ బరిణమించుట మొదలియూరుగారికిని వారిస్నేహితులకును మిక్కిలి యాశ్చర్యకరముగాఁ గనుపించెను. కాని దీనికిఁ గారణముమాత్రము వారూహింపఁ జాలరైరి. సాయంత్రమింటికి వచ్చినప్పుడు దమకు దమ పెత్తల్లియగు ముత్యాలమ్మ గనఁబఱచిన ముగ్ధత్వము తెల్లవారులోపల గయ్యాళితనముగా మారిపోవుటకుఁ గారణము దెలియక సుబ్బమ్మయు లక్ష్మియుఁ దమలో తామాశ్చర్యపడుచుఁ దమతండ్రిని బెండ్లాడకుఁ బూర్వమే యీమె దనసవతితల్లి యధికారమంతయుఁ జూపించుచున్నదనియు వివాహమైన తరువాత నింకనెంత యధికారము జేయునో తమపాట్లేమగునోయనియు భయపడుచుండిరి. కాపువాఁడామె గయ్యాళితనమంతయుఁ జూచి యామెకుఁ దయ్యముపట్టినదనుకొనెను. దాపున సత్రములో నున్నవారందఱు నామె తిరిగి వివాహము చేసికొన నిశ్చయించుకొన్న కారణమును బట్టి యామె చిన్నతనములోఁ జిరకాలము క్రిందటనే మృతినొందిన యామె భర్త యామెను బట్టుకొనెనని నిశ్చయించి త్వరలో సమర్థుఁడగు భూతవై

ద్యునిచే మంత్రసాధనములు జేయించు టత్యావశ్యకమని జెప్పిరి. కాని యీమె యీవిధముగా నల్లరిచేయుటకుఁ గలరహస్యకారణ మాసత్రపు వంటబ్రాహ్మణునకొకనికే దప్ప నితరుల కెవ్వరికిని తెలియలేదు. ఒకవేళ నీకారణము రామునకుఁ గూడఁ దెలసినఁ దెలసియుండవచ్చునేమో యని మనమనుకొనుట కాతఁడంతదూర మాలోచింపఁగల బుద్ధిలేనివాఁడును, రాత్రిభోజనమగుటఁ దడవుగా నొడలెఱుంగక నెందరెన్ని కేకలు పెట్టికొట్టినను నించుకయినఁ గదలక యమేధ్యముగా గాఢనిద్ర జెందుస్వభావము గలవాఁడునగుటంబట్టి, రాత్రి ముత్యాలమ్మతో వంటబ్రాహ్మణుఁడొకఁడు నిముసమైన నాలస్యము చేయక సుబ్బమ్మనుగూర్చియు లక్ష్మినిగూర్చియుఁ దాను వినినదంతయుఁ జెప్పివేసి యీచిత్రకథ నంతయుఁ స్వయముగా నడపి యీమె యనుగ్రహమునకును నీసంగతంతయుఁ గనిపెట్టఁగలిగిన ప్రతిష్ఠకును పాత్రుఁడుగాకుండఁ జేయఁగల సమయోచితప్రజ్ఞ యీవంటబ్రాహ్మణునకు లేదని నిశ్చయించుకొనఁ గలుగునంతటి యాలోచనగలవాఁడును గావున మనమావిషయమును గూర్చి రాముడేమియు నెఱుఁగఁడని స్పష్టముగా యొప్పుకొనకఁదీరదు.

ఇట్లు ముత్యాలమ్మ చర్యలను గూర్చి పలువురు పలువిధములుగాఁ జెప్పుకొనుచు నాశ్చర్యపడుచుండిరి. కాపువాఁ డీమెకు భూతవైద్యము చేయించవలసిన యవసరముగలిగెనని యొకమారును యీమె రాత్రంతయుఁ దన్నుఁ ద్వరలో వివాహమాడఁగలుగుదునన్న వెఱ్ఱినమ్మకము చేత తనయింటి కధికార మప్పుడే వచ్చినట్లు భావించుకొని తనసవతితల్లి యధికారమును గృహిణీత్వ వైభవమును దలచికొని యొడలెఱుంగకఁ దనకొమారితెల మీఁదను నందరిమీఁదను కేకలు వేయుచున్నదని యొకమారును, ముప్పదిసంవత్సరములకుఁ బైగా వితంతువుగానుండి భర్తతో నొకదినమైనఁ గాపురము చేయఁగలుగు

భాగ్యము నంది యెుఱుఁగక వయసువచ్చినదాదిగాఁ దనయింటనే పడియుండి సంసారసుఖమన్ననెట్టిదోఁ గలలో నైన ననుభవించి యుండని దానికొకదినములో హఠాత్తుగా వివాహమగు నన్నసంతోషమును ఆనందమును మతిభ్రమ గలుగఁజేసియుండవచ్చునని యెుకమారునుఁ, దన్నువివాహమాడి తనతో ననుభవింపఁబోవు సంసారసుఖములను శృంగారమును రాత్రియంతయు మనసులో నువ్విళులూరుచుఁ దలచుకొనుచుండి యుండుటచే మదపిచ్చ పట్టి యుండునని యెుకమారును, దలచుచు నేమిచేయుటకునుఁ దోచకఁ దొట్రుపాటు నొందుచుండెను. ఈవిధముగా నందఱు ననేకవిధములుగా ముత్యాలమ్మచర్యలకు మనసులోఁ గారణములను గల్పించుకొని యనేకవిధములగు యనుమానములు గలహృదయముతోఁ జాలకాలము బాధపడుచు దమమనస్సుల నాయాసపెట్టుకొనవలసిన యవసరము లేకుండ ముత్యాలమ్మ రాముఁడు నిద్రలేచినవెంటనే పక్కమీఁదనుండి యాతని నావలకుఁ దీసికొనిపోయి యాతఁడు చూచినదంతయుఁ జెప్పుమని యాతని నెన్నోవిధముల బుజ్జగించియు, శ్లాఘించియు, మంచిమాటలాడియు, నాసపెట్టియు, లంచమిచ్చియుఁ, బ్రేమగనుపఱచియు, లాలించియు, దయఁజూపియు, నెన్నెన్నియో ప్రమాణములు చేయించియుఁ దానెవ్వరితోను జెప్పనని ఘోరప్రమాణములు చేసియు, నడిగి తెలిసికొనినతరువాత నామెకు శెట్టి పట్టపగటివేళ నెవ్వరైనఁజూతురన్న సందియమైనను భయమైనను తుదకు సిగ్గైనను నించుకైనలేకఁ దనస్వభార్యగానెంచి యాలింగనముచేసికొని ముద్దాడిపకపక నవ్వుచు హాస్యమాడుట మిక్కిలి దుస్సహముగానుండెను. శెట్టిచేసిన యీఘోరపుపనియటుండ మంచిచెడ్డలు తెలసి యేండ్లుగడపిన తనయంతటివివేకమునుజ్ఞానమును, బ్రపంచానుభవమును గలదానికే వివాహము దలపెట్టినంత మాత్రముననే యనివార్యముగాఁ బ్రకటీకృతమగు నట్లంతరంగమున కల్యా

ణోచితమగు లజ్జయు ముగ్ధాభావమును నంకురింపఁగా నిన్నగాక మొన్నఁ గండ్లుదెఱచి యొకచెంప గొట్టిన నీళ్ళును రెండవచెంపఁగొట్టినఁ బాలును గారునట్టి పిన్నవయసుగలిగి వివాహమన్నను భర్తయన్నను నించుకయిన నూహింపనైన నూహింపఁజాలిన జ్ఞానమును, ప్రపంచానుభవమును, నించుకైన లేక, నాటపాటలలో దిరుగుచున్న లక్ష్మి దనవయస్సునకు స్వభావోచితమగు ముగ్ధాలక్షణములలోఁ బ్రధానమగు సిగ్గును గొంచెమైన లేకఁ బచ్చిలంజవలెఁ బకపకనవ్వుచు నాశెట్టి దనపైఁ బడిచేసిన దానినెల్ల సంతోషముతో భరించుచు నిందఱుమగవాళ్ళుఁ దనచుట్టునుండి దన్నుఁ జూచుచున్నారన్న సందేహమును భయమును గూడ నించుకయినఁ బొందక నిర్భయముగా దొమ్మరదానివలె సంచరించినవిధమంతకన్న మిక్కిలి ఘోరముగా నామె కప్పుడు దోచెను. ఇది యటుండఁ దనతో రాత్రింబగళ్ళు దిరుగుచుఁ దన్నేసమయమందైన విడువక సంచరించుచున్న సుబ్బమ్మ యొక్కడ జూచునో యేమనుకొనునో, తక్కినమగవాళ్ళటుండ, నాయుఁడు గండ్లబడుటచే యాతఁడేమనుమానపడునో, తరువాత నతనికేబుద్ధిబుట్టి యేమిచేయునో, యను యనుమానమును, భయమును, సిగ్గును లక్ష్మికి లేకపోవుటయుఁ, దనస్నేహితుఁడేమనుకొనునో, సుబ్బమ్మ యేమనునో, యెవరితోఁజెప్పునో, యందువలన నేమిసంభవించునో, యనుభయమును సందేహమును శెట్టికి లేకపోవుటయు, దనమనసులోఁ దలచుకొని వీరు నలుగురు తోడుదొంగలై యభేదముగాఁ దనకును వాండ్రతండ్రికిని గాకపోయినను, లోకమునకైన నించుక వెఱువక సంచరించిరని ముత్యాలమ్మ నిశ్చయించుకొనెను. తరువాత నీమె, దూరాలోచనగలిగి యనుభవముతో యుక్తాయుక్తములెఱిగిన యోగ్యత గలిగి, నిజానిజములను గ్రహించగల సామర్థ్యమును వివేకముగలదిగావున మొదలియారును డిప్యూటీకలెక్టరుగారునుఁ బ్రప్రథమమున నారాత్రి చీకటివేళ

గుఱ్ఱమును దీసికొనివచ్చిన దాది యప్పటివఱకు జరిగినదంతయు సంపూర్ణముగా మనసులో జ్ఞాపకమునకుఁ దెచ్చుకొని యిదియంతయు డిప్యూటీకలెక్టరుగారి సలహామీఁద నీనలుగురు నాలోచించుకొని లక్ష్మిని సుబ్బమ్మను దీసికొనిపోవుటకుఁ జేసిన కార్యమని స్పష్టముగా నూహించి నమ్మి, నిశ్చయమని యెంచి, సిద్ధాంతముచేసికొనెను. సుబ్బమ్మ శెట్టిగారిసంగీతమువినుచు నాతనియొద్దనే గూర్చుండి కథలువినుటయు, లక్ష్మి నాయుఁగారికత్యంతవినయముతో నుపచారము చేయుచుండుటయు, రాముఁడు చిత్రవిచిత్రమైన కథలుగాఁ గల్పించి తానేమి చెప్పెనో దనకేదెలియకుండ నిద్రగండ్లతోఁ జెప్పినదంతయు నీమెకీనలుగురు గలసి యీదుష్కార్యమును నిశ్చయముగాఁ జేసిరన్న యభిప్రాయము మఱింత దృఢమగునట్లు చేసెను. మఱియుఁ దమకుఁ బెండ్లికావలసియున్నదనియుఁ, దమకు వివాహములుచేయుటకు సంబంధముల కొఱకుఁ దమతండ్రి ప్రయత్నించుచున్నాఁడనియుఁ, దాము సంసారబిడ్డలమనిఁ దెలిసియుండియుఁ, దమగౌరవమును దమ కుటుంబగౌరవమును దమతండ్రిని బంధువులను గులమువారిని యాలోచించి, తమకుఁ బెండ్లిగాక చెడిపోదుమని భయమైన లవలేశమును, లేక, నిర్భయముగా నిట్టిపనిచేసిన యీసుబ్బమ్మయు లక్ష్మియు నెంతకైన సాహసురాండ్రేయనియు, నేమిచేయుటకైన వెనుదీయని స్వభావము గలవారేయనియు, ముత్యాలమ్మ నిశ్చయముగా నమ్మెను. తరువాత శెట్టియు నాయుఁడును గలసి తమకుఁజేసిన యుపకారమున కించుకయినఁ గృతజ్ఞతఁ జూపకుండుటయుండఁ దమయింటఁ జేరి యిట్టిసంసారిఘాతకూడఁ జేసినందుకు ముత్యాలమ్మ వారిపై నింతింతనరాని కోపముతో నుండెను.

ఇట్లు ముత్యాలమ్మ తనవివాహము సంగతంతయు మఱచిపోయి లక్ష్మిమీఁదఁ గోపముచేతను తనచెల్లెలు గొమాతెలిట్టి యవమానకరమగు పనిని జేసినారన్న యభిమానముచేతను నొసలెఱుంగకఁ బడు

గుపేరుగున బయిగెత్తుకొనివచ్చి తనమఱదియగు కాపువానితో నంతయుఁ జెప్పెను. కాపువాఁడామె చెప్పినదంతయు వాస్తవమయినను గాకపోయినను దనకప్రతిష్ఠాకరముగా నున్నదనియుఁ, దనగొమార్తెలకు వివాహములు గాకపోవుటకుఁ గారణమగుననియుఁ, దలచి, ముత్యాలమ్మను శాంతపఱుప ననేకవిధములఁ బ్రయత్నించెను గాని యాతఁడామెను శాంతపఱిచినకొలది యామె మఱింత బిగ్గరగాఁ గేకలుపెట్టుచు, సుబ్బమ్మను లక్ష్మిని శెట్టిని నాయుఁడుగారిని యటుండ మొదలియారును బిళ్ళను దనమఱదియగు కాపువానిని గూడఁ దిట్టనారంభించెను. ఇదంతయుఁ జూచి శెట్టియు నాయుఁడును దామేపాప మెఱుఁగమనియుఁ దామాకన్యకలను దమకొమార్తెల వలెఁ దలచుకొనుచున్నామనియు, నెన్నెన్నో ఘోరప్రమాణములు చేసిరి. సుబ్బమ్మయు లక్ష్మియుఁ దామేపాపమెఱుగమని యేడ్వసాగిరి. ముత్యాలమ్మ దనకోపము పట్టఁజాలక రాముఁడీదుర్వ్యాపారమంత స్వయముగాఁ దనకన్నులతోఁ జూచినాఁడనియుఁ, దనతోఁ జెప్పెననియుఁ, దన కేకలలో ననెను. ఆసంగతి మొదలియారుగారు విని, రామునిఁ బిలచి, యాతనివలన నాతఁడు జూచినదంతయుఁ దెలిసికొని, లక్ష్మి కాలుజారి పడినందున శెట్టి యామెను లేవదీసెను గాని యేమియుఁ జేయలేదని నిజముగ్రహించి కాపువానితో నాతని గొమార్తెలును దనస్నేహితులును నిష్కపటముగు హృదయములు గలవారనియు, వారేదుష్కార్యమును జేయలేదనియు, వారిని గూర్చి యట్లనుమానపడి యుచితానుచితము లెఱుఁగని రాముఁడేమో చెప్పినాడన్న మాత్రమున నాగన్నెలకును, దనస్నేహితులకును, నప్రతిష్ఠవచ్చునట్లల్లరిచేయుట మంచిదికాదనియు, నెన్నెన్నో విధములఁ జెప్పెను. కాపువాఁ డూరకున్నను ముత్యాలమ్మ మాత్ర మూరకుండకఁ దననోటికి వచ్చినట్లు కేకలు వేయుచునేయుండెను. ఈ సంగతంతయు విని అక్కడనున్నవారిలోఁ గొందఱు రాముఁడు చె

ప్పినదంతయు వాస్తవమే ననియు, నాకన్యలను శెట్టియు నాయుఁడు ను బాధుచేసిరనియుఁ, గొందఱా సంగతంతయు వాస్తవమైనను గాక పోయినను నవివాహితలగు నాకన్యలను బూర్వపరిచయ మించుకయు లేని వారిరువురకు నొప్పగించుటఁ గాపువాని దేతప్పనియు, మఱికొంద ఱు మొదలియారు దనస్నేహితుల మాటాడును గాని నిజమేల చెప్పున నియు, ననేకవిధముల దమతమ యభిప్రాయముల నెల్ల నయాచితము గాఁ దమంతటతామే చెప్పనారంభించిరి. సత్రమువంటఁ బ్రాహ్మణుఁడు మాత్రము నీసంగతంతయు వాస్తవమని స్పష్టముగా నెవ్వరితోను జె ప్పకపోయినను, రహస్యముగా నక్కడిపారందఱితోను వాస్తవమేయ నియుఁ, గాపువాఁడాదినమింటికి రాకపోయినయెడల సుబ్బమ్మయు ల క్ష్మియు తమయిల్లు విడచి లేచిపోదురనియు, నర్థమువచ్చునట్లు మాట లాడ నారంభించెను. తామేపాపమెఱుగక నిష్కపటమగు హృదయ ములతో నాకాపువాని నత్కారముల నందుకు నాతనికిఁ గృతజ్ఞులై యాతనికే ప్రత్యుపకారమాచరించి యాతనిఋణము దీర్చుకొందు మా ? యని, యాలోచించుచున్న నాశెట్టియు నాయుఁడును దమహృద యములు క్షోభింప మిక్కిలి విచారించి యికనాయింటనుండుట దమ కనుచితమని నిశ్చయించుకొనిరి. కాపువాని కుపకారబుద్ధితో వాస్తవ మైన కృతజ్ఞతగల యంతఃకరణముతో నిష్కపటమగు హృదయముతోఁ జేసిన సహాయమును నాతనికొఱకుఁ దానును బిళ్ళయుఁ బడిన శరీరా యాసమును నటుండ, నాపత్సమయములో వెయ్యిరూపాయీలాతనికిచ్చి నసంగతంతయుఁ దలచికొని "పుణ్యమునకుఁ బోయినఁ బాపమెదుర య్యె" నని దుఃఖించుచుఁ, దామాగాపుకన్యకలనుదమకొమార్తెలనుగా దలచుకొని వారివివాహములు చేయించి కన్నులారఁ జూచి యానందిం ప నిశ్చయించుకొనియుండఁ దమ సదుద్దేశమంతయు నీరీతిగాఁ బరిణ మించినందుకుఁ దమ గ్రహచారదినములను దూరుచు, నాయిల్లువిడచి

యాక్షణమే నావలకుఁ బ్రయాణమై పోవుటకు మొదలియారును బిళ్ళె యు నిశ్చయించుకొనిరి. ఇట్లీనలుగురు దమసామానంతయు నొకబండి లో వేసి తామెక్కుట కానత్రమువద్ద బళ్ళుదొరకక పోవుటచే దాపు న నున్నగ్రామమువఱకుఁ దమసేవకులతో నడిచి పోయిరి. మొదలి యారుగారు గాపువాఁడు దనకియ్యవలసిన వెయ్యిరూపాయీలనైన నడుగలేదు. ఆయుదయము పదిగంటలకు వీరాగ్రామముఁ జేరి భోజన ముచేసి సాయంత్రమువఱకక్కడనే యుండి, రాత్రి భోజనమయిన త రువాత బళ్ళుగట్టించుకొని మఱునాఁడుదయము పదకొండుగంటలకుఁ గళ్యాణపురముఁ బ్రవేశించిరి.

ఆహా! కాలవైపరీత్యమహాత్మ్య మేమనిచెప్పవలెను. బుద్ధిహీన తచే యుచితానుచితము లాలోచించక, దానుజూచినదియుఁ జూడనిది యు గూడఁ దననోటికివచ్చిన ట్లెల్ల ప్రేలుటచే రాముఁడును, గపటో ద్రేకముతోఁ బాపమున కించుకైన వెనుదీయక లేనినేరములను గల్పిం చిచెప్పిన యానత్రపు వంటబ్రాహ్మణుని దుష్టస్వభావమును, నమాయ కస్వభావముతోఁ బ్రవర్తించుచున్న యాకాపుకన్యకలను, మన దేశో పకారపరతంత్రులగు మొదలియారు మొదలగు నీనలుగురు పెద్దమను ష్యులను, రెుట్టెట్టి యాపదలకును నెట్టియపవాదలకును బాలుచేసెనో గద! "పుణ్యమునకుఁబోయినఁ బాపమెదురయ్యె"నను లోకోక్తి వాస్త వమనుట కింతకన్న నేమినిదర్శనము గావలెను. ఉదయమున నిద్ర నుండి మేల్కొనినది మొదలుకొని సాయంత్రమువఱకుఁ దనపొలము న వ్యవసాయపు బనులుచేసికొని పాపభీతిగలిగి స్వకాయకష్టమున జీ వించుచు నేవ్యవహారమందును నేవిధమైన జోక్యమును గలుగఁజేసికొ నక దైవభక్తిగలిగి తనశక్త్యానుసారముగా నితరులకు సహాయముచే యుచుఁ, దనసంసారమును జాగరూకతతో గడపుకొనుచుఁ, దనమరద లగు ముత్యాలమ్మతోను దనకొమార్తెలతోను, సుఖముగాఁ గాలముగడ

వుకొనుచు, న్యాయమార్గమున సంచరించుచున్న యీగాపువాఁడీనవ
సరముగా నిట్టిదురవస్థకుఁ బాలగుటఁ గాలవైపరీత్యముగాని మఱియొ
కటిగాదుగద! అయ్యో! పాపమీతఁడాసమయము నెట్లెట్లుదుఃఖించెనో
యాతనిహృదయ మెంతక్షోభించెనో గద! ప్రాతఃకాలమున లేచి గృ
హకృత్యముల నెల్ల శ్రద్ధతో నేమరకఁ జేసికొని తమకు భగవంతుఁడ
నుగ్రహించి దయచేసిన దానితోఁ దృప్తినొంది, యమాయికవృత్తితోఁ
జరియించుచు నెవ్వరికిని యేవిధమైన యపకారమును గాని హానిని గాని
జేయక, లోకజ్ఞానమించుకయు లేకఁ, దమయింటనే బడియుండి, రా
త్రిదమతండ్రి యింటికెప్పుడు వచ్చునా యని యాతనికెదురుచూచుచు,
నాతనిఁ జూచినతోడనే యత్యుత్సాహముతో నాతని నాదరించి యాతఁ
డు పొలమునుండి దెచ్చిన దృణమునైన గొప్పవస్తువుగా మిక్కిలి యా
నందముతోఁ బరిగణించుచుఁ, బాపమన్న గజగజవణకుచు, దైవభక్తి
గలిగి తమతండ్రినే తల్లిగను దండ్రిగను భావించి గౌరవించుచు దమ
పెత్తల్లి దమ్మెంతదిట్టినను గొట్టినను మాటలాడక సంచరించుచున్న
యీగాపుగన్యక లాదినమున నెట్లెట్లుదుఃఖించిరో గద! నిష్కారణము
గా నిట్టియాపదలకుఁ బాలయిన యీసుబ్బమ్మకును లక్ష్మికిని దైవము
దప్ప మఱియెవరు దిక్కుగలరు? తనకొమార్తెకు మంచిసంబంధములు
చేసి, తన యల్లుళ్ళనే కొమాళ్ళనుగా నెంచి తనయింట నుంచుకొని త
న వ్యవసాయపు బనులన్నియుఁ దనయల్లుళ్ళ కొప్పగించి, తనవార్ధ
క్యమును సుఖముగాఁ గడపుకొననెంచుకొని, తనకొమార్తెల క్షేమ
మాలోచించి, యేదుర్వ్యాపారములకును బోనొల్లని స్వభావముగలిగి
మంచివాఁడగుటచేఁ దనకు దైవమిచ్చిన దానితోఁ దృప్తినొంది, బీద
వాఁడగుటచేఁ దిరిగి వివాహమాడుటఁగూడ మానుకొని, గురువులన్నను
దైవమన్నను మిక్కిలి భక్తిగలిగి యెవ్వరికిని యేవిధమయిన యప
కారమును దాని హానిని గాని యెన్నఁడును, జేసి యెఱుఁగని యీగాపు

వాఁ డెట్టిమనోవ్యాకులతకు నిష్కారణముగాఁ బాలుగావలసివచ్చిన
దోగదా! న్యాయమైన దనవ్యాపారమును దానుజేసికొనుచుఁ, దన స్వ
కాయకష్టమునఁ దానుసంపాదించుకొన్న స్వల్పలాభముతోఁ దృప్తి
నొంది తనయింటఁ దానుసుఖముగాఁ జీవింపకుండఁ ఎన్నిగష్టముల
కుఁ బాలుసేతురో, యను భయముచే నధికారులన్న నతివినయభక్తుల
తో వారికి భృత్యునివలె సంచరించుచుఁ, నాపూరియింట గాపురము చే
యుచున్న యాగాపువాఁడు డిప్యూటీకలెక్టరుగారు చెప్పినారన్న గా
రణమాత్రమున గృహస్థధర్మమునకు మొదలియారుగారిని వారిస్నేహితు
లను తనయింటనుండనిచ్చి, వారినత్యాదరముతో గౌరవించి, వారికిఁ
దన శక్త్యానుసారముగా సహాయము చేసినందుకాతని కెట్టియాపద
యు నపకీర్తియుఁ దటస్థమయ్యెనోగదా! కపటోద్దేశ్యముతో స్వలా
భముకొఱకుగాని పరశ్రేయస్సహనములేక నసహిష్ణుత్వముచేగాని, దు
ర్మార్గులగు నీచులు సన్మార్గానువర్తనులగు సాధుజనుల కెట్టియాప
దలనైనఁ దెచ్చిపెట్టగలరనుట కింతకన్న నేమినిదర్శనముగావలయు
ను! దుర్మార్గులగు ఘాతుకుల వలన నెట్టియాపదలకుఁ బాలగుటఁ
దటస్థమయినను సాధుజనులు దమన్యాయపథము నించుకైనఁ ద్యజింప
కఁ, బాపకార్యములాచరింపకఁ, గాలమునగడపుచుండ దైవమెప్పటికైన
వారిగష్టములను దొలగింపక మానఁడని మనము నిశ్చయముగా నమ్మ
యమాయకస్వభావముగల యాగాపువానియొక్కయు, నేపాపకార్య
మును నెన్నఁడునుఁ జేసియుండని నసహాయులగు నాతని కొమార్తెల
యొక్కయు, నాపదలనెల్ల నివారించి, వారి హృదయములకు శాంతియు,
మనస్సుల కానందమును, నొసగ రక్షకుఁడగు జగదీశ్వరుఁడైన యాభగ
వంతుని మనఃప్రార్థించి, వారి సాధువృత్తియు, ధర్మాచరణత్వమును
వారికమితశ్రేయోలాభము గలుగఁజేయ, హృదయపూర్వకముగా నా
శీర్వదించుటకన్న వారి కెవ్వరీసమయమున నేమి చేయగలరు! రాము

ని నోటిపట్టి మటుండ దుర్మార్గశీలుఁడగు నాకుచ్ఛితవ్యాపారముగల సత్రపువంటబ్రాహ్మణుఁడుచేసిన పాపకార్యమున కాతని నేమనవలయునో చదువరులే గ్రహించుకొనవలయును. దైవ మాగాపువానికి యాతనిగొమాతెఁలకును మనశ్శాంతిని సౌఖ్యమును ననుగ్రహించునుగాక!



# అపూర్వప్రతిభ.



## ఐదవప్రకరణము.

కల్యాణపురమున పిరోక వంటపూటయింట భోజనముచేసి కొంచెము విశ్రమించి సదుపాయమగు నొకబసకొఱకుఁ బ్రయత్నముచేసిరి. ఆసమయమున నాయూర ననేకవివాహములు జరుగుటఁ దటస్థమగుటచే నూరంతయు మంగళవాద్యములతోడను, భోగముమేళములతోడను, గాయకులతోడను, నిండియుండెను. సుప్రసిద్ధులును ధనవంతులును నగు నలుగురు గొప్పగృహస్థుల యిండ్ల వివాహములొక్కసారిగా జరుగుచుండుటచే నానలుగురు గృహస్థుల యిండ్లయెదుటను, వారి వియ్యాలవారు విడిదిదిగిన యిండ్లయెదుటను, నతిమనోహరముగా నలంకరింపఁబడిన గొప్పగొప్ప పందిళ్ళు వేయఁబడి, రాత్రిందివములు నృత్యగీతాదిమంగళధ్వనులతోడను, వారివారి బంధువులతోడను, స్నేహితులతోడను, పురజనులతోడను నతిమనోహరముగా నుండెను. అప్పుడా నలుగురు గృహస్థులును వారివియ్యాలవారును, నొకరికన్న నొకరెక్కువ శోభస్కరముగాను గొప్పగను పెండ్లిచేయవలయుననుగోర్కెతో ధన

ప్రయమున కించుకయిన వెనుదీయక మిక్కిలి యౌదార్యముతోఁ గా ర్యములు చేయుచుండిరి. ప్రసిద్ధములగు భోగముమేళములును, నాయకు లును, విద్వాంసులును, నగు గాయకులును, నప్పుడా పురమునకాహ్వానిం పఁబడిరి. వారి నృత్తగీతములను, వివాహవినోదములను, బాణసంచా లను జూచువేడుకతో నక్కడకు దాపుననున్న గ్రామములనుండి గుం పుగుంపులుగా ననేకులువచ్చిరి. భూరిసంభావనలపేక్షించి బ్రాహ్మ ణులును, భట్టురాజులును వచ్చి వీధులలో మిక్కిలి సందడితో దిరుగు చు పురజనులను యాచించి బీడించుకొని దినుచుండిరి. పురజనులలో రసికాగ్రగణ్యులగు సరసులు వివాహములు జరుగుచున్న గృహముల యందలి సభల నలంకరించుచు, మేళకత్తెల నాదరించుచు, నత్యుత్సా హముతో నుండిరి.

మొదలియారుగారు విశేషప్రయత్నముచేసి శ్రమనొందవలసిన యవసరములేకయే నాయీర నొకవీధిలో నొక శిష్టుగరణముల యిం టిలో బసగుదిర్చికొని యాసాయంత్ర మందుఁబ్రవేశించి తమస్నేహి తులగు శెట్టిగారితోను బిళ్ళగారితోను నాయుఁడుగారితోను సుఖముగా నుండిరి. ఆయింటి యజమానిపేరు గాంతయ్య. ఇతనిని గాంతయ్యపా త్రుఁడనియు, గాంతయ్యపంతులనియు, గాంతయ్యమేష్టరనియుఁ గూడ బిలతురు. కాంతయ్య తండ్రి దొరతనమువారి యుద్యోగము చేసి కొం త ధనమార్జించెనుగాని, యాధనమంతయుఁ గాంతయ్య చిన్నతనము లోనే యాతని తల్లి కర్చుపఱచెను. అప్పటికేఁ గాంతయ్య కాతనితం డ్రి యుద్యోగములో నున్నకాలములో గట్టించిన యా మేడయిల్లును సం వత్సరమునకు రెండువందల రూపాయీలాదాయము వచ్చు నొకభూ మియు మాత్రము మిగిలియుండెను. అతఁడు విద్యాధికుఁడుగాఁడు. త న స్వభాషయగు తెలుగుమాత్రము చక్కఁగ జదువను వ్రాయను నేర్చి కొంచెమింగ్లీషుభాషాపరిచయముగలిగి, యేయుద్యోగము చేయుటకు

ను దగ్గఱనుండుటకై పోవుటచే, నొక చిన్న పాఠశాలను స్థాపించి, యందు బాలురకును, బాలికలకును, మొదటితరగతివఱకుఁ జదువు చెప్పుచు, నందువలనఁ దాను గడించుకొనఁగలిగిన స్వల్పాదాయముతోఁ గాలముగడుపుచుండెను. ఇతనికి దాదాపు నలువదియైదేండ్లు వయసుండును. కొంచెము పొడవుగాఁ గృశించిన శరీరముతోఁ జామనచాయరంగుగలిగి పెద్దమీసములతోను గిరజాలతోను నాపురమున నితఁడు గాపురముచేయుచుండెను. మఱియు నితఁడొక దలపాగను ధరించి తెల్లని పెద్దకోటొకటిఁ దొడగికొని చేతిలోనొక గొడుగుపట్టుకొని తిరుగుచుఁ, బెద్దమనుష్యుల స్నేహము చేయుచు, నాపురవాస్తవ్యులలోఁ దానొక ప్రాముఖ్యునివలె సంచరించుచుఁ, గాలము గడపుచుండెను. ఇతనికేడేండ్లవయసుగల యొక కొమారుఁడును, భార్యయు మాత్రముఁ గలరు. ఇతని భార్యపేరు బాయమ్మ. ఈమె దాదాపు ముప్పదియైదు సంవత్సరముల వయసుగలదియైనను జూచుటకిరువదియైదేండ్ల వయసుగలదిగాఁ గనుపించుచుండును. ఈమె యుజ్జ్వలశరీరచ్ఛాయయు, విశాలమయిన నేత్రములునుఁ గలిగి, యాపురవాస్తవ్యులచే నందకత్తెగాఁ బరిగణింపఁబడుచుండెను. స్వభాషయగు తెనుఁగుభాష నీమె చక్కఁగా నేర్చుకొని కవిత్వముఁగూడ చేయఁగలిగిన విదుషీమణి యని యీమెనందఱుఁ బరిగణించుచుండిరి. ఈమె కొంచెమింగ్లీషుఁగూడ నభ్యసించెను కాని, యాభాషయందీమెకుఁ దనభర్తకంటె నెక్కువ పరిచయము లేదని చెప్పవలయును. తెనుఁగుభాషయందీమె కాంతయ్యపాత్రునికన్న పెక్కురెట్లెక్కువ జ్ఞానము కలదని వాస్తవముగా నొప్పుకొనక తీరదు. ఈమె చక్కగా శ్రావ్యమగు కంఠముతోఁ బాడ నేర్చి కొంచెము ఫిడేలుకూడ వాయింపఁగలదు. ఈమె స్త్రీవిద్యాభిమానియనియు, స్త్రీల స్వాతంత్ర్యమునకుఁ బాటుపడి పనిచేయు నాగరికాగ్రగణ్యయనియు, సంఘసంస్కారప్రియురాలనియుఁ బ్రసిద్ధి కలదు. ప్రతిదినము తనయింటఁ గొం

కలుస్త్రీలను జేర్చి, వారితో ముచ్చటించుచు, నాపురమునకొక సమాజ మేర్పఱచి, యందుపన్యాసములిచ్చుచుఁ, దానురచించిన పాటలు, పద్యములు, ఉపన్యాసములు, మొదలగునవి నచ్చువేయించి చదువరుల కమితాహ్లాదమును గల్పించుచు, స్వదేశస్త్రీలకు మహోపకారమునుఁ జేయుచుండెను. మఱియు నీమె యాపురమునందున్న పెద్దమనుష్యుల భార్యలను నక్కాచెల్లెండ్రను చక్కఁగా నెఱిఁగి వారిస్నేహము సంపాదించెను. తాను మిక్కిలి యందకత్తెననియు, విదుషీరత్నమనియు, శ్రావ్యముగాఁ బాడనేర్చినదాననియుఁ, దెలివికలదాననియు మనోగర్వమీమెకు మిక్కుటముగాఁ గలిగియుండెను. ఈమె కాళ్ళకు జోడుఁ దొడఁగికొని యొకగొడుగు చేతధరించి తన స్నేహితుల యిండ్లకును బోవుచు వచ్చుచు నూరంతయుఁ దిరుగుచుండును. ఈమెస్నేహితులలో నలుగురైదుగురు పురుషులు గూడఁ గలరు. శరీరసౌష్ఠవమును, సౌందర్యమును, యౌవనమును, విద్యాపరిచయమును, మనోబలమును, ధైర్యసాహసములును, కార్యశూరత్వమును, ఇట్టివి దలయఁ గలిగి తనవిరోధులగు పూర్వాచారపరాయణులు దన్నుఁగూర్చి యేమనుకొన్నను నించుకయిన లక్ష్యముచేయక హిందూసుందరులనెల్ల నుద్ధరించి, వారినంధకారబంధురమునుండి తొలఁగించి, వారిని జ్ఞానవంతులనుగాఁ జేయనవతరించిన ధర్మదేవతనను నహంభావముతో మెలఁగుచు, నైహికాముష్మిక సౌఖ్యముల ననుభవించుటకుఁ బురుషులతో సమానమగు హక్కును స్వాతంత్ర్యమును గల స్త్రీల దుస్థితులనెల్లఁ బోగొట్టవలయునని కంకణము కట్టుకొని పరోపకార దీక్షాపరతంత్రురాలయి యుండెను. సంఘసంస్కారులకీమె ముఖ్యాధారమనియు, నూతగఱ్ఱయనియుఁ, జెప్పుటకెంతమాత్రము సందియము లేదు. మనదేశమున జరుగు మహాసభలనెల్ల నీమె యలంకరించుచు, నాయాసభలయందు జరుగు విషయములన్నియుఁ దనకుఁ దెలియకపోయినను దెలిసినదానివలె నటించుచుఁ,

బశ్చిమఖండవాస్తవ్యులగు స్త్రీలకన్నఁ దానెక్కువ నాగరికవైభవము తోఁ దులదూగుచున్నట్లానందించుచుండును. ఈమెభర్తయగు గాంత య్యాపాత్రునికన్న నీమెయెక్కువవిద్య నేర్చినదని మనమొప్పుకొన క తీరదు. కాంతయ్యాయందీమె కెట్టిగౌరవమున్నను నాతని నెట్టి గౌరవముతోఁ దనయింట నాదరించి గౌరవించుచున్నను యితరుల తో మాత్రమాతఁడు విద్యాధికుఁడుగాడనియు, ధనమార్జింపఁగల ప్ర యోజకత్వములేనివాఁడనియు, వగచుచుఁ జెప్పుకొనుచు నమాయికస్వ భావముగలవాఁగుటఁ బట్టి తన సత్కార్యాచరణకడ్డము గల్గింపకఁ దనదారిని దాను బోవుచుండుటచేఁ దానదృష్టవంతురాలనే యనియు, నాతఁడెట్టివాఁడైనను భర్తయను గౌరవము దాను జూపకతప్పదని యుఁ, జెప్పుచుండును. కాని తనవంటి యందకత్తెయగు విదుషీరత్న మునకాతఁడు భర్తయగుటకీమె కంతరంగమున విచారమును, సిగ్గు ను, నభిమానమును, లేకపోలేదు. భర్తకుఁ దగినభార్యయు భార్యకుఁ దగినభర్తయు సమకూరుట స్త్రీపురుషుల పూర్వపుణ్యముకాని వేఱొ కటికాదుగదా! అందులో మనదేశమున స్త్రీపురుషులొండొరులనుదాము స్వయముగా నెన్నుకొని ప్రేమించి తమ యిష్టానుసారముగా వివాహముచేసికొనఁ గలుగుటకు మనదేశాచారములును, నతిబాల్యవి వాహములును, బొత్తుగా నవకాశము గలుగఁజేయకపోవుటఁ బట్టియుఁ, దల్లిదండ్రులు దమ గొమాతెకాలను దమ యిష్టమువచ్చినట్లు దమకుఁ దోచినవారికి గట్టిపెట్టుటచేతను, మనదేశమున భార్యాభర్తలొండొ రుల యందన్యోన్య ప్రేమానురాగములతో నుండఁగలుగుటఁ దటస్థ ము గాకున్నదని బాయమ్మ చక్కఁగా గ్రహించెను. కాఁబట్టి బాయ మ్మగారు సంఘదురాచారములెల్ల రూపుమాపుట సంఘాభివృద్ధికత్యా వశ్యకమని దృఢముగా నమ్మి సంఘసంస్కారశూరులగు పురుషుల తోఁ గలసి దాను పట్టుదలతోఁ బనిచేయుచుండెను. పరోపకారదీక్షా

పరతంత్రులును సంఘసంస్కారశూరులును నగు బుధవరత్నము లుపన్యాసపీఠములనుండి యుపన్యాసము లొనర్చియు, వాగ్దానములు చేయించుకొనియు, ఖరారునామాలు వ్రాయించుకొని సంతకములు చేయించుకొనియు, ననేకవిధములుగా ననేకోపాయములచే సంఘాభివృద్ధి కత్యావశ్యకమగు గార్యములను జేయుచుండ హిందూసుందరులకీ విషయములనుగూర్చి యుపన్యాసములిచ్చి బోధించి చెప్పఁగలుగు విదుషీమణులుగూడ నున్నగాని దేశోపకారసాధనముగాదని బాయమ్మ నిశ్చయించుకొని యెవ్వరేమి తన్నన్నను, దన సత్ప్రయత్నముల కెవ్వరెట్టి యాటంకములు గల్పించుచున్నను, నిరుత్సాహురాలు గాకయుండెను. తానురచించిన పద్యములను, పాటలను, సమాజములయందుఁ దానిచ్చిన యుపన్యాసములను, దెలుగువార్తాపత్రికలయందు బ్రకటించుచు, నావార్తాపత్రికలను దనస్నేహితులయొద్ద జదివి వారిశ్లాఘనల నందుచు, గ్రంథరచనాపేక్షతోఁ గొన్నిగ్రంథములను ముద్రింపించి ప్రకటించుచు, నుదయమున లేచినదాదిగా నత్యుత్సాహముతో మిక్కిలి శ్రద్ధగాఁ బాటుపడుచుండెను. ఇట్లీమె చేయుచున్న సత్ప్రయత్నములయందెల్లఁ గొందఱు పరోపకారపారీణులగు పురుషశిఖామణులు గూడ నీమెకమితోత్సాహమును సహాయమునుగూడఁ జేయుచు నామెరచించినట్లు ప్రచురించినవాటిలో గొన్నిటిని దామే వ్రాసి రహస్యముగా నామెకిచ్చు నంతరంగస్నేహితులు గూడ నీమెకు గొందఱుగలరు. వారు బాయమ్మయందత్యంతప్రేమగలిగి యామెను శ్లాఘించుచు, నామెను దరుచుగాఁ గలసికొని మాటలాడుచుఁ, దమయిండ్లకుఁ దీసికొనిపోయి యాదరించుచు, నామెకు ముఖ్యమగు నాప్తులైయుండిరి. బాయమ్మ ప్రతిదినమును దనస్నేహితుల యిండ్లకుఁబోయి తన యిష్టము వచ్చినట్లు పురమంతయు యథేచ్ఛముగాఁ దిరుగుచుఁ, దనస్నేహితులతోఁ గలసి నాటకములు పాటకచేరీలు మొదలగు

వినోదముల నెల్లఁ జూడ నేగుచు, నాగరికాగ్రగణ్యురాలై సంచరించుచుండుటఁ గాంచి కొందఱామెను గూర్చి యనేకములుగా నపవాదలను గల్పించిరి. కాని యామె వానినించుకయును బాటింపకయెనవిరోధులకు సిగ్గువచ్చునట్లు మఱింతపట్టుదలతో విచ్చలవిడిగాఁ బ్రవర్తించుచుండెను. ఇట్లీమె పూర్వాచారములను దిరస్కరించుచు, నెవ్వరేమనుకొన్నను లక్ష్యముచేయక, మిక్కిలి ధైర్యసాహసములతోఁ దనబుద్ధికి దోఁచినట్లును, దనయంతరాత్మ దనకుఁ బ్రబోధించినట్లును, విచ్చలవిడిగాఁ బ్రవర్తించుచుండఁగలుగుట కామె భర్తయగు కాంతయ్య మిక్కిలి మంచిస్వభావముగలిగి తనకనువర్తియై సంచరించుచుండుట ముఖ్యకారణమని చెప్పవలసియున్నది. కాంతయ్యపాత్రుని సత్స్వభావమును, నమాయకత్వమును, సహిష్ణుత్వమును, సౌగ్ర్యము, సమయోచితజ్ఞానమును, సందర్భానుకూలవర్తనమును, నభిమానశూన్యతయు, క్షమయు, నెంతెంతని శ్లాఘింపవలవి కాదుగదా! ఇట్టిసద్గుణసంపత్తిగల కాంతయ్యవంటి భర్త యీమెకు లభ్యముగుటవలననే కదా యీమె యీవిధముగ నిరాటంకముగ యథేచ్ఛముగఁ బ్రవర్తింపఁగలిగి పరోపకారమొనరించుచుఁ బనిచేయఁగలుగుచుండుటకుఁ గారణమైనది! కాంతయ్య విద్యాధికుడు కాకపోయినను, విశేషానుభవము లేనివాఁడయినను, సుచితజ్ఞుఁడని యాతని నెఱిఁగినవారందఱు నొప్పుకొనకతీరదు. తన భార్య యేమి చేసినను, నేమన్నను, నెప్పుడెక్కడికిఁబోయి యెప్పుడింటికి వచ్చినను, నేమేమి పనిచేసినను, నించుకయును నెదురాడక తాను భర్తననియు, దనభార్య తనయాజ్ఞకు లోఁబడియుండవలెననియు నించుకైన నహంభావమును గలిగియుండక తనపని తాను చేసికొనుచుఁ దనదారికిఁ దాఁబోవుచు నాపట్టణమునందుఁ దన్నెవరేమన్నను, దన్నుగురించి యేమేమిపరిహాసాస్పదముగ మాటలాడుకొన్నను, మర్మచ్ఛేదమగునట్లు తనగౌరవమునకు హానికరముగ నేమేమి యుప

వాదులాడినను, తలవంచుకొని మిక్కిలి సహనవృత్తితో సతీశాంతుఁడై కాలము గడుపుచుండెను. కొందఱు కాంతయ్య భార్య యాతఁడు చెప్పినట్లు వినక నిర్లక్ష్యభావముతో నాతనిఁ బరిగణించుచుండుటచేఁ బ్రాణము విసివి యామెతోఁ గలహమాడ నలుగురిలోఁ బరిహాసాస్పదుఁడగుటకన్న నూరకుండుట యుచితమని యట్లు ప్రవర్తించుచున్నాఁడనియు, మఱికొందఱు నాతఁడు స్వభావముచే బిరికితనమును, మాటకైదారాడజాలని మొగమోటమును గలవాఁడగుటచే భార్యాజితుఁడయ్యెననియు, మఱికొందఱితఁడు తనయసమర్థతను దక్కఁగా నెఱిఁగి యేమిసేయుటకును దోఁచక "నా పూర్వజన్మకర్మపరిపాకమిట్టిదియే" యని యెంచి, తనస్థితియంతయుఁ దలఁచుకొని యూరకుండెననియు, నింకఁ గొందఱు బాయమ్మ మొగము చూచినతోడనె మిక్కిలి భయముతో నేమి చేయుటకును దోఁచక సమ్మోహనవిద్యచేఁ గట్టబడినవాఁడగువానివలెఁ దనచిత్తమును తానే మఱచిపోయి సంపూర్ణముగ నామె యాజ్ఞకు లోబడియుండుననియు, మఱికొందఱితని వివిధోపాయములచేఁ దనవిద్యయు నేర్పును బ్రయోజకత్వమును వినియోగపఱచి స్వాధీనము చేసికొని బాయమ్మ యాతని సంరక్షించుచున్నదనియు నిట్లు పౌరులు పలువిధములుగఁ గారణములను గల్పించి కాంతయ్య చేతగానితనమును గుఱించి చిత్రచిత్రకథలుగా నాపురమున స్త్రీపురుషులు చెప్పుకొనుచుందురు కాని, బాయమ్మ [illegible]విదుషీమణి పరోపకారదీక్షాపరతంత్రతతో సంఘాభివృద్ధికిఁ బాటుపడి [illegible]ని చేయుచున్న విషయమును గ్రహించి యామె సదాచరణమునకుఁ దోడై తనశక్తికొలఁది నామెకు సహాయము చేయుచున్న యాతని సదుద్దేశమును గ్రహింపఁగల యుచితజ్ఞులగు సత్పురుషులా పురమున సంఘసంస్కర్తలలోను బాయమ్మగారి స్నేహితులలోను దక్క నితరులలో లేరని చెప్పుటకు విచారకరముగా నున్నది. అహా! గుణములన్నిదోషములుగను దోషములను గుణములుగను బరిగణించు

చుఁడు జనుల మూర్ఖత్వమును నవివేకమును నేమని చెప్పవలయును! కాంతయ్య సుగుణములన్నియు దుర్గుణములుగా నెంచి నిందాస్పదముగాఁ జేయుటకు జనుల దుస్స్వభావమొక్కటియే కారణమని చెప్పుటకేమిసందియమున్నది? బాయమ్మచేయు కార్యములత్యుత్కృష్టములనియుఁ, బరోపకారకారణములనియుఁ, జెప్పకతప్పదుకదా! అట్టిసత్కార్యాచరణమునకుఁ గాంతయ్య తోడుపడుచు దేశాభివృద్ధికలుగఁ జేయుచున్న యంశమాలోచించి యాతని జనులందరు మిక్కిలి గౌరవించి సంఘసంస్కారులలో నగ్రగణ్యునిగాఁ బరిగణించి పూజించుట-మనదేశమందలి జనులందఱకుఁ గర్తవ్యమని చెప్పకతప్పదు. తాను స్వయముగా సత్కార్యమును చేయనేరకపోయినను సత్కార్యములు చేయువారికిఁ దోడ్పడి తనశక్తికొలఁది పనిచేయఁగలుగుట సత్పురుషుల లక్షణమని చెప్పుటకేమిసందియమున్నది! విద్యయందును, దెలివియందును, బ్రయోజకత్వమునందును, గార్యాచరణనైపుణ్యమునందును, జనాకర్షణకు తగినసాధనసంపత్తియందును, వాక్చాతుర్యమునందును, ధైర్యసాహసములందును, దనకంటె సహస్రాంశములత్యధికురాలగు తనభార్యయగు బాయమ్మవంటి చక్కఁగాఁ బాడనేర్చిన యౌవనమధ్యస్థయగు పరోపకారదీక్షాపరతంత్రురాలికిఁ దనశక్తికొలఁది సహాయముచేయుటకన్న కాంతయ్య చేయఁగల దేశోపకారమేమున్నది! (1) ఆమెను వివాహమాడినతరువాత కొంతకాలమువఱకు నామెవంటి సౌందర్యవతియు, విదుషీమణియు నగు స్త్రీరత్నమునకు దాను భర్తయగునట్టి యత్యంతానందకరమగు మహావైభవము తనకుఁ జేకూరి తనజన్మపావనమయ్యెనని మహానందాబ్ధిని నోలలాడుచుఁ బ్రపంచజ్ఞానసూన్యుఁడై ప్రమత్తుడైయుండుట. (2) తరువాత తనభార్యవిదుషీమణియనియుఁ,గవియనియుఁ,సంఘసంస్కరనిర్వాహకయనియు,నజ్ఞానాంధకారమునుండితప్పించుకొనఁగలిగియావలఁబడిజ్ఞానజ్యోతిప్రకాశమునఁ

గన్నులు తెఱచి సంచరింపఁగల వివేకముగల నవనాగరికాగ్రగణ్యయనియు, దేశమునఁగలుగుసభలకన్నిటికినిఁబోయి యుపన్యాసములిచ్చి కీర్తిగాంచిన గుణవంతురాలనియుఁ, బ్రసిద్ధిగాంచినబాయమ్మకుఁ దానుమగఁడగుటవలన నప్రయత్నముగాఁ దనకులభించిన కీర్తిప్రతిష్ఠలకు సంతోషించుచు నట్టియలభ్యయోగమగు భాగ్యమును బోగొట్టుకొనకుండ గాపాడుకొనగలుగునటుల జాగరూకతతో సందర్భమెఱిఁగి ప్రవర్తించుచుండుట. (3) తరుచుగ దనయింటికి వచ్చుచుండునట్టియుఁ దాను బోవుచుండునట్టియు తనభార్య దనస్నేహితులయిండ్లకుఁబంపు వర్తమానములను జాబులను జాగరూకతతో నందిచ్చు సందర్భమున నట్టి స్నేహితులలో స్త్రీలను తాను స్వయముగాఁజూచి మాటలాడుటకుఁ దన కవకాశము లేకపోవుటఁబట్టి నామాటలును జాబులును నందిచ్చుటకు వారిభర్తలయొద్దకును, నట్లుగాక బురుషులైనచో వారియొద్దకును తాను స్వయముగాఁ బోగలుగుట కవకాశము గలుగఁజేసి, నెలకుఁ బదేనురూపాయీలు జీతము తెచ్చికొనుచున్న యొక చిన్నయుపాధ్యాయుఁడగు తనవంటి సామాన్యునకు నాపట్టణమందలి గొప్పవారితోఁ దఱచుగ మాటలాడునట్టి యదృష్టమునకుఁ గారణభూతమై తానట్టివారిచే నాప్తబంధువునిగఁ బరిగణింపఁబడుచున్న మహాభాగ్యమును కాపాడుకొనగలుగుటకుఁ దనశక్తివంచనలేకుండ తానుకూడ పనిచేయుట. (4) తనభార్యవిదుషీమణియనియు, వ్యాకరణవేత్త్రియనియు, సంస్కృతజ్ఞానముకూడకలపండితయనియు, నాశుకవియనియు, నుపన్యాసవేత్త్రియనియు, నెన్నియోగ్రంథములనురచించినబహుగ్రంథకర్త్రియనియుఁ, జక్కఁగాఁ బాడనేర్చిన గాయనీమణియనియు, ఫిడేలుగూడ వాయించగల సంగీతసరస్వతియనియు, మంచినేర్పరియనియు, రసికురాలనియుఁ, గార్యదీక్షాపరతంత్రురాలనియు, నెవరేమనిన నించుకయుఁ జంకక పనిచేయునట్టిధీరయనియు సంఘాభివృద్ధికొఱకు నెడతెగక పనిచే

యుదమంతయు దేశోపకారియనియు ననేకవిషయముల నెన్నెన్నియో వర్ణించి చెప్పుడు సందకర్త్రియనియు సుకుమారియనియు దానికిఁ దగిన ప్రోత్సాహమును, సదినంఘాభివృద్ధికిఁ దలపెట్టిన యామహాప్రయత్నమునకుఁదగిన సహాయమును, దానికిలభింపకుండుటకు విచారించుచు నూరంతటను ప్రచురించి కాంతయ్య స్వయముగాఁ జెప్పుకొనుచుండఁ గలుగునదృష్టముఁ గలిగియుండుట. (5) తనప్రేషితలోఁ బిలిచినవారిలో ననేకులచే బాయమ్మ మొగుడని పిలువఁబడుచుండుట. (6) తనభార్యనుగూర్చి వ్రాయఁబడిన సందర్భమునఁ దనపేరుఁగూడ వార్తాపత్రికలలో నచ్చుపడుచుండుట ; (7) తన యింటికనేకులు తన భార్యకొఱకు సర్వదా వచ్చుచుండుట ; (8) ఏదేశాభిమానమానసనీయుని సహాయప్రేరణముచేతనో మన దేశమునందలి గొప్పపట్టణములందు జరుగు మహాసభలకుఁ బోగలిగిన తనభార్యతోఁ దానును బోయి తనజన్మమునకును దనస్థితికిని దుర్లభమగువాటినెల్ల చూచి యానందింపఁగలుగు భాగ్యమునకుఁ గారణభూతముగు దానికిఁ దాను భర్తయగుట, ననునీయైశ్వర్యములకుఁ దనజన్మసాఫల్యమగునటుల తనయింటిచేతిలో నుండఁగలుగునట్లు ప్రసాదించిన యాబాయమ్మను కాంతయ్య దనభాగ్యలక్ష్మిగను నదృష్టలక్ష్మిగను, గృహదేవతగను, గౌరవించి భక్తివిశ్వాసములతోఁ బూజించి యారాధించుటకన్న పత్నీవ్రతదీక్షయుండితఁడు చేయవలసిన కార్యమేమున్నది! మఱియుఁ దనభార్యను సంతోషపెట్టుటకును నామెయభీప్సితములను దీర్చుటకును జేయవలసిన కార్యములన్నిటినిఁ గాంతయ్య యెంతటికష్టములకైననోర్చియుంచుకైన వెనుదీయకఁ దక్షణమే చేయుచు దేశోపకారమునకు సహాయము చేయుచుండెను.

కాంతయ్య యుదయము పదిగంటలకుఁ బాఠశాలకుఁ బోవలసినవాఁడగుటచే దానావేళకుఁ బాఠశాలకుఁ బోయి తనయుద్యోగము గాపాడుకొనగలుగుటకుఁ దనభార్య యింటికివచ్చి తనకు వంట

చేసి తనకన్నము పెట్టువఱకుఁ గని పెట్టుకొనియుండుట కవకాశములేద
ని గ్రహించి యామె చేయు సత్కార్యముల కాటంకము గలిగించిన
ఘోరపాతకమును మెడకట్టుకొన నిష్టములేనివాఁడగుటచే నామెకిం
చుకయినఁ నాటంకము గలిగింపకుండుట కెంచి తానే స్వయముగా
వంటచేసికొని తాను తిని యామెకన్నము సిద్ధపఱచి తనదారినిఁ బో
యి తనభార్య యింటికివచ్చినతరువాత వంటచేసికొనుటవలన నించు
కయినఁ గాలహరణము గాకుండ పరోపకారమును చేయుచుండునట్లా
మెకు సహాయపడుచుండును. ఒకొకప్పుడు తనభార్య రాత్రి ప్రొద్దుపో
వువఱకింటికిఁ దిరిగిరాకపోవుటచేఁ జీకటిలో నొంటరిగాఁ దనయింట
వాకిలిలోఁ గూర్చుండి యామెకొఱకు నిరీక్షించుచు నిద్రమేలుకొని వేఁ
చియుండి యామె సత్కార్యాచరణదీక్షకు విఘ్నము గలుగకుండఁ జే
యుచుండును. తాను గడించితెచ్చిన జీతమంతయుఁ దనభార్యకిచ్చి
యామె కొనిపెట్టిన బట్టలతోను నామె తనకప్పుడప్పుడు బలవంతము
మీఁద నిచ్చుచుండు స్వల్పపుమొత్తములతోను సంతృప్తినొంది సుఖిం
చుచుండును. బాయమ్మ చీరెలను రైకలను దుస్తులను నుతుకు చాకలి
వానికిని పనికత్తెకును గలిపి నెలకైదురూపాయీలు జీతమియ్యవలసిన
యవసరముండుటచేఁ గాంతయ్యభార్యకుఁ దాను స్వయముగాఁ గడించి
తెచ్చుకొనినద్రవ్యమంతయు నామె నగలక్రిందను బట్టలక్రిందను తప్ప
సంసారముకొఱకొకగవ్వయైనఁ గర్చుపెట్టుటకవకాశముకలుగకుండుట
చేఁ సంసారమంతయుఁ బదిరూపాయీలతోఁ గడుపుకొనవలసి
వచ్చినదయ్యెను. బాయమ్మ యప్పుడప్పుడు సొమ్ముకై తన్నుఁ బీ
డించుచుండుటచే నామె యభీప్సితము తీర్చుటకంటెఁ దాను చేయఁదగి
న కార్యములేదని యెంచి చేబదులుమూలముగను ప్రామిసరీనోట్లు
వ్రాసియుఁ దనఖాపత్రములు వ్రాసియుఁ గాంతయ్య గొంతబుణము కూ
డ చేయవలసివచ్చెను. దన స్నేహితులయిండ్లకుఁ బోవుటకుదూరమున

డువవలసినయవసరము లేకుండ నొకబండిని సంపాదించవలయునని బాయమ్మ చెప్పుచుండెనుగాని కాంతయ్య దనస్థితినిబట్టి ఋణముచేసి యైన నొకరెద్దుబండిని గొనఁగల సమర్థతగల వాఁడయ్యును నేకారణము చేతనో బండిని మాత్రము కొనలేదు. కాని యీమె దూరము పోవలసివచ్చినప్పుడెల్ల నొక బండిమీఁదనే పోవుచు దగ్గర యిండ్లకు మాత్రము గొడుగువేసికొని నడిచి పోవుచుఁ దాను చేయని శ్చయించుకొనిన కార్యములనెల్లఁ జేయుచుండెను. వీరికుమారుఁ డైన మిది సంవత్సరముల వయసున్నను నాతని విద్యాబుద్ధులను గురించి బాయమ్మగాని కాంతయ్యగాని యెంతమాత్రము శ్రద్ధవహించిరని చె ప్పవలనుపడదు. ఆపిల్లవానిని బడిలోవేసిరిగాని యతఁడెన్నఁడును బ డికిఁ బోయి విద్యనేర్చుకొనక విచ్చలవిడిగా నూరంతయుఁ దిరుగుచు నాటపాటలలోఁ గాలము వృథపుచ్చుచు నల్లరిపనులు చేయుచు స్వల్ప వస్తువులను దన హస్తలాఘవనైపుణ్యమున గనుపడకుండఁ జేయుచు నెకరుఁడఁజూచినను దానయ్యె యాతఁడాయివలె దిరుగుచుండెను. తమ కొమారుని విషయమై తల్లియగు బాయమ్మగాని తండ్రియగు కాంత య్యగాని తగిన జాగ్రతపుచ్చుకొని యాతనికి విద్యాబుద్ధులు నే ర్పలేదు.

సంఘసంస్కారవిషయములన్నిటియందు నీబాయమ్మ సంస్కార కారుల యభిప్రాయములతో నేకీభవించి వారియుద్దేశములనెల్ల నా మోదించి శక్తివంచనలేకుండఁ బనిచేయుచు సంసారుల యిండ్ల జరు గు వివాహాదిశుభకార్యములయం దాటపాటలకు వేశ్యలను రప్పించి వారి నాదరించుటకన్న వేశ్యలవలనఁ గలుగఁజేసికొనఁ గలిగిన నృ త్యగీతాది వినోదములనెల్లఁ గులాంగనలవలననే జరుపుకొనఁగలుగుట కు వారికి గాంధర్వవిద్యగూడ నేర్పింపవలయునను యుద్దేశము గలిగి యుండెను. పరోపకారదీక్షాపరతంత్రురాలును దేశాభిమానమానమా

ననీయయు నగు బాయమ్మవంటి విదుషీమణికి భర్తగానుండుటవలనఁ దనకు లభించిన గౌరవముచేతను ప్రఖ్యాతిచేతను గొప్పవారి స్నేహలాభప్రాప్తిచేతనుఁ గాంతయ్య యైహికసుఖలాభముల నెల్ల జూరగొన్నవానివలె మిక్కిలి యానందించుచు సౌఖ్యమునఁ గాలము గడపుచున్నను నాముష్మిక సౌఖ్యమునుగూర్చి మఱచిపోకఁ దాను వైష్ణవమతస్థుఁడగుటచే నాపురముననున్న యాదికేశవస్వామియం దతిభక్తి గలిగి ప్రతిదినము నాదేవుని యాలయమునకుఁ బోయి స్వామిదర్శనము చేయుచుండెను. బాయమ్మ విగ్రహారాధనము మహాధజనాదరణీయమని జక్కఁగాఁ దెలసికొన్న బ్రహ్మజ్ఞానిని యగుటచే నేకేశ్వరోపాసనమునే జేయుచుఁ బ్రార్థనాసమాజములకుఁ బోయి యచట ఫిడేలు వాయించి పాడుచు భక్తులను రంజింపఁజేయుచుండెను. కాని యామె నోములు వ్రతములు మాత్రము మానక నట్లతద్ది యుండ్రాళ్ళతద్ది మొదలుగాగల యన్నిపండుగలయందును నోములను వ్రతములను జేయుచుఁ దనభర్తచే ఋణముచేయించి క్రొత్తచీరెలను గాసులను కొని ధరించుచు హిందూమతసంబంధమగు పండుగులనెల్ల మహావైభవములో నత్యుత్సాహముగాఁ గడపుచుండఁ గాంతయ్య నృసింహజయంతి, కృష్ణాష్టమి, వైష్ణవైకాదశి మొదలుగాగల వానియందెల్ల నుపవాసవ్రతములాచరించి తన దైవభక్తినిఁ బ్రకటించుకొనుచుండెను. ఇట్లు కాంతయ్య దనగార్హస్థ్యసౌఖ్యమును మహానందముతో ననుభవించుచుఁ గల్యాణపురవాస్తవ్యులగు ప్రముఖులలో తన్నొకనిఁగా భావించుకొని కాలము గడపుచుఁ దనకేండ్లుగడచి శరీరబలము క్షీణించి నకొలది వార్ధక్యధర్మమును బట్టియో, తన భార్య యభీప్సితములను దీర్చగలుగుటకుఁ దానుజేసిన ఋణముల వలనఁ దటస్థమైన బాధలను బట్టియో, గృహకృత్యములను జేసికొనుట కోపిక లేకపోవుటచేతనో, మరి యేకారణముచేతనో, మనము స్పష్టముగాఁ జెప్పలేముగాని యితని

కాముష్మిక సౌఖ్యమును సంపాదించుకొనఁగలుగు సాధనములను సమకూర్చుకొనవలయుననుకోర్కెగలిగియుంట జేయుగృత్యముల నీశ్వర సన్నిధానమున నాయాదికేశవస్వామి యాలయములోనే జేయుచు నాదివ్యస్థలమునఁ దనకులభించు ప్రసాదముతోఁ దృప్తినొంది యచ్చటనే దినములు గడపవలయునను నుద్దేశమీతని కప్పుడప్పుడు గలుగుచుండెను గాని యిరుగుపొరుగువారును దన భార్యయు నామె స్నేహితులును నాతనియుద్దేశమును బరిశీలించి "నీవింకను నీభార్యచేయుచున్న కార్యాచరణమునకుఁ దోడై కీర్తిప్రతిష్ఠలను గాంచవలసియున్న" దని యాతనికెన్నెన్నోవిధముల బోధించి యైహికసుఖాభిలాషిగాఁ జేయుచుండిరి.

కాంతయ్యయు నాతని భార్యయు గాపురమున్న యిల్లాతని దండ్రి యుద్యోగము చేయుచున్న కాలమున గట్టించిన యొక విశాలభవనమని యిదివఱకే జెప్పఁబడినది. లోకనాథమొదలియారుగారును వారిస్నేహితులును నాయింటనే బసచేసిరనిగూడ నిదివఱకే చెప్పబడెను. ఆయింటఁ గాంతయ్యయు నాతనిభార్యయు గొమారుఁడును దక్క నింకెవ్వరును లేకపోవుటచే మొదలియారుగారికిని వారి స్నేహితులకును విశాలమగు నొకభాగమంతయుఁ బ్రత్యేకముగా లభించినను వారాయింటఁ బ్రవేశించిన యొకటిరెండు దినములలోపుననే నాదంపతులచే నాప్తులుగా గణింపఁబడి యిల్లంతయు యథేచ్ఛముగా నువయోగపఱచుకొనఁ గలుగుచుండిరి. బాయమ్మ విద్యాధిక్యమును, గానమును దేశోపకారబుద్ధియు, సంఘసంస్కారప్రియత్వమునుఁ, గార్యశూరత్వమును, నాగరికతయు, బుద్ధికౌశల్యమును, స్నేహాభిలాషకతయు వీరు గ్రహించి యామెయందు మిక్కిలి గౌరవమును సదభిప్రాయమును గలిగి యామెను శ్లాఘించుచు నట్టి విదుషీమణి భార్యగాలభించిన కారణమువలనఁ గాంతయ్య పాత్రునకు గలిగిన యదృష్టమునకాతని భాగ్యవైభవ మింతింతని చెప్పనలవికాదని యాతని స్తోత్ర

ము చేయుచుఁ దమవలెనే దేశక్షేమమునకుఁ బాటుపడి పనిచేయుచున్న యీమెవలనఁ దెలిసికొని గ్రహించుకొనవలసిన విషయములనేకములుండుననని నమ్మి వారాపట్టణమునఁ గొన్నిదినము లుండనిశ్చయించుకొనిరి. మొదలియారుగారీమె యపరసరస్వతియనియు నాధునికలీలావతియనియు హిందూస్త్రీల నజ్ఞానాంధకారమునుండి తొలగింప నవతరించిన స్త్రీలపాలిటి ధర్మదేవతయనియు నమ్మి యీమెను శ్లాఘించుచు గౌరవించుచుండిరి. సంగీతసాహిత్యములయందును గవిత్వమందును గృహిణీత్వధర్మవర్తనమందును నద్వితీయయని శెట్టిగారును, గానవిద్యాకౌశల్యమునందును, సౌందర్యవైభవమందును, సుచిత్రప్రవర్తనమందును, రసికత్వమందును, జాణయని నాయుఁడుగారును బిళ్ళయు నీమెను శ్లాఘించుచు హిందూసుందరులకు శిరోభూషణమని నిశ్చయించిరి. ఇట్లీనలుగురు నామె గార్యశూరత్వమును గూర్చియుఁ, బరోపకారదీక్షాపరతంత్రతను గూర్చియు, సంస్కారప్రియత్వమును గూర్చియు, మాటలాడుకొనుచుఁ గ్రమక్రమముగా బాయమ్మగారి స్నేహకోటిలోఁనివారుగాఁ బరిగణింపఁబడుచు నాలుగైదుదినములలో నామె ముఖ్యస్నేహితులైరి. కాంతయ్య మొదలియారుగారియందును, వారి స్నేహితులయెడలను మిక్కిలి వినయభయభక్తులుగలిగి సగౌరవముగాఁ బ్రవర్తించుచు నాపురమునగల విశేషములనెల్లఁ జెప్పుచుండెను. మొదలియారుగారికి బాయమ్మయెడల గౌరవమభివృద్ధియై యీమెవంటి స్త్రీరత్నముతో స్నేహలాభము దొరకినందులకుఁ దనయదృష్టమునకు మిక్కిలి సంతోషించుచుండెను. శెట్టిగారామె గుణసంపత్తిని గూర్చి కొనియాడుచు నామెరచించిన పద్యములను గ్రంథములను వార్తాపత్రికలయందామె ప్రకటించిన వ్యాసములను మిక్కిలి శ్రద్ధతో జదువుచు నామె పాటను వినుచు "తనపాండిమము నవ్వులనెయుంచి గాంధర్వము వనికిఁ దెచ్చిన హంసయాన" యని యీమెను శ్లాఘించుటయేగాక

నామెపైఁ గొన్ని పద్యములుగూడ నల్లి చదువసాగెను. నాయుఁడుగారి కినిఁ బిళ్ళగారికి నీమె "యతనుసమ్మోహవిద్య" గా బరిణమించుట చే వారామెను జూచిన దాది యామె సౌందర్యగుణాతిశయముల క త్యాశ్చర్యము నొందుచు నట్టిస్త్రీరత్నమును భార్యగాఁజేసికొనఁగలిగిన కాంతయ్య భాగ్యమున కత్యాశ్చర్యమునొందుచుఁ దమకట్టి యదృష్ట ము గలిగినయెడల దమజన్మలు పావనములగునని యంతరంగమునఁ ద లచుకొనుచుఁ దమ ధనమును గౌరవమునుగూడ నామె పాదములకు ధారవోసి యామె స్నేహలాభమును బొంది యామెను గన్నులారఁ జూచుచుండగలిగిన యదృష్టమైన లభించినఁ జాలునని యెంచుకొను చుండిరి. బాయమ్మ వీరిని దన ముఖ్యస్నేహితులనుగా నెంచి వారిని గౌరవించుచుఁ దనవిద్యానైపుణ్యముచేతను, గవిత్వప్రౌఢిమచేతను, రసజ్ఞతచేతను, వాగ్నైపుణత్వముచేతను, సరససంభాషణాచతురత్వ ముచేతను, గాంధర్వవిద్యాకౌశలముచేతను, రసికత్వవైభవముచేతను, కార్యదీక్షాపరతంత్రతచేతను, ధైర్యసాహసాదిగుణసంపత్తిచేతను, మ హానందవార్ధిలో ముంచివేసెను.

కాంతయ్య దనభార్య యోగ్యత వీరిలోఁజెప్పి యామెను శ్లా ఘించుచు, మాటలాడుచుఁ, దనభార్య నాపట్టణమునందేగాక దేశ మందంతనుఁ గల గొప్పవారందఱు జక్కగా నెఱుగుదురనియు, మహా నీయులందఱితో నామెకుఁ గార్యసంబంధముగలదనియుఁ దరుచుగా నాపురమందలి గొప్పవారినందఱఁ గలసికొనుచుండుననియు నామె సంగతంతయు వార్తాపత్రికలమూలమున జగద్విదితమేయనియుఁ జెప్పి యానందించుచు వీరికానందము గలిగించుచుండెను.

ఇట్లు వీరు నలుగురు గల్యాణపురము బ్రవేశించినతరువాత రెం డుమూడుదినములలోఁ గాంతయ్యమూలముననుం, బాయమ్మమూలమున ను, నాపట్టణమందలి గొప్పవారినెల్లఁ జూచి వారిలోఁ గొందఱి స్నే

హాలాభమును గూడఁ బొందగలిగిరి. కొందఱు మాత్రము వీరు గాంతయ్యయింట బసచేసినందుకు వీరిని నర్మగర్భమైన మాటలతో నాక్షేపించుచుఁ గాంతయ్యవంటి స్నేహితుఁడు లభించినతరువాత నాతనివిడచి వీరచ్చటనుండి బోవుట కిష్టములేకఁ గొన్నిమాసములైన నచ్చటనే యుండకమానరనియు బాయమ్మ పరోపకారకార్య నిర్వాహకత్వమునకు దోడైపనిచేయఁగల దేశాభిమానమానసియని యిప్పటికిఁ దటస్థమైరనియుఁ జెప్పుకొనుచుండిరి. మొదలియారుగారిని, శెట్టిగారిని, నాయుఁడుగారిని, బిళ్ళగారిని జూచుటకై పురవాస్తవ్యులలో గొప్పవారందఱు నను దినము నచ్చటికి వచ్చుచుండిరి. ఈనలుగురు నాపట్టణమున నున్నదినములలో నుదయమునఁ గాంతయ్యతోఁ గలసి తమ స్నేహితులయిండ్లకుఁ బోయి వారితో ముచ్చటించుచుఁ దమయభిప్రాయముల నెల్ల వారితోఁ జెప్పుచు సాయంకాలమున క్లబ్బునకును, ప్రార్థనాసమాజమునకునుఁ బోవుచు నాయూరఁగల గొప్పవారందఱిపరిచయమును సంపాదించుచుండిరి. కాని కొందఱకుమాత్రము వీరు గాంతయ్యయింట బసదిగియుండుటయు, బాయమ్మ విద్యాధిక్యతను గూర్చియు, సద్గుణసంపత్తినిగూర్చియు, శ్లాఘించుచుండుటయు నంతగా నామోదకరముగా నుండకుండెను. బాయమ్మయింటికిఁదరుచుగా వచ్చుచుండెడియామెయాప్తులలో నొకరిద్దరికి వీరాయింట బసదిగియుండుట ప్రథమమున దుస్సహముగా నున్నను దర్వాత వీరి యమాయిక వ్యాపారమునుబట్టియు నితరుల వ్యవహారములయందించుకైన జోక్యము గలుగఁజేసికొనకుండ సంచరించుచుండు యుచితజ్ఞతనుబట్టియుఁ ద్వరలోనే వారిని దమకాప్తులనుగాఁ జేసికొని బాయమ్మ యోగ్యతనుగూర్చి వారితోఁజెప్పి యానందించుచుండిరి. మొదలియారుగారును, శెట్టిగారును బాయమ్మ గొమారుని ముద్దాడుచు నాతనికి ఫలహారములును నాటవస్తువులను గొనిపెట్టుచు నాతఁడు గొప్పవాఁడై విశేషగీర్తిని బొందగల యదృష్టశా

లియని యాతనిఁగూర్చి చెప్పుచుండిరి.

ఇట్లీ నలుగురు స్నేహితులును గల్యాణపురమునఁ గొన్ని దినములు గాంతయ్యపాత్రుని యింట స్వస్థమానసులై బనచేసియుండి బాయమ్మగారి విదుషీత్వవైభవమునకును, ప్రయోజకత్వమునకును మిక్కిలి సంతసించుచు నామెయందపరిమితగౌరవముతో నంచరించుచుండిరి. గుణగ్రహణపారీణులగు నీసత్పురుషులకు బాయమ్మ మిక్కిలి గౌరవాస్పదమగు స్త్రీరత్నముగాఁ దోచుటొక వింతగాదు. మఱియు నీనలురుగును బాయమ్మగారి కొమారునియందమితమగు వాత్సల్యము గలిగి నాతని బ్రేమించుచు నాతనికాటవస్తువులను దుస్తులను గొని యిచ్చుచు దమతో షికారు దీసికొనిపోవుచుండిరి. చిన్నపిల్లలను గారవించి దయతో బ్రేమించి వాత్సల్యము గలిగియుండుట వారితల్లులకు సంతోషదాయకముగా నుండుట ప్రపంచధర్మమని చదువరులే గ్రహింపగలరు. ఎంతకురూపియు, బుద్ధిహీనుఁడును, నాతతాయియు దుశ్చేష్టితుఁడును నైన బిల్లవానినైనను సౌందర్యవంతునిగా బరిగణించి బుద్ధిశాలియని జెప్పుచు నాతనిగుణములకు మెచ్చికొని యాడుచున్నప్పుడా పిల్లవానితల్లికి మిక్కిలి యానందకరముగా నుండుటయు నట్లు తనపుత్రుని గారవించినవారియందధికభక్తివిశ్వాసములు గలిగియుండుటయు ప్రపంచధర్మము, కావునఁ దనకొమారుని గారవించుచున్న మొదలియారుగారు మొదలగు నీనలుగురియందును బాయమ్మగారికి గౌరవమును భక్తియు విశ్వాసమును బ్రేమయు దినక్రమముగా నభివృద్ధియయ్యెను.

బాయమ్మగారి కొమారునిపేరు శ్రీనివాసము. ఇతఁడాతతాయి యనియు విద్యయందించుకైన నిష్టములేకఁ బాఠశాలకు బోవునట్లు నటించి వీధులవెంబడి దుర్మార్గులగు హీనజాతులవారి పిల్లలతో దిరుగుచు లేనిపోనిపనులలో జోక్యము గలుగజేసికొని నాతతాయిలలో నాతతాయియని ప్రసిద్ధిగాంచి గల్యాణపురమున నెక్కడజూచినను దానే

గనుపించుచుండెను. ఇతఁడేండ్లకుఁ జిన్నవాఁడయ్యును దనవయసున కును, ప్రపంచానుభవమునకును, ననేకాంశములెక్కువగాఁ బళ్ళోపారణవిద్యయందును, హస్తలాఘవక్రియా చతురత్వమందును, సహజనిపుణత్వమును పాండిత్యమును జూపించుచు నాయోరివారందఱిచే తను దెబ్బలుదినుచుఁ దనశరీరము గట్టిపఱచుకొనుచు దిరుగుచుండెను.

దంటమాటలాడుటయందును, దౌష్ట్యమందును, నాతతాయితనమందును నద్వితీయుఁడయి శ్రీనివాసము దన్నుఁ బ్రేమాస్పదముగా గారవించుచున్న మొదలియారుగారు మొదలగు నీనలుగురికిని నప్పుడప్పుడు మిక్కిలి యాయాసము గలిగించుచు వారిని బాధపెట్టుచునేయుండెను. కాని యాతఁడు దమ్మెంత బాధపెట్టుచుఁ దమమనసుల కెట్టియాయాసమునుగలిగించినను శాంతస్వభావులును, దయామయులును క్షమాన్వితులును నగునీమహామహులు తమకు బాయమ్మగారియందుగల గౌరవమునుబట్టి మిక్కిలియోరిమితో నూరకుండిరి. ఇతఁడొకనాఁడు బంగారుతోఁగట్టబడిన మొదలియారుగారి సులోచనములు మిఠాయియంగడివానికిచ్చి తానును దనస్నేహితులును నత్యుత్సాహముతో విందారగించిరి. మఱియొకదినమున నీతఁడు నాయుఁడుగారి పెట్టె మారుతాళముతోఁ దెఱచి యందున్నవాచీయును గొలుసును దీసి తన స్నేహితునికొకనికి బహుమానమొసఁగెను. ఇంకొకనాఁడు శెట్టిగారి దుస్తులను దీసి యొక రహస్యస్థలమున దాచెను. ఈవిధముగా శ్రీనివాసము దమ్మెంత బాధించుచున్నను వీరుమాత్ర మాతఁడుచితానుచితములు గ్రహింపఁజాలని జ్ఞానమెఱుఁగని పిల్లవాఁడనియు, జిన్నతనపుచేష్టలుగా విలాసార్థము చేసిన నేరములనియు, నిశ్చయించుకొని యాతని నేమియు ననక మిక్కిలి గారాబముతో బ్రేమించుచునే యుండిరి.

ఇట్లు వీరు గల్యాణపురముననున్న సమయమున రాయవరగ్రామములో వీరిస్నేహముచేసి వీరిని సత్యవరమందు జరిగిన కల్యాణోత్స

వమునకుఁ దీసికొనిపోయి యచ్చట డిప్యూటీకలెక్టరు మొదలగువారి స్నేహలాభమును వీరికి గలుగఁజేసిన పార్థసారధి తననాటకసమాజమును దీసికొని నాటకములాడించి తన ప్రయోజకత్వమును నాటకప్రయోగకౌశల్యమును గల్యాణపురవాస్తవ్యులకుఁ బ్రకటీకృతముచేసి ప్రఖ్యాతివడయవలయునను యుద్దేశముతో నక్కడకు వచ్చి యొక పెద్దపాకనువేయించి నాటకములాడ నారంభించెను. మొదలియారుగారును, శెట్టిగారును, నాయుఁడుగారును, బిళ్ళగారును, గల్యాణపురమందుగల పెద్దమనుష్యులందఱి యిండ్లకుఁబోయి వారిస్నేహమాచరించి వారాపట్టణము ప్రవేశించిన రెండు మూఁడు దినములలోపలనే యాపురవాస్తవ్యులందఱి పరిచయమును నంపాదించిరి. ఆసమయమునఁ దమ పూర్వస్నేహితుఁడగు పార్థసారధి వీరికి గనుపించుట మిక్కిలి సంతోషాస్పదముగా నుండెననుట కెంతమాత్రమును సందియము లేదు. పార్థసారధిగూడ వీరి నలుగురిని నొకనాఁడు సాయంకాలమునఁ గ్లబ్బులోఁ గలిసికొని యలభ్యయోగముగాఁ దన పూర్వస్నేహితులను జూడఁగలిగిన భాగ్యమునకు మిక్కిలి సంతోషించి, తాను నాటకసమాజములో నాపట్టణమునకువచ్చిన సంగతియుఁ, దానక్కడ గొన్నినాటకములాడ నిశ్చయించుకొన్న విషయమును, వారితోఁ జెప్పి తన నాటకసమాజముయొక్క యుత్కృష్టతయు, నాటకములాడుటకు దాను విశేషవ్యయప్రయాసలకోర్చి సంపాదించిన నాటకపరికరముల యొక్క విశేషమును, జాలదూరము కొనియాడి వారితోఁ జెప్పి తన నాటకసమాజమాడు నాటకములన్నియు నాపట్టణమునఁ గొన్ని దినములుండిరైనఁ జూచి యానందింపకఁ దప్పదని చెప్పి తాను బసదిగియున్న యింటికి రమ్మని పిలచెను. పార్థసారధికాపట్టణమున బొమ్మగంటి సోమన్నగారను నొక స్నేహితుఁడు గలడు. ఈసోమన్నగారిని వీరు నలుగురు నింతకుబూర్వమే యెఱిగియున్నను నాయనతో వీరి

కంతగా స్నేహములేదు. కాని వీరు పార్థసారధిగారిని క్లబ్బులో గలసికొన్నప్పుడే సోమన్న గూడ నక్రీడ నేయుండుట తటస్థమయిన కారణమును బట్టియుఁ బార్థసారధి, మొదలియారు, మొదలగు నీనలుగురికిని సోమన్నకును గూడ పరమాప్తుడుగా నున్న హేతువునుబట్టియు నతిస్వల్పకాలములో వారికి స్నేహముగలిగిన వారైదుగురును బరమాప్తులుగా సంచరించ నారంభించిరి. పార్థసారధి గల్యాణపురమున నాటకములాడించుటకుఁ గావలసిన ప్రయత్న సాధనములన్నియు నీ సోమన్నయే చేయుచుండెను. సోమన్న పార్థసారధికి పూర్వస్నేహితుఁడగుట బట్టి యాతని నాటకప్రయోగములకుఁ గావలసిన యత్నములన్నియుఁ దన స్వకార్యములుగా మిక్కిలి శ్రద్ధతో నత్యుత్సాహముతోఁ జేయుచు నానాటకసమాజము దనదిగానే భావించుకొనుచుఁ దిరుగుచుండెను. మొదలియారు మొదలగు నీనలుగురు స్నేహితులును సోమన్నయు నుదయమును సాయంత్రమును పార్థసారధి బసదిగి యున్న యింట గలసికొని మిక్కిలి స్నేహభావముతోఁ బ్రవర్తించుచుండిరి. శెట్టిగారు గవితాలోలుఁడును సంగీతసాహిత్య విశారదుఁడును గావున నానాటకసంఘములో వారు చదువుపద్యములను పాడుగీతములను గర్ణానందముగా విని సంతోషించుచు, వారిపాండిత్యమునకును నేర్పునకును వారిని గొనియాడుచు, నాటకులకందఱకు మిక్కిలి యాప్తుఁడుగాను గౌరవాస్పదుఁడుగాను నుండెను. పిళ్ళగారును నాయుఁడుగారును గూడ నాటకులకు మిక్కిలి స్నేహితులుగను గౌరవాస్పదులుగను నుండి వారికిఁ గావలసిన సహాయమంతయుఁ జేయుచుండిరి. ఈవిధమునఁ గొలది దినముల లోపలనే యీనలుగురికిని సోమన్నతో దృఢమైన స్నేహసంబంధ మేర్పడినది. సోమన్న బ్రాహ్మణుఁడును, మొదలియారు మొదలగు నీనలుగురును శూద్రులును, అయినను వీరొక బంధువులవలె నన్యోన్య స్నేహ భావముతోడను, గౌరవ వి

శ్వాసములతోడను, సంచరించుచుండిరి. మొదలియారును నాతని స్నేహితులు ముగ్గురును గపట కల్మషము లెఱుగని యమాయికులని చదువరుల కిదివఱకే తెలిసియున్నది. సోమన్న మాయోపాయములయందద్వితీయమైన సంపూర్ణపాండిత్యము గల నేర్పరియుఁ గుత్సితుఁడును గుచోద్యుఁడును గావున వీరునలుగురు మిక్కిలి యమాయకులనియుఁ, బ్రపంచజ్ఞానము లేనివారనియు, నిష్కపటులనియు, నిముషములో గ్రహించి వారిని మఱింత స్నేహభావముతో గౌరవించి శ్లాఘించుచు వారిని దరుచుగాఁ దనయింటికిఁ దీసికొనిపోయి విందులు పాటకచేరీలు మొదలగునవి చేయించుచు సంతోషపెట్ట నారంభించెను. శెట్టిగారును బిళ్ళగారును సోమన్న స్నేహపాత్రతకును సరసత్వమునకు మిక్కిలి యానందించుచు నాతనిగొని యాడుచుండిరి. మొదలియారుగారు సోమన్న వ్యవహారజ్ఞానమునకును గార్య సాధనతకును, నాయుఁడుగారాతని ప్రయోజకత్వమునకును, ధైర్యసాహసములకును, నాశ్చర్యమందుచు నాతని శ్లాఘించుచుండిరి.

సోమన్న యొక వైదిక బ్రాహ్మణుఁడు. ఇతఁడు విద్యాధికుఁడు గాకపోయినను వ్యవహారజ్ఞానము గలిగి నాయూరజనుల నన్ని వ్యవహారములయందును సంబంధము గలుగఁ జేసికొని యాపట్టణమందున్న న్యాయవాదులందఱకుఁ బరమాప్తుఁడై వారి తలలో నాలుకవలె సంచరించుచు దన ప్రజ్ఞాబలముచేతను, గార్యసాధనానిపుణత్వముచేతను నెంతటి న్యాయమూర్తులనైన వంచించి మోసముచేయ సమర్థత గలిగి యొక గొప్పగృహస్థునివలెను, ననేకవ్యవహారసంబంధములు గలవాఁడుగను, సంచరించుచుఁ గాలము గడుపుచుండెను. ఇతఁడు జనులను వంచించుచు లేనిపోని వ్యవహారములను గల్పించి మాయోపాయములను బన్ని స్వహస్తనైపుణ్యముచే నెట్టివ్రాతలైనను లిఖితములైనను నిముసములో నించుకయిన భేదము గనుపింపకుండ వ్రాయగల సమర్థ

తగలిగి యెంతటి న్యాయమూర్తులనైన వంచించి మోసము చేయఁగలుగునట్లు సాక్ష్యులను సమకూర్పగల ప్రయోజకత్వముతో గ్రామమునసబుకోర్టు మొదలు హైకోర్టువఱకు ననేక వ్యాజ్యములలో సంబంధముగలిగి సంచరించుచుఁ, దాను న్యాయవాదిగాకపోయినను ప్రజ్ఞానిధులును న్యాయశాస్త్రపండితులును నగు న్యాయవాదులకన్న సహస్రాంశమెక్కువసామర్థ్యము గలవానివలె నటించుచు, న్యాయవాదుల యిండ్లకుఁబోయి వారికి వ్యవహారవిషయమునను గూర్చి బోధించి చెప్పుచు, ననుదినమును రాత్రిందివములు నిద్రాహారములకైన తీరిక లేకుండఁ గాలము గడపుచుండెను. ఇతఁడు గల్యాణపురమునకు గ్రామపురోహితుఁడగుటచే నితని కాపట్టణమందలి జనులందఱితోను వైదికసంబంధమును, దాను జోక్యము గలుగఁజేసికొనని వ్యవహారము లేకపోవుటచే లౌకికసంబంధమును, గలిగి వైదికలౌకికముల యందద్వితీయమగు నసమానమైన ప్రజ్ఞానైపుణ్యము గలిగి యుభయధర్మవేత్తయై ప్రవర్తించుచుండెను. వ్యవహారసంబంధములను బట్టియు వ్యాజ్యములయందు వాదులపక్షముననో ప్రతివాదులపక్షముననో పనిచేయుచుఁ దమకు సహాయము చేయుచుండుట బట్టి న్యాయవాదులును, నపకారమాచరించి హాని చేయునను భయముచే గొందఱును, లంచములు మాటలాడి తమకు ధనము దొరకునట్లు చేయగలుగునను విశ్వాసముచేతను, నమ్మకముచేతను నుద్యోగస్థులును, దమ్ము వంచించి యెట్టియాపదలకుఁ బాలుసేయునోయని గొందఱును, నాపట్టణమునఁ గలవారందఱు సోమన్నగారినిఁ దమ స్నేహితునిగా జూచుచుండిరి. మఱియు నితఁడు మంత్రశాస్త్రము దెలిసినవాఁడ ననియు వైద్యుఁడననియుఁ జెప్పుకొనుచు నాపట్టణమున భూతవైద్యమును జేయుచు నడిగినవారికెల్ల మంత్రోదకమును, విభూతియు యంత్రములను నొసఁగుచు వ్యాధులకుఁ జికిత్సలనుగూడఁ జేయుచుండుటచే నాతని ననేకులాశ్రయించుచు ననుదినమాతని యింటికి నేకు

లు బోవుచుండిరి. కొందఱుమాత్ర మితఁడు దాంభికుఁడనియు, నట్టి దుష్కార్యమును జేయుటకైన నించుకైన వెనుదీయనివాఁడనియు, నిండ్లకు గన్నములు వేయించి దొంగతనములుగూడఁ జేయించుననియుఁ, బాపమునకించుకైన వెనుదీయక నట్టి ఘోరకార్యములనైనఁ జేయగలవాఁడనియుఁ, జెప్పుచు నీతని నొక విషసర్పమువలెఁ జూచుచుందురు. కాని యీతఁడతిశాంతముతో నెవ్వరేమన్నను నెవ్వరెంతదూషించినను గేలిచేసినను నించుకైన నాగ్రహము జెందక మందహాసముతో మిక్కిలి యణకువగలిగి సంచరించుచుండును.

మొదలియారు మిక్కిలి యోగ్యుఁడనియు నమాయికుఁడనియు, శెట్టి సంగీతసాహిత్యాభిలాషియనియుఁ, బిళ్ళయ నాయుఁడుగారును రసికశిఖాగ్రగణ్యులనియు, నిమునములో సోమన్న గ్రహించి వారితో మిక్కిలి స్నేహసంబంధము గలిగి వర్తించుచుండెను. ఇతనికి బాయమ్మగారి యందాంతరంగికమైన నీర్ష్యయు, గోపమును గలదు; కాని తన యంతరంగద్వేషమును మాత్రమించుకైనఁ బ్రకటీకృతము చేయక సంచరించుచుఁ బూర్వాచారపరాయణత్వముచే నామె విద్యనేర్చి విద్యావతియైయుండుట కిష్టము లేనివానివలె మాత్ర మప్పుడప్పుడు తనస్నేహితులతోఁ జెప్పుచుండెను. కల్యాణపురమునకు సమీపముననున్న దనతోటలోఁ బార్థసారథికిని మొదలియారు మొదలగు నీనలుగురికిని సోమన్న విందుచేయుటకు నిశ్చయించి వారినిఁ బిలిచెను. ఒకనాఁడుదయ మెనిమిదిగంటలకు సోమన్న రెండు గుఱ్ఱపుబండ్లు సిద్ధముచేసి పార్థసారథియుఁ దానును గలసి మొదలియారు మొదలగు నీనలుగురు బసదిగియున్న కాంతయ్యపాత్రునింటికివచ్చి తన నూతనస్నేహితులను దీసికొని తన యారామమునకుఁ బోయెను. కాంతయ్యయు బాయమ్మయు మాత్రము వారితో విందునకాహ్వానింపఁ బడకపోవుటచేఁ దమయింటనే యుండిరి. వీరు సోమన్నగారి తోట ప్రవేశిం

చునప్పటి కించుమించుగా పదిగంటలు కావచ్చినది. అదివఱకే రెండె
డ్లబండిలో నెక్కిన నలుగురు భోగమువాండ్రచ్చటకు వచ్చియుండిరి.
పార్థసారథి యావేశ్యలను జూచినతోడనే యంతకుఁబూర్వమే వా
రితోఁ బరిచయముగలవానివలె నటించుచు వారియోగక్షేమముల నడి
గి తెలిసికొని మొదలియారుగారిని, శెట్టిగారిని, బిళ్ళగారిని, నాయుఁ
డుగారిని వారియొద్దకుఁ దీసికొనిపోయి వారినిగూర్చి యావేశ్యలతో
ననేకవిధములుగా శ్లాఘించి శెట్టిగారు సంగీత సాహిత్య చక్రవ
ర్తియనియు, బిళ్లగారును నాయుఁడుగారును సంగీతాభినయ శాస్త్రపా
రంగతులనియు, మొదలియారుగారు ప్రసిద్ధిపడసిన బారిష్టరనియుఁ, జె
ప్పెను. ఆవేశ్యలు వారినిఁజూచి సిగ్గునభినయించుచు నంతఃపురాంగన
లవలె మొగములు ద్రిప్పుకొని మందహాసములు చేయుచు నూరకుండి
రి. సోమన్నగారు భోజనప్రయత్న మెంతవఱకుఁ జరిగినదోఁ దెల
సికొనవలయునని వంటశాలలోనికిఁ బోయి రైదునిమిషములలో నీవే
శ్యలును మొదలియారు మొదలగువారును నున్నప్రదేశమునకు వచ్చి
వారందఱు దనయాప్తస్నేహితులు గావున వారిని జూచి సిగ్గుపడవల
సిన యవసరము లేదని వేశ్యలతోను వారు వేశ్యావృత్తిని ద్యజించి
చిన్నతనమునుండియు సంసారస్త్రీలవలె గౌరవముగాఁ గాలము గడ
పుచుండుటచే నట్లు సిగ్గుపడుచున్నారని మొదలియారు మొదలగువారి
తోను జెప్పి యొక మామిడిచెట్టుక్రింద తివాచీవేయించి దానిపై వారి
నందఱిని గూర్చుండబెట్టి "ఇప్పుడేవత్తు" నని యావలకుఁ బోయెను.
పార్థసారథి పూర్వపరిచితుఁడగుటచే నావేశ్యలతోఁ జనువున మా
టలాడుచుండెను. ఆవేశ్యలలో నొకతెకు నలువదిసంవత్సరములును,
నింకొకతెకు ముప్పదిసంవత్సరములును, మూడవదానికి పదునెనిమి
ది సంవత్సరములును, నాల్గవదానికి పదునారుసంవత్సరములును వ
యసుగలదు. నలువది సంవత్సరములు వయసుగలది సోమన్న

గారి యర్ధాంగి యనియు, ముప్పదిసంవత్సరముల వయసుగలది దా ని చెల్లెలనియుఁ, దక్కిన వాండ్రిద్దఱును సోమన్నగారి కోమా టెక్కాలనియు వాండ్రు వేశ్యాజాతియందు జన్మించినను కులాంగనల కంటె నెక్కువ గౌరవప్రతిష్ఠలతోఁ గాలము గడపు చున్నారని యుఁ జక్కఁగా పాడనేతుఱ రనియు భోగము మేళములకుఁ బోనివారని యు ననేకవిధములుగా వారినిగూర్చి పార్థసారధి మొదలియారుగారి తోను వారిస్నేహితులతోను ననేకవిధములుగా శ్లాఘించి చెప్పెను. కాని యీనలుగురివేశ్యలతోఁ గలసి యచట గూర్చుండియున్న మొద లియారు మొదలగు నీనలుగురికిని దమ్మెవ్వరైన జూతురన్న భయము మాత్రము లేకపోలేదు. సంగీతశాస్త్రాభిమానముచే శెట్టిగారును బిళ్ళ గారును మాత్రము మనసులలోఁ దమకెట్టిభయమును సందియమును ను న్నను పైకిమాత్రము మందహాసముచేయుచు నావేశ్యలతో ముచ్చటిం చుచునేయుండిరి. ఇట్లొకగంటకాలము గడపినతరువాత సోమన్నవ చ్చి మొదలియారుగారిని, వారి స్నేహితులను, పార్థసారధిని భోజనమునకుఁ దీసికొనిపోయి వనభోజనము చేయునప్పుడు 'జాతినియమ మనావశ్యక' మని ధర్మశాస్త్రములు చెప్పుచున్నవని చెప్పి యందరును గలసి భోజనమునకుఁ గూర్చుని ముచ్చటలాడుకొనుచుఁ దనగొమాటెక్కా లనుగూర్చియు వారిసౌందర్యమునుగూర్చియు వారి యుచితజ్ఞతనుగూర్చి యు వారిసంగీతాభినివేశమునుగూర్చియు నున్నవియు లేనివియుగల్పించి చెప్పుచు విందారగించిరి. తరువాతఁ దాంబూలములు వేసికొని యొకచె ట్టుక్రింద విశ్రమించియున్న కొంతసేపటికి శెట్టిగారును, బిళ్ళగారును, వారిసంగీతము వినవలయునని సోమన్నగారితో జెప్పిరి. సోమన్నగా రు దనకోమాటెక్కాలప్పుడు సంగీతము పాడుటకు యంత్రసాధనముల తో వచ్చియుండకపోవుటచే నప్పుడు వీలుగానుండదనియు మఱియొక నాఁడు దప్పక సంగీతము పాడింతుననియు జెప్పి యప్పటికావేశ్యలు

సంకేతము పాడనుంపఁ దప్పించెను. తరువాత వీరందఱు గలసి యొక్కొక్క రూపాయి మేజుపెట్టి పేకయాడుటకారంభముచేసి మొదలియారుగారిని శెట్టిగారిని నాటకుఁ బురికొల్పిరి. మొదలియారదివఱకెన్నఁడును జూదమాడి యెఱుఁగనివాఁడగుటఁ బట్టియు శెట్టిగారు పేకాటయందంత సమర్థుఁడుకాకపోవుటచేతను నాయాటకెంచుకయు సమ్మతించలేదు. కాని నాయుఁడుగారును, బిళ్ళగారును, వినోదార్థము పేకాడుట దోషముకాదనియుఁ, బేకాడుట చేతకాదన్నచోఁ దమరసికత్వమునకు భంగముకలుగుననియుఁ, దలఁచి యొప్పుకొనిరి. అంత నావేశ్యలలో ముగ్గురును, శెట్టిగారును, బిళ్ళగారును, బేకాడుట కారంభముచేసిరి. సోమన్నగారొద్ద కూర్చుండి పిళ్ళగారికిని నాయుఁడుగారికిని నాటలో సలహాలిచ్చుచుండెను. పార్థసారథి యావేశ్యలతోఁ గలసి నవ్వచు నర్మగర్భముగా మాటలాడుచు నానందించుచుండెను. మొదలియారును సోమన్న యర్ధాంగియగు నావేశ్యమాతయుఁ గొంచెముసేపు మాపులతో నేమేమియో మాటలాడుకొని యొకరినిఁ జూచి యొకరు మందహాసముచేసికొనుచు గూరుచుండిరి. పిళ్ళగారియొద్దను నాయుఁడుగారియొద్దను నప్పుడు సొమ్ములేకపోవుటచే సోమన్న వారికిఁ బెట్టుబడిపెట్టి పేకయాడించెను. శెట్టిగారు మాత్రము నొకచెట్టుక్రింద గూర్చుండి యథేచ్ఛముగా నిద్రపోవుచుండిరి. రాముఁడు వంటసావడిలోఁ జేరి యథేచ్ఛముగా భోజనముచేయుచు వంటచేసిన పదార్థములనెల్ల ఖర్చుపఱచెను. ఇట్లు సాయంత్రము నాలుగుగంటలవఱకు పేకాడుకొని శెట్టిగారునుఁ, బిళ్ళగారునుఁ, గలసి నూఱురూపాయీలవఱకు నావేశ్యలకర్పణముచేసికొని తరువాత బండ్లెక్కి యింటికి తిరిగివచ్చుటకుఁ బ్రయాణమైరి. సోమన్న తనకుఁ బనియున్నదని చెప్పి ముందుగా వారిని విడిచి పోయెను. పార్థసారధియు, వేశ్యలును, మొదలియారుగారును మొదలగు మనకథానాయకులునుఁ బండ్లెక్కి యింటికి దిరిగివచ్చిరి.

మరునాఁడుదయమునఁ బార్థసారథ మొదలియారుగారికినిఁ, బిళ్ళగారికని, శెట్టిగారికని, నాయుఁడుగారికినిఁ, గాంతయ్యకును, బాయమ్మగారికి

ని, వారి సేవకులకును, శ్రీనివాసమునకును, నాటకమునకాహ్వానపత్రికలను టిక్కెట్లును పంపెను. ఆరాత్రి సీతాకళ్యాణనాటకమాడుటకు నిశ్చయింపఁబడినది. పార్థసారధి సోమన్నతోఁ గలసి యాపట్టణమునందున్న పెద్దమనుష్యులనెల్లఁ జూచి నాటకమునకు రమ్మని పిలిచెను. నాటకము చూడఁబోవుట కుచితమయిన వస్త్రములను సిద్ధముచేసికొని మొదలియారుగారు మొదలగువారు సిద్ధముగానుండిరి. బాయమ్మ చక్కగా నలంకరించుకొని తనభర్తయగు కాంతయ్యను నింటికిఁ గాపుంచి శ్రీనివాసమును దీసికొని నాటకమునకుఁ బోవ సిద్ధముగానుండెను. రాత్రి భోజనమయినతరువాత వీరందఱు బండ్లెక్కి నాటకశాలకుఁ బోయిరి. బాయమ్మ స్త్రీలుకూర్చుండుటకేర్పడిన ప్రదేశమునఁ గూర్చుండెను. మొదలియారుగారును, శెట్టిగారును, నాయుఁడుగారునుఁ, బిళ్ళగారును ముందుకుర్చీలపై గూర్చుండిరి. శ్రీనివాసమునకు స్థలములేకపోవుటచే వీరు నలుగురు కొంతసేపు శ్రీనివాసమును తమతొడలపైఁ గూర్చుండఁబెట్టుకొని నాటకమును చూచుచుండిరి. బాయమ్మగారు కూర్చున్నప్రదేశమున సోమన్నగారి వేశ్యాకుటుంబము కూడ గూర్చుండియుండెను. అంత నాటకమారంభమై రెండంకములు సమాప్తమయినతరువాత మొదలియారుగారు శ్రీనివాసమును తీసికొని యావలకుఁ బోయిరి. శ్రీనివాసము దాపుననున్న మిఠాయియంగడిలోఁ గొంతమిఠాయి కొనిపెట్టుమని మొదలియారుగారిని నడిగెను. శ్రీనివాసముపై మొదలియారుగారికి మిక్కిలి వాత్సల్యముకలిగి యుండుటచే నాతనికిఁ గావలసినవన్నియుఁ గొనిపెట్టి యాయన చల్లగాలికటునిటు తిరుగుచుండెను. అప్పుడు శ్రీనివాసము నాటకపుపాకదగ్గర నిలచి వేడుక చూచుచున్న యొకమనుష్యుని మొలలో వ్రేలాడుచున్న వెండిగొలుసును ద్రెంపుకొని నాటకపుశాలలోనికిఁ బాఱిపోయెను. ఆమనుష్యుఁడు తనగొలుసు పోయినదని పోలీసువారితోఁ జెప్పి యొక కుఱ్ఱవాఁడు దానినపహరించి నాటకపుపాకలోనికిఁ బోయెనని ఫిర్యాదుచేసెను. మొదలియారుగారిది యంతయుఁ జూచుచుండుటచే శ్రీనివాసము చిన్నతనముచే నీపనిఁ జేసినాఁడని గ్రహించి తానా

గొలుసు నిప్పించెదనని యతని నొప్పించి నాటకపుపాకలోనికిఁ బోయి శ్రీనివాసమునుఁ బిలచి యాగొలుసాతనికిచ్చివేయుమని చెప్పెను. కాని శ్రీనివాసమా గొలుసెఱుఁగనని పెద్దపెద్దకేకలువెట్టి యేడ్చుచుఁ దనతల్లియొద్దకుఁ బోయి యేమేమో చెప్పుటకుఁ బ్రయత్నించెను. కాని శ్రీనివాసము స్త్రీలకేర్పఱుపఁబడిన స్థలమునకుఁ బోనుండ నష్టగింపఁబడుటచే నిదియంతయు బాయమ్మ దూరమునుండి చూచి యీవలకు వచ్చి మొదలియారుగారివలన సంగతియంతయుఁ దెలిసికొని తనకుమారుఁడు చేసినపనివలనఁ దనకుఁ దటస్థమయిన యవమానమునకు మిక్కిలి విచారించుచు నాటకము చూడనొల్లక శ్రీనివాసమును దీసుకొని యింటికిఁ బోవుటకాయత్తపడెను. రాత్రివేళ నామె నొంటరిగా నింటికిఁ బంపించుటుచితముకాదని యూహించి తానుగూడ నామెతో నింటికిఁబోయి యామెను శ్రీనివాసమును నింట దిగవిడిచి తనస్నేహితులనుఁ గలసికొనుటకుఁ దిరిగి నాటకమునకు రానిశ్చయించుకొని మొదలియారామెతోఁ బోయెను.

తరువాత మరునాఁడు తనకుఁ బనియున్నదని చెప్పి సోమన్న పార్థసారథియొద్ద సెలవుపుచ్చుకొని శెట్టిగారితోను, నాయుఁడుగారితోను, బిళ్ళగారితోనుఁ జెప్పి యింటికిఁ బ్రయాణమాయెను. తమ స్నేహితుఁడగు మొదలియారుగారు బాయమ్మతో నింటికిఁ బోయినసంగతి వీరెఱుఁగుదురు గావునఁ దామును సోమన్నతోఁ గలసి కొంతదూరము వచ్చెదమని ప్రయాణమై పార్థసారథితోఁ జెప్పిపోయిరి. ఇట్లు వీరు ముగ్గురును సోమన్నయు నాతని నలుగురు వేశ్యలును బండ్లెక్కి కొంతదూరము పోయినతరువాత సోమన్న వారినిఁ దమయింటనే యారాత్రి యుండి మరునాఁడుదయము వేకువతో నింటికిఁ బోవచ్చునని చెప్పి తనవేశ్య యింటికిఁ దీసికొనిపోయి వారినచ్చట యుండఁబెట్టెను. సోమన్న చేసిన సదుపాయమునకు మిక్కిలి సంతసించుచు నావేశ్యల యాదరణమునకు నానందించి యచ్చటనే పరుండి నిద్రపోయిరి. అంత మొదలియారు బాయమ్మను, శ్రీనివాసమును నింట దిగవిడచి తనస్నేహితులకొఱకు నాటకపుపాకకడకు వచ్చెను. అప్పటికి నాటకము పూర్తియాయెను. నాటకు

లందఱు దీపములు తీసివేసి తమ బసలకుఁ బోయిరి. మొదలియారు నాటకము ముగింపఁబడినదని తెలుసుకొని తనస్నేహితుల కొఱ కటునిటు దిరిగి చూచి వారినెచ్చటను గమనింపలేకపోవుటచే నింటికిఁ దిరిగిపోవుచుండెను. అప్పుడు రాత్రి యించుమించుగా రెండుగంటలు కావచ్చినది. ఆకసమంతయు మేఘములచే దట్టముగాఁ గ్రమ్మఁబడి యేవంకఁ జూచినను నంధకారబంధురముగా నుండెను. దూరమున నక్కడక్కడ మిణుకుమిణుకు మని దీపములకాంతిమాత్రము గొంచెముగాఁ గానుపించుచుండెను. చోరులును విటులును దక్క దక్కినవారెవ్వరును సంచరింపకుండెడి యాసమయమున మన మొదలియారొక్కడు మెల్లగా నడచుచు దారినిబోవుచుండ నాతనికొక యొద్దుబండి యెదురయ్యెను. అప్పుడా బండిలోనుండి యేబది సంవత్సరముల వయసుగల యొకపురుషుఁడు గ్రిందికి దిగి తనకారాత్రి బరుండుట కెచ్చటనైన బసదొరకునా యని యడిగి తాను రాత్రిభోజనము చేసి బండికట్టించుకొని బయలుదేరువఱకే ప్రొద్దుపోయినదనియు నాపట్టణము వర్జసమయములోఁ బ్రవేశించుట కిష్టములేక నూరువెలుపల గాటీపాకయొద్ద బండినిలిపి యప్పుడే వచ్చితిననియుఁ దాను దనయన్నగారి కొమార్తెకు వివాహముచేయనెంచి వరాన్వేషణమునకక్కడికి వచ్చితిననియుఁ జెప్పెను. మొదలియారుపకారబుద్ధి గలవాఁడును శరణాగతరక్షకుఁడును గావునఁ దనబసలో నారాత్రి నిద్రపోయి యుదయమున బోవచ్చునని చెప్పెను. అంతనాతఁ డపరిమితానందమును బొంది మొదలియారుతో నాతఁడు బసదిగియున్న బాయమ్మగారి యింటికిఁ బోయి వీధిలో బండినాపి యందులోఁ గూర్చునియున్న ముప్పదియేండ్లవయసుగల సకేశి యగు నొక వితంతువును పదకొండు సంవత్సరముల ప్రాయముగల యొకచిన్నదానిని గ్రిందకు దింపెను. మొదలియారు వీధితలుపు గొట్టి రాముని బిగ్గరగా కేకలుపెట్టి పిలువ నాతఁడు పలుకలేదుగాని కుప్పుసామిమాత్రము గండ్లునలుపుకొనుచు వచ్చి తలుపు తెఱచెను. తరువాత బండివాఁడును నాబండితోవచ్చిన పెద్దమనిషియు నొక కావడిపెట్టెను నొకమూటను నొక గోనెసంచిమూట

ను బండిలోనుండి క్రిందికి దింపి మెల్లగా నింటిలోపలికి దీసికొనిపోయి యొక వాకిటిలో నుంచిరి. తరువాత నా పెద్దమనిషి యావితంతువును "వదినా" యని బిలుచుచు నామెను నాపిల్లను లోపలకుఁ దీసికొనిపోయి తమ సామానంతయు నుంచఁబడిన వాకిటిలో బరుండిరి. మొదలియారుగారు దమ గదిలోనికిఁ బోయి తాను దొడిగికొనియున్న దుస్తును దీసి శెట్టిగారు మొదలగువారింకను రాలేదాయని యడిగి వారు ముగ్వురును, రాముఁడును, సోమన్నగారితో వారియింటికేఁ బోయిరనియు, వారారాత్రికక్కడనే నిద్రపోయి మరునాఁడు వేకువతో వచ్చెదరనియుఁ, గుప్పసామివలనఁ దెలిసికొని వీధితలుపు బిగించమని తన సేవకునితోఁ జెప్పి పరుండి నిద్రపోయెను.

శెట్టిగారును, నాయుఁడుగారును, బిళ్ళగారును, సోమన్నగారి వేశ్యయింటఁ జెరియొకమంచముమీఁదను బరుండి నిద్రపోవుచుండిరి. రాముఁడు వీధిచావడిలో నొక చాపమీఁద యొడలెఱుఁగక యెందరెంత కొట్టిపిలచి లేపినను నించుకైనఁ గదలక నిద్రపోవుచుండెను. కాని యాయింటనున్న వేశ్యలు నలుగురును, సోమన్నగారును మాత్రము నిద్రపోక నేమేమో మెల్లగా మాటలాడుకొనుచు, నవ్వుకొనుచు నారాత్రియంతయు మేలుకొనియే యుండిరి. ఆవేశ్యలలో పెద్దదానిపేరు శ్రీహరి. దానిచెల్లెలుపేరు శోభనాచలము. సోమన్నగారి పెద్దకొమార్తెపేరు మాణిక్యము. ఆయన చిన్నకొమార్తెపేరు సుందరి. సోమన్నగారేవిధముగానైనఁ దనకొమార్తెల నిద్దరను బిళ్ళగారికిని, నాయుఁడుగారికినిఁ, దన మరదలిని శెట్టిగారికిని, గట్టిపెట్టి వారి ముగ్వురను మొదలియారుగారిని గూడఁ దనవలలో వేసికొనవలయునని యాలోచించుచు నారాత్రియంతయుఁ దన కార్యమును నెరవేర్చుకొనుటకుపాయముల నన్వేషించుచు నావేశ్యలతోఁ దనయభిప్రాయమును జెప్పి చర్చించుచు నించుకైన నిద్రజెందక మేలుకొనియుండెను. శెట్టిగారు నిద్రపోవుచున్నవానివలె గండ్లుమూసికొని మంచముపై బరుండియున్నను నిద్రపట్టకపోవుటచే నేమేమో నాలోచించుచు గంటలు లెక్కపెట్టుచుండెను. అంతకుఁ బూర్వము

సోమన్నగారితోటలోని వేశ్యలను జూచిన యంశమును వాండ్రసరససంభాషణమును, వినయవిధేయతలును, ఉచితప్రవర్తనమును, యోగ్యతయు సౌందర్యమును దలచుచు, వారిసంగీతమును వినవలయునని యుత్సాహముతో నేమేమో మనసులో నాలోచించుకొనుచు, సోమన్నగారి స్నేహభావమునకును, రసికత్వమునకును, వ్యవహారనైపుణ్యమునకును, కార్యాచరణచతురత్వమునకును, సంతసించుచుఁ దెల్లవారులోపలఁ దామితరులగండ్లఁబడకుండ వచ్చుటనుండియింటికి బోకుండినచోఁ దమ్మెక్కడైనఁ జూతురను సందియముచే భయపడుచుఁ, దమ ప్రాణమిత్రుఁడగుమొదలియారేమిచేయుచున్నాడోయనిమనసులోఁ దలచుకొనుచు బాయమ్మ విద్యానైపుణ్యమును సంగీతజ్ఞానమును సౌందర్యమునుగూర్చియాలోచించుచు శెట్టిగారా రాత్రియంతయు నిద్రపోలేదు. అంతనాలుగుగంటలయిన సంగతి దెలసికొని శెట్టి మంచముపైనుండి లేచినాయుడుగారిని బిళ్ళగారినిలేపి సోమన్నగారితోఁజెప్పి యాయనయునావేశ్యలును దెల్లవారినతరువాత వచ్చుటనే దంతధావనాది కాలోచితములు దీర్చికొని కాఫీపుచ్చుకొని బసకుఁబోవచ్చునని యెంత చెప్పినను వినకఁ బ్రయాణమై బసకుచనిరి. వీధిసావడిలో నొడలెఱుంగక నిద్రపోవుచున్న రామునిలేపి తమతోఁ దీసికొనిపోవలయునని వీరుమువ్వురు ననేకవిధములుగా నెంతకొట్టిలేపినను నాతఁడించుకయుఁ గదలలేదు. ఇట్లు రాముని లేపుప్రయత్నమున నొకయరగంట కాలమక్కడవ్యర్థాయాసముతోఁ గడపి యాతని దమతో దీసికొనిపోవుట కాతనిఁ దామిద్దఱు మోసికొనిపోవు సాధనము దప్ప నుపాయాంతరము లేకుండుటచేఁ దెల్లవారునన్న భయమున వారుమువ్వురును దమ బసకు దిరిగివచ్చిరి. మొదలియారుగారిని వారు గలసికొని రాత్రిసోమన్నగారి వేశ్యయింట నిద్రించిన సంగతియు వారుదమకుఁ జేసిన గౌరవమును, సదుపాయమును, గూర్చియు, సోమన్న స్నేహపాత్రతనుగూర్చియు, శ్లాఘించుచుఁ జెప్పిరి. మొదలియారుగారు సోమన్న మిక్కిలి యుచితజ్ఞుఁడనియు, సరసుడనియు, నేర్పరియనియు, కార్యాచరణనిపుణుఁడనియు, వ్యవహారవేత్తయనియు,

నాతని స్నేహము దామముఖ్యముగాఁ జేయదగినదనియుఁ, జెప్పిరి. ఇట్లీవలు గురు మాటలాడుకొనుచుండగాఁ దెల్లవారినది. రాత్రిబండిపై నెక్కివచ్చియుంధు సావడిలో నిద్రపోయిన పెద్దమనిషియు, నాతని వదినెయు, నాకన్యయు, నిద్రమేల్కొని మొదలియారుగారిని వారిస్నేహితులను జూచి రాత్రి దమకు బసనుపాయ మొసఁగినందు కనేకవిధములుగా శ్లాఘించి తామాదిన గ్రామమం దెక్కడనైన నొకబస కుదర్చుకొని యచ్చట కొన్నిదినము లుందుమని చెప్పిరి. తరువాత నావితంతువును నాకన్యయు నింటిలోపలికిఁ బోయి బాయమ్మను గలిసికొని యామెతో మాటలాడుచు నొకగంటకాల మక్కడ గడపిరి. నామనుష్యుడు మొదలియారుగారితోఁ దాను బ్రాహ్మణుఁడ ననియు నావితంతువు దనయన్నగారి భార్యయనియు నాకన్యక దన యన్నకొమార్తె యనియుఁ దనభార్య నాలుగుసంవత్సరములక్రిందట విశూచిజాడ్యమువలనఁ జనిపోయినదనియుఁ దాను బీదవాడగుటచేతను నేండ్లు గడచినవాఁడగుటచేతను దిరిగి వివాహమాడఁజాలకఁ దనయన్న భార్యను పిల్లలను గనిపెట్టుకొని యున్నాననియు దనయన్నగారి కీపిల్లయు నీపిల్లకన్నఁ బెద్దవాఁడొకకొమారుఁడును నున్నాగనియు నీపిల్లకుఁ బెండ్లి చేసి యాకన్యాశుల్కము వలనఁ దనయన్న కొమారు నొకయింటివానినిఁ జేయవలసిన బాధ్యతఁ దనయందున్నదనియుఁ, ధనమునకుఁ దనయన్న కొమార్తె నమ్ముటకుఁ దన కెంతయిష్టము లేకపోయినను వంశము నిలబెట్టుకొనుటకు దనయన్న కొమారునికి వివాహము చేయుట విధాయికము గావునను దాము పేదవాండ్రగుటచేఁ గన్యాశుల్కమియ్యకుండ నాతనికి వివాహము చేయగలుగుట దటస్థము గాదనియుఁ మొదలుగాగల దన గృహచ్ఛిద్రములనెల్ల జెప్పెను. అప్పుడు మొదలియారుగారును వారిస్నేహితులును గన్యాశుల్కమును గూర్చియు వరశుల్కమును గూర్చియు వానివలన దేశమునకుఁ దటస్థమగుచున్న దుస్థితిని గూర్చియుఁ జెప్పించుచుఁ బేదవాండ్రలో గన్యాశుల్కమియ్యకుండ బురుషులకును, ధనవంతులలో వరశుల్క మియ్యకుండ గన్యలకును వివాహములు చేయ నేరరనియు, ని

ళ్లు ద్రవ్యమునకు గన్యల నమ్ముకొనునట్టియు, నమితముగా వరశుల్కములను గొని ధనికులు దమపుత్రులకు వివాహములు చేయునట్టియు, దురాచారములు రూపుమాపినఁగాని మనదేశ మెన్నటికిని నభివృద్ధికి రాదనియుఁ జెప్పుకొని వరశుల్కములను గూర్చియుఁ గన్యాశుల్కములను గూర్చియుఁ జర్చించిరి. దేశాభివృద్ధికొఱకును వంశాభివృద్ధికొఱకును నైహికాముష్మిక సుఖప్రాప్తికిని స్త్రీపురుషులకు వివాహము ముఖ్యధర్మమనియు, స్త్రీపురుషుల కత్యావశ్యకమగు నిట్టి ప్రాపంచికధర్మకార్యానుష్ఠానమును గేవలము ధనలోభమున మనదేశములో ననేకులు ధర్మబాహ్యమగునట్లొనర్చుచున్నారనియు, శెట్టిగారుసెలవిచ్చిరి.

అప్పుడు లోపలినుండి యాకన్యక మొదలియారుగారు మొదలగువారును దన పినతండ్రియు గూర్చుని మాటలాడుచున్న స్థలమునకు వచ్చి యాతనితో నేమో మాటలాడవలయునని దగ్గరనిలబడెను. ఆకన్యకకు పదకొండుసంవత్సరముల ప్రాయముండునని యిదివఱకేఁ జెప్పఁబడినది. ఆకన్యక చామనచాయగలిగి కొంచెము పొడవుగా విశాలమగు నేత్రములతో సులక్షణముగా నుండెను. మొదలియారుగా రాపిల్లను జూచి కూర్చుండుమని చెప్పి యాపిల్లనుఁ దనయొద్దఁ గూర్చుండబెట్టుకొని తన హృదయమునఁ బొడమిన దయయు గరుణమును నుప్పొంగ "అమ్మాయీ! నీ పేరెవ్వ" రని యడిగి యాపిల్ల "నాపేరు సీతమ్మండి" యని జెప్పగా విని "యీపిల్లనా? కన్యాశుల్కమునకు వివాహముచేయఁ దలపెట్టి ధనమునకు విక్రయింప నిశ్చయించుకొన్నా" రని యాకన్య పినతండ్రి నడిగెను. అందుకాతఁడు దనగండ్ల నీరు గార్చుచుఁ దన దరిద్రము దన్నట్లు చేయఁ బ్రేరేపించుచున్నదనియుఁ దనయన్నకొమారునకు వివాహము చేయవలసిన బాధ్యత తనయందుండుటచే దానీనీతిబాహ్యమైనట్టియు నధర్మహేతువైనట్టియుఁ గార్యమును జేయవలసివచ్చినదని కండ్ల నీరుగార్చుచుఁ జెప్పెను. కరుణాసముద్రుఁడగు మొదలియా రాపెద్దమనిషి చెప్పినమాటలను విని నోరెఱుఁగని యాపిల్ల నమ్ముచున్నారను నంశమును దలచుకొనుచుఁ దానును గన్నీరుగార్చెను. శెట్టి

గారును, బిళ్ళగారును, నాయుడుగారును మిక్కిలి జాలిపడిరి. తరువాత నీపెద్దమనిషియు నాతని వదినయు నాకన్యయు నొక కూలివానిచేఁ దమసామానంతయు బట్టించుకొని "తిరిగి దర్శనము జేసెద" మని మొదలియారుగారియొద్దను వారి స్నేహితుల యొద్దను సెలవు దీసికొని వారు బసదిగియున్న బాయమ్మగారి యింటికి సమీపముననున్న యొక బ్రాహ్మణుని యింట బసచేసిరి.

సోమన్నగారి వేశ్యయింట నిద్రపోవుచున్న రాముఁ డుదయమెనిమిది గంటలవఱకు లేవనేలేదు. సోమన్నగా రేడుగంటలకే కాలోచితములను దీర్చుకొని కాఫీ త్రాగి బయలుదేరి యావలకుఁ బోయిరి. రాముడు మేల్కొనిన తరువాత సోమన్నగారి కొమార్తె లిద్దరు నాతని మిక్కిలి యాదరముతో గౌరవించి చద్దియన్నము పెట్టి రెండుగంటలు తమయొద్ద గూర్చుండఁబెట్టుకొని నాయుడుగారిని గూర్చియు బిళ్ళగారిని గూర్చియు నడిగి వారు మిక్కిలి రసికులనియు, యోగ్యులగు పురుషరత్నములనియు, సంగీతకళారహస్యవిదులనియు, నెంతెంతో శ్లాఘించిరి. అప్పుడా వేశ్యల పినతల్లియగు శోభనాచలమును తల్లియగు శ్రీహరియు నచ్చటికి వచ్చి "రామన్నతో నేమి మాట్లాడుచున్నా" రని తనకుమార్తెల నడిగి శెట్టిగారి యోగ్యతను గూర్చియు, మొదలియారుగారి గౌరవప్రపత్తిని గూర్చియు ముచ్చటించిరి. ఇట్లీనలుగురు వేశ్యలు గలసి రామునితో మొదలియారుగారినిగూర్చియు నాయన స్నేహితులను గూర్చియు హాస్యమాడుచు నవ్వుచు నర్మగర్భముగాఁ దమకు వారియందు గల ప్రేమానురాగమును బ్రకటించుచు మాటలాడి యాతనికిఁ దాంబూలమును నొకరూపాయియు నిచ్చి పంపివేసిరి. రాముఁ డారూపాయి దీసికొని యపరిమితానందముతో మొదలియారుగారు బసదిగియున్న యింటికి వచ్చువఱకు మధ్యాహ్నము పదకొండు గంటలైనది. మొదలియారును శెట్టియు నంతవఱకు నింటికి రాకపోయినందుకు రామునిపై నాగ్రహపడిరి గాని యాతఁడు చెప్పిన మాటలపై నూరకుండిరి. తరువాతఁ దనయజమానులు భోజనము సే

సి విశ్రమించి యున్న సమయమున వారియొద్దఁ జేరి యావేశ్యలకు మొదలియారుగారియందును శెట్టిగారిపట్లను బిళ్ళగారియెడలను నాయుఁడుగారి విషయమునను గలగౌరవమును గొనియాడుచు సోమన్నగారి గోమార్తె లిరువురిసౌందర్యమును వారికి నాయుఁడుగారియందును బిళ్ళగారియెడలను గలయనురాగమును తనకుఁ దోచినట్లు వర్ణించియున్నవియు లేనివియుఁ గూడఁ జెప్పెను. శెట్టిగారికిని నాయుఁడుగారికిని బిళ్ళగారికిని నావేశ్యల సంగతము వినవలయునని మిక్కిలి కుతూహలముఁ గలదు. కాని యీసంగతి బాయమ్మకుఁ దెలియుటకు వీరికెంతమాత్రము నిష్టములేదు. తామాపట్టణములోఁ బెద్దగృహస్థుల స్నేహము సంపాదించి సగౌరవముగా సంచరించుచుండుటచేఁ దాము సోమన్నగారితో నాయన వేశ్యయింటికిఁ బోయినసంగతి యితరులకుఁ దెలిసినయెడలఁ దమకు గౌరవహాని చేకూరునన్న సందేహమును భయమును గూడ వీరికి లేకపోలేదు. కావున రామునితోడను గుప్పుసామితోడను యీవిషయమును గూర్చి యెవ్వరితోను జెప్పవద్దని మొదలియారుగారును వారిస్నేహితులు ముగ్గురునుగూడఁ జెప్పిరి.

తరువాత సాయంకాలము నాలుగుగంటలకు సోమన్నగారు మొదలియారుగారు మొదలగు నీనలుగురుస్నేహితులును బసదిగియున్న బాయమ్మగారి యింటికివచ్చి తన నూతనస్నేహితులతోఁ గొంత ముచ్చటలాడి వారితోఁ గలసి షికారునకు బయలువెడలెను. వీరు పార్థసారథి బసకుఁబోయి యచట నాతనిఁ గలసికొని యాతని దమవెంటఁదీసికొని కొంతదూరము షికారుతిరిగి సూర్యుడస్తమించు సమయమునకు సోమన్నగారి ప్రేరణమున నాతనివేశ్యయింటికిఁబోయిరి. అప్పుడావేశ్య లలంకరించుకొని తమలోఁ దామేమేమో చెప్పుకొనుచు నవ్వుచు గూరుచుండి వీరినిఁ జూచినతోడనే మిక్కిలి వినయభయభక్తులతో గౌరవించి సిగ్గునభినయించుచు నూరకుండిరి. పార్థసారథి వీరికిఁ బూర్వపరిచితుఁడును, స్నేహకోటిలోనివాఁడును గావున నాతఁడు వారితోఁ జనువున మాటలాడుచు వారిని గేలిసేయుచుఁ దన రసికత్వమును బ్రక

టింప మొదలుపెట్టెను. సోమన్నగారు దన గృహమేధిపదవిని విశదీకరింపు చుఁ దన గృహయాజమానత్వపదవి కుచితమగు రీతిని దన వేశ్యయొక్కయు, తన ముద్దుకొమాతెలయొక్కయు, గృహనిర్వాహకత్వమందలి నేమరితనమునకును, నజ్ఞానమునకును వగచుచు విసుగుకొనుచు, వారిని స్నేహభావముతో ప్రేమానురాగగర్భితములగు మాటలతో సాదించుచు, నాయింటనున్న కుర్చీలు బల్లలు మొదలగువానిని సవరించి శుభ్రపఱచి యుచితస్థలములయందు వానినునిచి దీపములను వెలిగించి పడకటింట్లనెల్ల యథోచితముగా నలంకరించి యిల్లంతయుఁ దిరుగుచు సంసారసంబంధమగు కార్యములనెల్ల మిక్కిలి శ్రద్ధతోఁ గర్తవ్యాకర్తవ్యభేదము నించుకైనఁ బాటింపకఁ జేయుచుండెను. శెట్టిగారికిని, బిళ్ళగారికిని, నావేశ్యలసంగీతమును వినవలయునని దృఢమైన కోరెక్కగలదు; కాని వారెన్నిపర్యాయములు సంగీతము వినవలయునని దమ యభిప్రాయములను ప్రకటించి సంగీతము పాడుమని వారినెన్నివిధములఁ గోరినను, వారు సిగ్గునభినయించుచు "సంగీతమును పాడెద" మని చెప్పుచుఁగాలయాపనముచేసిరేగాని, యించుకైనఁ బాడలేదు. నాయుఁడుగారికి వారితో ముచ్చటలాడుచు వారినిఁజూచి యానందించుచుఁ దన యోగ్యతనుగూర్చియుఁ, బ్రయోజకత్వమునుగూర్చియుఁ, జెప్పుకొనుచుఁ దనయశ్వ శిక్షానిపుణత్వమును గుణించియుఁ, దనకుఁ వ్యాయామ క్రీడలయందుఁగల యభినివేశమునుగూర్చియుఁ దాను చెన్నపట్టణమున వ్యాయామక్రీడలలో సంపాదించుకొనిన ప్రఖ్యాతిని గూర్చియు, ననేకవిధములుగా వర్ణించి చెప్పుచు, నావేశ్యలాడుమాటలను వినుచు వారిమొగములు చూచుచుండుటయే మహానందదాయకముగా నుండెను. మొదలియారుగారుఁ దాము చిన్నతనములో నింగ్లాండుదేశములో నున్న సమయమున నచ్చటఁ జూచిన వినోదములనుగూర్చియు, నాదేశమున సర్వస్వతంత్రతతోఁ బ్రవర్తించు స్త్రీలనుగూర్చియు, నాదేశమందలి నాగరికతావైభవమును గూర్చియుఁ, జిత్రకథలుగాఁ జెప్పుచు నావేశ్యలు దన్ను గేలిచేసి నర్మగర్భముగా మాటలాడుచున్నను దన్ను వారు గౌరవించినట్లే సంతసించుచు,

వారాడిన యప్రస్తుతవాక్యములకును, ననుచితాలాపములకును నెల్ల యనౌచిత్యభావముతో వారిమనసుల నించుకైన నొవ్వజేయకుండ నవ్వుచు బాగులు చెప్పుచు, సంతోషించుచుండెను. ఇట్లు రెండు మూడు గంటలకాలము వారాయింట గడపి రాత్రి తొమ్మిదిగంటలగుటచే నందఱు గలసి బయలువెడలి యెవరియిండ్లకు వారుపోయిరి. సోమన్నను మాత్రము దనకోమాతెఱల నిద్దఱకిని బిళ్ళగారికిని, నాయుడుగారికిని గట్టిపెట్టి వారిని దన మాయోపాయములచే వశవర్తులను జేసికొనవలయునన్న దృఢమైన యభిప్రాయము మాత్రము లేకపోలేదు. నాయుడుగారికిని, బిళ్ళగారికిని మాత్రము తమకుఁగల సంగీతాభినయాభిరుచిచేతను, దమ రసికతచేతను, నావేశ్యల సంగీతాభినయములను జెవులార విని కన్నులారఁ జూచి యానందింపవలయునను గోర్కె దప్ప మఱియొక యభిప్రాయము మాత్రము వారికిలేదని స్పష్టముగాఁ జెప్పకతప్పదు. శెట్టిగారు దాను సంగీతాభినయసముద్రుఁడనన్న మనోగర్వముగలవాఁడు గావున నావేశ్యల సంగీతము వినవలయుననియు, నభినయమును జూడవలయుననియుఁ, దన మనసులో నెంతకోర్కెయున్నను, నీశాస్త్రములయందు సంపూర్ణాభినివేశముగల ప్రజ్ఞావిధవలెఁ దనసంభాషణమునఁ దనకీరెండు శాస్త్రములయందును, గవిత్వమందును గల పాండిత్యమును విస్పష్టముగా బ్రకటీకృతమగునట్లు మాత్రము శ్లాఘించి చెప్పుకొనుచుఁ, దన యంతరంగమందలి యభిప్రాయమును మాత్రము చెప్పి వారిని పాడుమనిగాని, యభినయింపుమనిగాని, చెప్పక నావేశ్యల నీరెండుశాస్త్రములయందుఁ దనకు శిష్యప్రాయులగా గారవించుచు నానందించుచుండెను. గాని వారితో స్నేహసంబంధమును గలుగఁజేసికొనవలయు నన్న యభిప్రాయమాతనికి లేదు. మొదలియారుగారు వారితో మాటలాడుచు నవ్వుచు సంతోషముగాఁ గాలము గడపవలయునని మాత్రమిష్టము గలవారనుటకెంతమాత్రము సందియము లేదు.

ఇట్లీనలుగురు పెద్దమనుష్యులును సదభిప్రాయములతో సోమన్నగారి స్నేహపాత్రతను సంపాదించుచుఁ దమకాయనచేయు సత్కారములకాయన

యందు గౌరవవిశ్వాసములు గలిగి నిష్కల్మషులై సంచరించుచు, నమాయికులు గావున నాతనియంతరంగమునఁగల దురుద్దేశము నించుకయునఁ గ్రహింపఁజాలక నాతని యోగ్యునిగాఁ దలఁచి ప్రవర్తించుచు, నానాటికాతనియందుఁ దమకు విశ్వాసమును, నమ్మకమును నభివృద్ధినొందుచుండుటచే నాతనికి వశవర్తులై ప్రవర్తింపసాగిరి. బాయమ్మగారియందు వీరికి గౌరవమును, విశ్వాసమును దృఢముగా నంతరంగములయందు నాటియుండుటచే నామెను భూలోకసరస్వతిగా నిశ్చయించుకొని తాము సోమన్నతో నాతని వేశ్యయింటికిఁ బోయినసంగతి యామెకుఁ దెలియకుండ జాగరూకతతో నుండిరి. వేశ్యలిండ్లకుఁ బోవు పురుషులయందుఁ దామెట్టివారైనను వివాహితలైన కులాంగనలకు గౌరవముండుట యసంభవమని వీరు గ్రహింపఁగల యుచితజ్ఞులును, నపవాదులకు భయమందువారును, నాత్మగౌరవమును మిక్కిలి శ్రద్ధతోఁ గాపాడుకొని జనుల మన్ననలకు బాత్రులై కాలము గడపవలయునను కోరిక గలవారును, మానమర్యాదలను సంరక్షించుకొనఁ గలుగునట్లు ప్రవర్తించు యోగ్యశీలురును, గావునఁ దమ బుద్ధివిశేషమును, గార్యాచరణనిపుణత్వమును, ననుభవజ్ఞానమును, చతురత్వమును సంపూర్ణముగా వినియోగించుచు సోమన్న స్నేహమును, బాయమ్మకుఁ దమయందుఁగల సదభిప్రాయమును, గౌరవమును గాపాడుకొనఁగలుగునట్లు తాము మిక్కిలి జాగరూకతతోనుండిరి. సోమన్న వేశ్యాలోలుఁడనియు, మాయాశీలుఁడనియుఁ, గుత్సితుఁడనియు, దుర్మార్గానువర్తియనియు మోసకారియనియు, నవినీతుఁడనియుఁ, గల్యాణపురవాస్తవ్యులందఱకుఁ దెలిసియుండుటచే బాయమ్మగారి కీతనియందించుకైన గౌరవములేదు. బాయమ్మయందు సోమన్నకాంతరంగికద్వేషమును నీర్ష్యయు గలదని యిదివఱకే చెప్పఁబడియున్నది. సోమన్న మొదలియారు మొదలగు నీనలుగురికొఱకుఁ దనయింటికిఁ దఱచుగా వచ్చుచుండుట బాయమ్మ కంతగా నిష్టములేదు. ఈసంగతి బాయమ్మగారి మాటలవలన నించుకైన గ్రహింపజాలకుండిరి. కాని సోమన్నగారి మాటలను బట్టియు నాయనప్రసంగమును బట్టియు, దాము సోమన్నగారింట బసచే

సియున్న విషయమునుగూర్చినవ్వుచు నర్మగర్భముగానాడు మాటలనుబట్టియు హాస్యోక్తులను బట్టియు, సోమన్న గారికిని నాతనివేశ్యలకును బాయమ్మ గారి యందు సదభిప్రాయములేదని మాత్రముగ్రహించిరి. పూర్వాచారపరాయణత్వమున సోమన్నయుఁ గేవలమీర్ష్యచే నాతని వేశ్యలును బాయమ్మయందు లేని దుర్గుణములను గూడ నారోపణము చేసి యామెను నిష్కారణముగాఁ దూలనాడుచుండిరని వీరు దెలిసికొనగలిగినవారైనను సోమన్న గారి మనసు నొవ్వఁజేతుమని సందేహించుచు సోమన్న గారితోఁ దమకుఁగల స్నేహమును దలఁచియు, నాతఁడు దమయెడలఁ బ్రకటించుచున్న గౌరవవిశ్వాసములనుబట్టియు, నూరకుండి స్నేహభావముతోఁ బ్రవర్తించుచుండిరి. సోమన్న గారితో వీరికి స్నేహము హెచ్చినకొలది వీరాతనిమాట కెదురాడజాలక మోమోటముచే నాతఁడు చెప్పినట్లు వినుచుఁ నాతనికి వశవర్తులైయుండిరి. కాంతయ్యపాత్రుని మూలమున నాయూర వీరు సంపాదించిన స్నేహితులను బరిచితులను గ్రమక్రమముగాఁ గలసికొనుటమాని వీరునలుగురుఁ దమకాలమంతయు సోమన్న గారితోను పార్థసారధితోను గడపుచుఁ బార్థసారధి నాటకసమాజము వారాడు నాటకములను జూచుచు వ్యాపారరహితులై యుండిరి.

అంత నొకనాఁడు సోమన్న గారును బార్థసారధియు నీనలుగురు పెద్దమనుష్యులునుగూర్చుండి మాటలాడుకొనుచు సోమన్న గారి యింటనున్న సమయమున, మొదలియారుగారితోఁ దనయన్న కొమార్తెకు వివాహముచేయఁ దలఁచి వరాన్వేషణార్థము వచ్చితినని చెప్పిన బ్రాహ్మణుఁడు వచ్చెను. మొదలియారును నాతని స్నేహితులును నాతని నదివఱకే యెఱిఁగియున్నవారగుటచే నాతనిఁ గూర్చుండుమని చెప్పి యాతఁడాపట్టణమునకు వచ్చిన కార్యమునుగూర్చి సోమన్న గారితోఁ జెప్పెను. సోమన్న లౌకికధర్మములను వైదికధర్మములను జక్కఁగా నెఱిఁగిన వాఁడుగావున నాబ్రాహ్మణుని పేరును యింటిపేరును శాఖయు గోత్రమును నడిగి తెలిసికొని వరునిఁ గుదిర్చెదనని యాతనికి ధైర్యము చెప్పెను. తరువాత పార్థసారధియు సోమన్నయు నాలోచించి నాటక

సమాజముతో వచ్చిన కామయ్యయనువాని కాబ్రాహ్మణునికున్న కొమార్తె నిచ్చి వివాహము చేయించు టుచితమని నిశ్చయించిరి. పార్ధసారధి కీకామయ్యయందు మిక్కిలి యభిమానము గలదు. ఇతడు గొంచెము చదువను వ్రాయను నేర్చి నాటకులకు వంటచేయుట కానాటకసమాజముతో నాపట్టణమునకు వచ్చి వంటబ్రాహ్మణుఁడుగాఁ బనిచేయుచున్నను నప్పుడప్పుడు నాటకములలోఁ గొన్ని వేషములు గూడ వేయుచుండుటచే నాటకప్రయోగమునఁ దా నద్వితీయమైన నేర్పును బ్రజ్ఞయుఁ గలవాఁడనను నహంభావముతోఁ బ్రవర్తించుచుఁ బార్ధసారధి కాప్తుఁ డగుటచే నానాటకసమాజికు లందఱిలోఁ దానే ముఖ్యుఁడనను గర్వముగలిగి యుండెను. ఈకామయ్య మొదలియారుమొదలగు నీనలుగురికిని నింతకు పూర్వము గనిపించలేదు. వీరు పార్ధసారధి బసదిగియున్న యింటికివచ్చినప్పుడెల్ల నీకామయ్య మొగము దాచుకొని వీరికి గనుపించకుండ సంచరించుచుండుటచే నాతని వీరు చూచియుండలేదు. తరువాత సోమన్నయుఁ బార్ధసారధియు నాబ్రాహ్మణునితో వివాహవిషయమును గూర్చియుఁ, గన్యాశుల్కమును గూర్చియు, మాటలాడి కామన్న యోగ్యతనుగూర్చియు, రూపయౌవనసంపన్నతను గూర్చియుఁ, బ్రయోజకత్వమును గూర్చియు శ్లాఘించిరి. ఆమాటలకాబ్రాహ్మణుఁడు మిక్కిలి సంతోషించుచు సోమన్నగారు దనకుఁ జేయనిశ్చయించుకొనిన యుపకారమున కాయన కనేకకృతజ్ఞతాపూర్వకవందనము లర్పించి తన కార్యసంఘటనమంతయు మొదలియారుగారి యనుగ్రహమువలన గలిగినదనియుఁ దాను మొదలియారుగారి ముఖముఁ జూచినవేళ మంచిదనియు నాయనను, శెట్టిగారిని, బిళ్ళగారిని, నాయఁడుగారిని గొనియాడెను. "శుభస్యశీఘ్రమ" ను న్యాయమునుబట్టి కామన్నను బిలిపించి యాబ్రాహ్మణునకుఁ జూపించి యాకన్యను బిలచికొనిరమ్మని యాతనితోఁ జెప్పి వివాహము నిశ్చయించుటుచితమని శెట్టిగారు సెలవిచ్చిరి. పార్థసారధి కామన్నకొఱకు వర్తమానమంపెను. కన్యకను దీసికొనిరమ్మని సోమన్నగారా బ్రాహ్మణునితోఁ జెప్పి యాతని బంపిరి.

తరువాత నొకగంటకుఁ గామన్నయు, మొదలియారుగారికానాటిరాత్రి కనిపించిన బ్రాహ్మణుఁడును, వివాహార్థమాతఁడు దీసికొనివచ్చిన కన్యయు, నాకన్యతల్లియు, సోమన్నగారియింటికి వచ్చిరి. ప్రప్రథమమునఁ గామన్నను మొదలియారుగారానవాలు పట్టలేక పోయిరి గాని నాయుఁడుగారు మాత్రమానవాలు పట్టి "మిమ్ములను లోకలుఫండు సత్రములో నేను జూచినట్లున్నదే" యని చెప్పఁ దాను లోకలు ఫండుసత్రములో గుమాస్తాగానున్న సంగతి నిజమే యని యొప్పుకొని, యాసత్రమునసుండుట కిష్టములేక పార్థసారథిగారి బలవంతముపైన నాటకసమాజమువారితో వచ్చితిననియు, సత్రములో నుద్యోగము చేయుటవలన నించుకైన లాభములేకపోవు టయుండ లేనిపోనియల్లరియు నాయాసమును దుదకు బాపమును గూడ సంప్రాప్త మగుననియు, నందువలన నాయుద్యోగమును మానుకొని యింటికిఁ బోనిశ్చయించుకొని యున్న సమయమునఁ బార్థసారథిగారు దన్ను బలవంతముమీదఁ దమ నాటకసమాజముతోఁ దీసికొనివచ్చిరనియుఁ జెప్పెను. తరువాత మొదలియారుగారు గాపువాఁడును, నాతని గొమార్తెలును, ముత్యాలమ్మయు, క్షేమముగా నున్నారా! యని యడుగగా నందుకుఁ గామన్ననవ్వి "బాబూ! ఏమిచెప్పుమన్నారు; కాపువాఁడును ముత్యాలమ్మయుఁ బెద్దమనుష్యులని చెప్పకతప్పదు; కాని యాసత్రమునఁ బెద్దమనుష్యులు బసదిగినచో వారికి గౌరవహాని చేకూరకమాన" దని యేమేమో చెప్పవలసిన సంగతులుండియు నౌచిత్యమును బట్టి చెప్పకదా వినట్లు మాటలాడెను. మొదలియారుగారుమాత్రము కాపువాని యోగ్యతయు, ముత్యాలమ్మ మంచితనమును, నాకాపు కన్యకల యమాయికస్వభావమును, దలఁచికొని పాపపుణ్యము లెఱుఁగని యాకన్యకలు నిష్కారణముగా నపవాదపాలగుటకు మనసులో విచారమును బొందిరి. అంతఁ గామన్న నాబ్రాహ్మణునకుఁ జూపి యతని కాకన్యనిచ్చి వివాహముచేయు టుచితమని పార్థసారథియు సోమన్నగారును జెప్పిరి. ఆబ్రాహ్మణుఁడు దన వదినెగారిని బిలచి కామన్న నామెకును నామె కుమార్తెను కామన్నకును జూపించెను. తరువాత

నాబ్రాహ్మణుఁడును, నాతనివదినెయుఁ గొంచెము దూరముగాఁ బోయి యచట నేమేమో గుసగుసలాడి తిరిగివచ్చి "వివాహమునకుఁ గన్యాశుల్క మేమియిప్పించెద" రని యడిగిరి. కామన్న తాను ద్రవ్యహీనుఁడ ననియు నంతకుఁ బార్థసారథిగారే యున్నారనియుఁ జెప్పెను. అప్పుడు సోమన్నగారును బార్థసారథియుఁ గలసి యాబ్రాహ్మణునితోడను నాతని వదినెతోడను గన్యాశుల్కమునుగూర్చి బేరమాడ నారంభించిరి. వీరీవిధముగా బేరమాడుచుండ నాబ్రాహ్మణుఁడు దనకెంత కన్యాశుల్కము గావలయునని యెన్నిపర్యాయములడిగినను జెప్పక తన యన్నకొమారుని మెడలో నైదుజందెములు పడునట్లు చేయుఁడనిమాత్రము చెప్పసాగెను. అతని వదినెగారు కన్నీరుగార్చుచు "నాయనా! మాకెట్టియవస్థ తటస్థమగుటయే చాలును; నాకొమారుని వివాహముకొఱకీపని చేయఁబూనుకొనుటయేగాక కన్యాశుల్కమునుగూర్చి యింతకావలయునని కూడ నే మొగముపెట్టుకొని యడుగఁగలము. మాకు నోటమాటరాదు. నాకొమారుని మీకొమారునిగాఁ దలఁచుకొని యాతనికి వివాహమగునట్లు మాత్ర మనుగ్రహింపుఁడు. నాకొమారునకు సంబంధముగూడ వచ్చియున్నది. కుండమార్పులుగా వివాహముచేయుటకు మాపూర్వస్థితినిఁ బట్టి మాకుఁ జేతులురాక నీయవస్థకుఁ జాలుగావచ్చినది. త్వరలో దమరాలోచించి నాకొమారునకు వివాహమగునట్లనుగ్రహించి వెంటనే యీపిల్లకు వివాహముచేయించినయెడల మేమింటికిఁ బోయి నాకొమారునకు సంబంధము నిశ్చయపఱచుకొని సిద్ధమైనచోఁ దిరిగివచ్చి నాకొమారునికీయూరనే చదువుచెప్పించుకొనుచు మీపంచ నొకమూలఁ గాచుకొని త్రాగుచు మిమ్ములను గనిపెట్టుకొని యుందుము" అని యతిదీనముగా సోమన్నగారితోఁ జెప్పెను. సోమన్న తానీవివాహమును జేయించి యామెను దనయింట నుంచుకొని జీతమక్కఱలేకయే వంటలక్కగాఁ బనిచేయించుకొనవచ్చునని యూహించి "మీకొమారుని వివాహమునకేమి యడుగుచున్నా" రని యడిగెను. అందుకామె యేమిచెప్పుటకు నోరాడక మాటలాడ కూరకుండ నాబ్రాహ్మణుఁడు

నగలక్రిందను గన్యాశుల్కముక్రిందను వేయిరూపాయ లడుగుచున్నారనియు నంతకుఁ బైగా నొక వందరూపాయిలయిన నున్నఁగాని కార్యముగాదనియుఁ జెప్పెను. సోమన్న దాను స్వయముగా నొకగర్వమైన నిచ్చువాఁడును ని య్యఁదలఁచినవాఁడును గాకపోవుటచేతను నాతఁడెంతయడిగినను దనకించుక యిన బాధలేదుగావునను "బ్రాహ్మణులలో నంతకుఁదక్కువ మొత్తమునకు వి వాహమగుటయిదినములలో సాధ్యముగాదని చెప్పెను. పార్థసారథిమాత్రము కా మన్న యంతసొమ్మిచ్చుకొనఁజాలఁడనెను. కామన్న దాను నిర్ధనుఁడనియుఁ బార్థసారథివంటి పెద్దమనుష్యుల యనుగ్రహము దప్ప ద్రవ్యమించుకయు సం పాదించుకొనియుండలేదనియుఁ దనవివాహము దామే చేయించి పుణ్యముగ ట్టుకొనవలయుననియుఁ జెప్పెను. మొదలియారుగారా బ్రాహ్మణకన్యను గాం చియు నాకన్య తల్లి చెప్పిన దీనవాక్యములను వినియు నాబ్రాహ్మణుఁడు చెప్పి నమాటలనన్నిటినిఁ దన మనసులో నాలోచించియు వారి దురవస్థకు మిక్కిలి విచారించుచుఁ దన హృదయమందలి కరుణారసతరంగము లుప్పొంగ దారిద్ర్య మువలన సంభవించు కష్టములను నష్టమును బేదరికమువలన జనులు చేయవలసివచ్చె డు ననుచితకార్యములను నంతరంగమునఁ దలపోయుచుఁ దనహృదయమునఁ బొ డమిన దయారసమంతకంతకు వెల్లివిరిసి నేత్రాంచలమార్గమున నశ్రుక్రమ మునై పొఱఁజొచ్చి యామహామహుని దయామయత్వమును గరుణాంతరంగత యు జగద్విదితముసేయుచుండ మాటలాడ కూరకుండిరి. శెట్టిగారు వివాహ ములలోఁ గన్యాశుల్కములను వరశుల్కములను దీసికొనుట నీతిబాహ్యమైన యాచారమనియు, నట్టిదురాచారమును మనదేశమునుండి పాఱఁద్రోలుటయత్యా వశ్యకమయినను దారిద్ర్యకారణమునుబట్టి కన్యాశుల్కములు మాన్పించుట దు ర్ఘటమనియు, నీవిషయములో నాబ్రాహ్మణకన్యకకు గన్యాశుల్కము గొని వివాహముచేసినఁగాని యాకన్యయన్నకు వివాహముగాకుండెడి హేతువునుబ ట్టి యేమి చెప్పుటకును వీలులేదనియు నీదురాచారమును గ్రమక్రమముగా జ నులు మానుకొనునట్లు చేసినఁగాని దేశమునకు క్షేమమును నభివృద్ధియుఁ గలుగ

నేరదనియు నీదురాచారమునకు దారిద్ర్యముచేఁ బ్రేరేపింపఁబడిన ధనాశ ము ఖ్యకారణమనియుఁ జెప్పిరి. పిళ్ళగారికిని, నాయుఁడుగారికిని నా బ్రాహ్మణక న్యకను కామన్నవంటి మూర్ఖునకిచ్చి వివాహముచేయుట కిష్టముమాత్రము మనసులోలేదు. కాని యాకన్యను కామన్నకిచ్చి వివాహముచేయకుండ నివా రించినచో ధనాశచేఁ గన్యాశుల్కమునకాకన్యను విక్రయింప నిశ్చయించుకొని న దానితల్లియుఁ బినతండ్రియుఁ గామన్నకన్న నిర్భాగ్యుఁడును కాటికి గా ళ్ళుచాచుకొని యుండు నింకొక ముసలివానికి గట్టిపెట్టకుండఁ జేయనేరమని యుఁ, గామన్న విద్యాధికుఁడును, ధనవంతుఁడును, యోగ్యుఁడను నంతగా రూపవంతుఁడును గాకపోయినను శరీరదార్ఢ్యము గలవాఁడుగావున నావివా హవిషయములోఁ దామేమియు జోక్యము గలుగఁజేసికొనక యూరకుండుటే యుచితమనియు వీరు నిశ్చయించుకొనిరి. తరువాత సోమన్నగారు తనకార్య సాధనక్రియా నిపుణత్వమంతయు వినియోగపఱచి యెనిమిదివందల రూపా యలు కన్యాశుల్కముగా నిచ్చుటకును నామఱునాఁడే యాదికేశవస్వామి యాలయములో వివాహముచేయునట్లును నిశ్చయముచేసిరి. పార్థసారథి యు చితముగా రెండువందలరూపాయలును బదులుపూర్వకముగా మూఁడువందల రూపాయలును గామన్న వివాహార్థమిచ్చుటకు రెండునాటకములకు వచ్చు సొమ్మంతయుఁ గూడ నిచ్చి సహాయముచేయుటకును నొప్పుకొనెను. తక్కినసొ మ్ము కామన్న తనచేతినున్న బంగారుమురుగులను, మొలనున్న వెండిగోవత్రాడు ను నమ్మి యిచ్చెదననెను. అటుపైన నేమైనఁ గొదవపడినచో నాయూరనున్న తన పరిచితులును స్నేహితులును నగు గొప్పగృహస్థులవలనఁ జందాలమూలమున నిప్పించెదనని సోమన్నగారు చెప్పిరి. ఇట్లు వివాహమునకుఁ జేయవలసిన య త్నములన్నియు సోమన్నయుఁ, బార్థసారథియుఁ, గామన్నయుఁ జేసి యా మఱునాఁడు రాత్రి 9 గంటలకు వివాహముహూర్తమేర్పఱచిరి. మొదలియారు గారును నాయన స్నేహితులును వారుచేసిన యేర్పాటులన్నిటిని మనఃపూర్వ కముగా నామోదించినవారివలె నన్నిటికిఁ దలయూచుచు బాగుగానున్నదని

చెప్పుచునూరకుండిరి. కన్యాశుల్కములుగొని వివాహములు జరిగించుటకేసలుగు రికేని నెంతమాత్రము నిష్టములేకపోయినను, నట్టికార్యము నీతిబాహ్యమని వీరు స్పష్టముగా నెఱిఁగియున్నను వివాహకార్యమున కాటంకము గలుగఁజేయుట ఘోరపాతకమని శాస్త్రములుద్ఘోషించుచున్నవనియు నట్టిపాతకము మెడఁగ ట్టుకొనఁగూడదనియు శెట్టిగారును, గరుణాతిశ్యయత్వమున నోరాడక మొదలి యారుగారును, గామన్న కాకన్యనిచ్చి వివాహముచేయు టనుచితమన్న చో నాకన్య నంతకన్న నీచునకును ముసలివానికిని విక్రయించునన్న భయముచేఁ బిళ్ళగారును, నాయుఁడుగారును మాటాడకూరకుండిరి. అట్లుగానిచో సదా చారప్రవర్తకులును, సద్గుణగరిష్ఠులును, దేశోపకారకార్యదీక్షాపరతంత్రులును, దురాచారనిర్మూలనాయత్తచేతస్కులును, దయాసముద్రులును, ధర్మవిదులును నగు నీమహామహులాసమయమున నూరకుండుట తటస్థముకాదని చదువరులు నిశ్చయముగా విశ్వాసపూర్వకముగా నమ్మవలయును.

తరువాత సోమన్నగారియొద్దను, భాగ్యసారథియొద్దను సెలవుదీసికొని మొదలియారుగారును, శెట్టిగారును, బిళ్ళగారును నాయుఁడుగారును దమబ సకువచ్చి భోజనముచేసి వివాహములలోఁ గన్యాశుల్కములును వరశుల్కములు ను దీసికొను నాచారమతినీచమగు నీతిబాహ్యమైన దురాచారమనియు, వాని నున్మూలము గావించుటత్యావశ్యకమనియు, నట్టి యధర్మమును రూపుమాపుట కెంతప్రయత్నమునైన జేయవలయుననియుఁ దమలోఁదాము మాటలాడుకొను చుఁ జర్చింపసాగిరి. దరిద్రత యెంతటినీచకార్యమునైనఁ జేయించుననియు, నవివేకమువలన జనులకార్యములును జేయసాహసింతురనియు నవివేకమును న జ్ఞానమును మౌఢ్యమును బ్రబలియున్న మనదేశమున దారిద్ర్యహేతువునుబట్టి జనులుచితానుచితముల నించుకయినఁ బాటించుట కవకాశము గలుగకున్నదని యును వీరు నిశ్చయించిరి. ఈదురాచారము నాబ్రాహ్మణులలోను, వైశ్యులలో ను నెక్కువగాఁ గానిపించుచున్నను నన్నిజాతులయందునుఁగూడ బ్రబలియున్న దనుట కించుకయు సందియములేదని వీరు నలుగురు నెఱుఁగకపోలేదు. కాని

యీయీదురాచారముల నిర్మూలనము గావించుటకు సంఘదురాచారసంస్క-ర్తలు చేయు ప్రయత్నమంతగా సఫలములుగాకుండిన సంగతి నాలోచించి యీదురాచారమును బాఱఁద్రోలుటకుఁ జేయవలసిన యుచితప్రయత్నములను గూర్చి దూరాలోచనముచేసి కర్తవ్యమును నిశ్చయింపవలయునను గోరిక వీరికిప్పుడు దృఢముగాఁ గలిగినను ప్రస్తుతము దాముచేయఁదగినదేదియు లేకపోవుటచే నూరకుండవలసినవారైరి. బాయమ్మగారిసంగతియంతయు మొదలి యారుగారివలన విని కన్యాశుల్కమునకా కన్యనమ్మి వివాహముచేయుట ధర్మమనియు నట్టి నీతిబాహ్యమైన పనిచేయుటకన్న నాకన్య నింకొకజాతివానికైన నిచ్చి వివాహముచేయుటయుచితమనియుఁ జెప్పెను. అందుకు శెట్టిగారు మన శ్రీనివాసమునకా పిల్ల యీడుదగియున్నచో నాబ్రాహ్మణుఁడు కోరిన ద్రవ్యమిచ్చి యాకన్య నాతనికిచ్చి తాను స్వయముగా వివాహముచేయింతునని మిక్కిలి ధారాళముగాఁ బలికెను. అతిబాల్యవివాహములు దనకసమ్మతములనియుఁ దనకొమారుఁడు విద్యనేర్చి పెద్దవాఁడయినతరువాత నాతఁడు స్వయముగాఁ జూచి ప్రేమించిన కన్యనేగాని వివాహముచేసికొనుట తనకిష్టములేదనియుఁ, బ్రపంచజ్ఞానమించుకయినఁ దెలియక సంసారబాధ్యతను గొంచెమైన గ్రహింపఁజాలని చిన్నపిల్లలకు వివాహము చేయఁగూడదనియు వివాహమన్న నేమియో తెలియని బాల్యదశయందుఁ దన తల్లిదండ్రులు దనకు వివాహముచేయుటచే నతిబాల్యవివాహమువలన సంభవించు ననర్థములన్నియు దాను స్వయముగా ననుభవముచే నెఱిఁగినదానవనియు, నట్లతిబాల్యవివాహములవలన సంభవించెడి నష్టములనెల్లఁ జక్కఁగాఁ దెలిసిన తానెన్నఁడు నట్టి యకార్యము నాచరించి తనకొమారునకుఁ జిన్నతనమున వివాహముచేయ నిచ్చగించననియుఁ బలికెను. హిందువులలో రజస్వలావివాహములు చేసికొని సుఖముగాఁ గాలము గడపుకొనుట కవకాశముగల జాతులవారుగూడ బ్రాహ్మణుల యాచారమనుకరించి యతిబాల్యవివాహము లాచరించి తామట్టివివాహములవలన సంభవించు ననర్థముల ననుభవించుచు సంఘమునకు హాని కలుగజేయు

చున్నారనియుఁ దమజాతియందు రజస్వలావివాహములు చేయువాడుక గలిగియున్నను దమ జాతి బ్రాహ్మణవర్ణముతో సమానమైన యత్యుత్కృష్టమైనదని జగద్విదితముచేసి తమజాతికి గౌరవము దెచ్చిపెట్టుకొనవలయునని యెంచి తన స్వశాఖవారగు శిష్టగణములు గూడ నీయకార్యము నాచరించుచున్నారనియుఁ దనతల్లిదండ్రులు దమజాతికిలేని గౌరవమును నుత్కృష్టతయుఁ గల్పింపనెంచి తనగొంతుగోసి యిట్టియకార్యమును జేసిరనియుఁ బ్రాహ్మణేతర జాతులవారైన నీయతిబాల్యవివాహము లింతటితో మాని మనదేశమున కభివృద్ధియు క్షేమమునుఁ గలుగఁ జేయవలయుననియుఁ బాయమ్మగారు చెప్పి యతిబాల్యవివాహములు దూష్యములనియు నశాస్త్రీయములనియుఁ బాపహేతుభూతములనియుఁ దానువ్రాసిన వ్యాసములనుగూర్చియు పద్యములనుగూర్చియుఁ దానతిబాల్యవివాహములు మాన్పించుటకుఁ జేయుచున్న ప్రయత్నములనుగూర్చియు వారికిఁ దెలిపెను. ఇట్లు వీరతిబాల్యవివాహములు దూష్యములనియుఁ గన్యాశుల్కములును వరశుల్కములును నపేక్షించి వివాహముచేయుట ధర్మబాహ్యమును బాపహేతువును నైన కార్యమనియుఁ గొంత వఱకుఁ జర్చించి మాటలాడిరి.

పార్థసారథి కామన్న వివాహమునకుఁ జేయవలసిన ప్రయత్నములన్నియుఁ జేయుచుండెను. కామన్న చేతి బంగారుమురుగులను మొలనున్న వెండిమొలత్రాడును విక్రయమునకు దీసికొని యవియమ్ముటవలన రెండువందల రూపాయల కన్న నెక్కువ రాకపోవుట చేతను దానిచ్చెదనని సోమన్నగారి యెదుటను వీరవల్లియూరు మొదలగువారి యెదుటను నతిభారాళముగా వాగ్దానము జేసిన రెండువందల రూపాయల బహుమానమును మూడువందల రూపాయల బదులును నియ్యవలసివచ్చుటచేఁ బార్థసారథియుఁ దోచక తనయొద్ద ధనముంచుకయుఁ లేకపోవుటచేఁ నాతఁడు సోమన్నగారియొద్ద నీసొమ్ము బదులుతీసికొనవలయునని నిశ్చయించుకొనెను. సోమన్న వివాహప్రయత్నము నత్యుత్సాహముతోఁ జేయించి యీకార్యమంతయుఁ దానేచేయించుచున్నట్లును

డా నేయీశుభకార్యమునకు ముఖ్యుఁడననియుఁ జెప్పుకొనుచు లేనియాజమాన్యమును దెచ్చిపెట్టుకొని మిక్కిలి యహంభావముతో నుండెను. కానితనమఱఁదలిని కొమార్తెలను శెట్టిగారికిని, బిళ్ళగారికిని, నాయుడుగారికిని గట్టిపెట్టి వారిని దనకు వశవర్తులనుగాఁ జేసికొనఁ గలుగు నుపాయముల నన్వేషించుచు సోమన్నగారించుకయును మనశ్శాంతియు, సంతుష్టియులేక తన దురుద్దేశమును నెరవేర్చుకొనుట కుపాయముల నన్వేషించుచుండెను.

అంతఁ బార్థసారథి సోమన్నగారి యింటికివచ్చి కామన్నమురుగులును మొలత్రాడును రెండువందల రూపాయలకన్న నెక్కువ కమ్ముడుగావనియుఁ, దక్కిన యాఱువందల రూపాయలును బ్రస్తుతము దనయొద్ద లేకపోవుటచే బదులు చేయవలసి వచ్చినదనియు, నీశుభకార్యమున కాటంకము గలుగకుండ నామొత్తముఁ దనకు బదులుపూర్వకముగా నిప్పించుమనియుఁ గోరెను. తానొకరియొద్ద సందర్భానుసారముగా నుపాయభేదములచే ధనము గ్రహించుటయేగాని యొకరుచితముగాఁగాని బదులుగాఁగాని యెన్నఁడు సొమ్మిచ్చునలవాటు లేనివాఁడు గావునను, తనజన్మమెత్తినదాది స్వలాభములేక యెట్టి యల్పకార్యమునైనఁ జేసియుండనివాఁడును, మంచిమాటలచేతను దనవాక్పుణ్యముచేతను, జనులనుసంతుష్టిపఱచి యఱచేతిలో స్వర్గమునుఁ గనఁబఱచుచుఁ, బరోపకారివలెను, గొప్పదాతవలెను, నటింపఁగల ప్రజ్ఞానిధియుఁ గావునఁ దనయొద్దఁ బ్రస్తుతము సొమ్ములేదనియు, నంతకుఁబూర్వము రెండుదినములక్రిందటనే యొకరికి బదులిచ్చితిననియు, నాబదులిచ్చుటకుఁ గొంత చేబదులుఁగూడ దీసికొని రావలసివచ్చెననియు ననేకవిధములగు కారణములను గల్పించిచెప్పి తనకుఁ బార్థసారథియందుఁగల ప్రాణతుల్యమైన మిత్రత్వమును జరగఁబోవు వివాహకార్యమునకుఁ గావలసిన ధనసహాయముయొక్క యావశ్యకతయుఁ దలఁచి తానీవిధముగాఁ జెప్పుచు సమయమున కక్కఱరాకపోయినందుకుఁ దనకే సిగ్గుగానున్నదనియు విచారము నభినయించుచుఁ బార్థసారథితోఁ జెప్పిరి. తరువాత మీకీసహాయము చేసి నాగౌరవము దక్కించక తప్పదని పార్థసారథి

యు నీశుభకార్యమును జేయించి పుణ్యము గట్టుకొనక తప్పదని కామయ్యా యు సోమన్నగారి చేతులును గాళ్ళును బట్టుకొని బతిమాలెను. ఇట్లు సోమన్నగారిని పార్థసారథియుఁ గామన్నయు ననేకవిధములఁ బ్రార్థించుచు నేవిధముగానైన నాలువందలరూపాయలు ఋణము సమకూర్చి పీఁటమీఁదికార్యము చెడిపోకుండఁ జేయక తప్పదని బలవంతపెట్టిరి. కన్యాశుల్కము వివాహానంతరము నెమ్మదిమీఁద నిచ్చెదమన్నచో నాబ్రాహ్మణుఁడు సమ్మతింపఁడు. ఈమొత్తమునకుఁ బ్రామిసరీనోటుగాని దస్తావేజుగాని వ్రాసియిత్తుమన్నచో నాబ్రాహ్మణుఁడిదియంతయుఁ దన్ను మోసముచేయుటకుఁ జేసినప్రయత్నమని యనుమానపడకమానఁడు. అతనితో నీమాటలు చెప్పినచోఁ గార్యము చెడినను జెడవచ్చును, ఇంతియగాక నీసంగతియితరులకు దెలిసినచోఁ దామిచ్చెదమన్న కన్యాశుల్కముకన్న నెక్కువ యిచ్చెదమని యాకన్య నింకెవ్వరైనఁ బెండ్లాడి కామన్నకుఁ బెండ్లిగాకుండఁ జేసినను చేయఁగలరు. కాఁబట్టి "శుభస్యశీఘ్రమ్ము" ని పెద్దలాడుమాటనుబట్టి యీశుభకార్యమాపు టుచితముగాదు. సోమన్నగారొక గవ్వయైన బదులుపూర్వకముగానైన నిచ్చుటకంగీకరించలేదు. పార్థసారథికాయూర నెన్నివిధముల నెంతదూరమాలోచించినను ధనసహాయముఁ జేయువారుగాని బదులిచ్చువారుగాని గనుపించలేదు. ఇట్టిస్థితియందుఁ బార్థసారథి మనసును, గామన్న హృదయమును నల్లకల్లోలముగా నుండెననుట కాశ్చర్యము లేదుగదా! తరువాతఁ బార్థసారథి యాయూరిలో నెవరిచేతనైనఁ దనకు బదులిప్పించుమని సోమన్న నడిగెను. అందుకుసోమన్న తానొకగవ్వయైన నితరులయొద్ద బదులుపుచ్చుకొననని యుఁ, ద్రవ్యము కొఱకితరుల నాశ్రయించుట తనపనికాదనియుఁ దానెంతధనవంతులతో స్నేహసంబంధము గలిగియున్నను వారినెన్నఁడును నొకగవ్వయైన బదులుగానైన యడిగి పుచ్చుకొనకుండఁ గాలముగడపుచుఁ దనమానుషమును, నాత్మగౌరవమును, గాపాడుకొనుచుఁ బ్రవర్తించుచుండుటచేతనే తనమర్యాదను దానుగాపాడుకొని యాయూరను చితముగాఁ గాలముగడుపుచున్నాన

నియుఁ, దాను ధనవంతుఁడయినను, గాకపోయినను జన్మమెత్తి యెన్నఁడు నితరులయొద్ద ఋణముచేసి యుండకపోవుటఁబట్టి ధనికునిగానే బరిగణింపఁబడుచున్న హేతువుచేఁ దానితరులయొద్ద ఋణమైన నడుగుట క్లిష్టములేదని యుఁ బార్థసారథితోఁ జెప్పెను.

తరువాతఁ బార్థసారథియుఁ, గామన్నయు, మొదలియారు మొదలగు నీనలుగురు పెద్దమనుష్యులును బసదిగియున్న బాయమ్మగారి యింటికివచ్చి మొదలియారుగారినిఁ బిలచుకొని సోమన్నయింటికి వచ్చిరి. పార్థసారథియు, గామన్నయు, నీసంగతంతయు మొదలియారుగారితోఁ జెప్పి తాముఁదలపెట్టిన వివాహకార్యమున కాటంకము వచ్చినదనిరి. కామన్న సోమన్నగారిని, మొదలియారుగారిని, ననేకవిధముల నతిదీనముగాఁ బ్రార్థింపనారంభించెను. తనకెక్కుడనైన నారువందల రూపాయలు బదులిప్పించినచోఁ దిరిగి నాలుగైదుదినములలోఁ దనయింటివద్దనుంచి సొమ్ముదెప్పించి యడిగిన వడ్డీతో నిచ్చివేతునని యతిధారాళముగా ననేకపర్యాయములు చెప్పెను. పార్థసారథియొద్ద ద్రవ్యమించుకయు లేదనియు, నాతఁడింటియొద్దఁ దనవారికి వ్రాసినను, నెవరికివ్రాసినను నాతనినమ్మి యొకగవ్వయైన నెవ్వరిచ్చువారు లేరనియు, నాతఁడు బదులుపూర్వకముగాఁ బుచ్చుకొనిన సొమ్ము దిఱిగియిచ్చిన పాపము నిదివఱకెన్నఁడు గట్టుకొనని సచ్ఛీలుఁడనియు, మొదలియారుగారి కించుకయు దెలియకపోయినను సోమన్నగారికిమాత్రము జక్కఁగాఁ దెలియునని చెప్పుట కెంతమాత్రమును సందియములేదు. కాని సోమన్నగారికిఁ బార్థసారథికేవిధముగానైన నీయారువందలరూపాయిల బదులును సమకూర్చి కామన్న వివాహముచేయించవలయునని మాత్రము కోరికగలదని మనము ముఖ్యముగాఁ జెప్పవలసియున్నది. కామన్న యతిదీనత్వముతోఁ బలుకుమాటలనుబట్టియుఁ, బార్థసారథివంటి స్నేహితుఁడు సహాయార్థము ప్రార్థనాపూర్వకముగాఁ జెప్పుచున్న సంగతినిబట్టియు, వారుచేయఁదలపెట్టిన శుభకార్యము నెంచియు, దయాసముద్రుఁడును, స్నేహపాత్రుఁడును, పరోపకారపారీణుఁడును, మిక్కి-

లి మోమోటముగలవాఁడును, స్వాశ్రితపక్షపాతియు, నడిగినది లేదని చెప్పఁగల మనోధైర్యములేనివాఁడును, గావున నేమిచేయుటకును దోఁచక యూరకుండెను. కన్యాశుల్కముగొని చేయు నీవివాహమునకుఁ దాను సహాయముచేసి పాపము గట్టుకొనుటకొకవంకనుఁ బార్థసారథివంటి స్నేహితున కట్టిసమయమున నంతటి స్వల్పసహాయమును జేయకుండ స్నేహధర్మము నించుకయినఁ బాటింపకుండఁ గేవలము స్వార్థబుద్ధిచేఁ జేతగానివానివలె నూరకుండుటకొకవంకను దనయంతరాత్మ దన్ను బాధించుచుండఁ బరోపకారపరాయణత్వమే పరమధర్మమని నిశ్చయముగాఁ ద్రికరణశుద్ధిగా నమ్మిన సద్గుణగరిష్ఠుఁడగు నామొదలియారుగారిహృదయధర్మమప్పుడెట్లుండెనో చదువరులే గ్రహించుకొనవలయును.

అంత వీనలుగురును గామన్న వివాహార్థ మివ్వవలసిన యారువందల రూపాయీలను సముకూర్చు విషయమునుగూర్చి యాలోచించుచు ఋణము సంపాదించు సాధనములను గూర్చియు, మార్గములనుగూర్చియు నన్వేషింపుచు గొంతకాలము గడపి యితరులయొద్ద నాయూర బదులుచేయుట దమకు గౌరవహానియనియుఁ, దమవంటి యూర్జితమెఱిగిన గృహస్థుల కుచితముగాదనియు నిశ్చయించిరి. కాని కామన్న వివాహమునకు ద్రవ్యలోపమున నాటంకము గలుగుటకును నాశుభకార్యమునకు భంగము గలుగుటకును స్వలాభాపేక్షితుఁడగు గామన్నకటుండఁ దక్కినవారికిఁగూడ నించుకయిన నిష్టములేదని మనము స్పష్టముగా నొప్పుకొనక తప్పదు. అట్టిసమయమునఁ బార్థసారథికిని గామన్నకును సోమన్నగారు దప్ప సహాయముచేయువారెవ్వరును గనుపించకుండిరి. తన్నెంత బ్రతిమాలినను నెంతదీనతతోఁ గామన్న గాళ్ళుబట్టుకొని ప్రార్థించినను సోమన్న యితరులయొద్దనైన బదులుపూర్వకముగా నొకగవ్వయైన నిప్పించుటకు సహాయపడకుండెను. కామన్న దీనత్వమును బార్థసారథి కార్యాతురతయుఁ జూచియు, వివాహమువంటి యత్యుత్కృష్టమును నిహపరసాధనమును నగు శుభకార్యమున కాటంకము గలుగనున్నదని గ్రహించియు, మొదలియారుగారు మిక్కిలి జాలిపడి తానుగూడ నేవిధముగానైన

నాయూరన్న దనపరిచితులలో నెవరియొద్దనైన ఋణమిప్పించక తప్పదని సోమన్నగారిని యనేకవిధములుగాఁ బ్రతిమాలెను. అప్పుడు సోమన్న దూరమాలోచించి బంగారపువస్తువులను దీసికొని రాగలిగినచో నవి కుదువబెట్టి సొమ్ముదీసికొని వత్తుననియు, నావస్తువులనైన నతిరహస్యముగాఁ దనకు నమ్మకమైన స్థలమున నతిగోప్యముగా నుంచి బదులు తీసికొనిరావలయునుగాని యట్లుగాకపోయినచోఁ దన కాయూరగల గౌరవమునకును బరపతికిని భంగము గలుగుననియుఁ, జెప్పెను. పార్థసారథియొద్ద నాటకప్రయోగమునకుఁ గావలసిన తెఱలును, దుస్తులును, నితరసామగ్రియుఁ దక్క గొదువపెట్టఁదగిన వస్తువులేమియు లేవు. కామన్నయొద్దనున్న వెండి బంగారపువస్తువులు రెండును నమ్మివేయుటకిదివఱకే నిశ్చయింపఁబడినవి. ఇట్టిస్థితియందుఁ దమకేయుపాయమును దోఁచక పార్థసారథియు మిక్కిలి తొట్రుపాటుతోఁ గామన్న సోమన్నయుగారిని మిక్కిలి దీనత్వముతోఁ బ్రతిమాలుకొనుచుఁ బ్రార్థింపనారంభించిరి. అప్పుడుపార్థసారథితోఁ దనకుఁగల స్నేహభావమును గార్యావసరమునుదలఁచి, యాపద్బాంధవుఁడును, దయాసముద్రుఁడును, బరోపకారపారీణుఁడును నగు మొదలియారు వివాహకార్యమునకు భంగము గలుగకుండఁ జేసిన పుణ్యాము దనకరతలామలకముగా నుండునట్టి యలభ్యయోగమగు నదృష్టమును బొందకుండుట కేవలమవివేకలక్షణమును మూర్ఖత్వసూచనమును స్వార్థత్వప్రకటనమును నని తన బుద్ధిబలముచే నిముసములో గ్రహించి వారముదినములలోఁ దిరిగి తనవస్తువులు దనకియ్యగలిగినచోఁ దనచెవులనున్న వజ్రములతోఁగట్టబడిన యంటుజోడు నిచ్చెదనని చెప్పెను. సోమన్నగారు మొదలియారుగారి యౌదార్యమును, బరోపకారబుద్ధిని, స్నేహమును జాలమారము గొనియాడిరి. పార్థసారథి మొదలియారుగారితోఁ దుల్యమైన స్నేహితుని దానెన్నఁడును జూడలేదనియు నట్టి యాపద్బాంధవుఁడగు ప్రాణమిత్రుఁడు దనకులభించుట కేవలము దైవయోగమువలన గలిగిన మహాభాగ్యమనియుఁ జెప్పి, యాతనికిఁ గృతజ్ఞతాపూర్వకవందనము లనేకములర్పించి, యాతని సద్గుణముల ననేకవిధములుగాఁ

గొనియాడెను. కామన్న సంతోషమింతింతని చెప్పశక్యమేకాదు. ఆతఁడు మొదలియారుగారి రెండుపాదములు బట్టుకొని తనయందు నిర్హేతుకజాయమానకటాక్షముతోఁ గేవలము పరోపకారబుద్ధితో నామహాపురుషుఁడు దనకుఁ జేయసాహసించిన మహోపకారమునకుఁ గృతజ్ఞతాపారవశ్యమున నొడలెఱుంగకఁ దనయంతరంగస్థితమగు కృతజ్ఞతాభావమును నుచితమగుదానికన్న నెక్కువగాఁ గనపఱచుచు నాసమయమున నాతఁడు మితముదప్పి ప్రవర్తించిన కారణముచేతనో, మొదలియారట్లు కామన్న దన కృతజ్ఞతాప్రకటనము జేయుటకంగీకరింపకఁ దనయుద్దేశమును మాటలచేతను జేష్టలచేతను నివారింపఁజేయు సాధనముల గారణముననో, మనము స్పష్టముగాఁ జెప్పలేముగాని సోమన్నగారి వీధిచావడిలో గుర్చీమీదనున్న యీయుదారసాహసచక్రవర్తి యొకటిరెండు నిముసములలోఁ గ్రిందకు దయచేసి, యింత పరోపకారము నాచరించిన హేతువుచేఁ దనయంతరాత్మకుఁ గలిగిన సంతుష్టివలనను శాంతిమూలమునను బొందిన సౌఖ్యమును జగద్విదితము చేయుటకోయన వెల్లగిలఁబడి విశ్రాంతిఁ జెందెను. అంత నీమహాపురుషుడీవిధముగా దీర్ఘకాలము విశ్రాంతి జెందుచున్నచోఁ బరోపకారమపుగంటునని యెంచి సోమన్నయుఁ బార్థసారథియుఁ జెరియొకచెయ్యిఁ బట్టుకొని నెమ్మదిగాఁ దమ బలమంతయు వినియోగపఱచి యుచితాసనముపైఁ గూర్చుండబెట్టిరి. కాని శాంతస్వభావుఁడగు మొదలియారు దన్నావిధముగా విశ్రాంతి జెందకుండఁ జేసినందుకు వారిపై నించుకయిన విసుగుజెందకఁ దానుచేసిన సత్కార్యమువలనఁ దన యంతరాత్మకు గలిగిన సంతుష్టిని మహానందమును మందహాసముచేఁ బ్రకటించి యనిత్యమగు దనశరీరమునకు సంభవించిన యాయాసమును నించుకయిన లక్ష్యముచేయలేదు. తరువాత మొదలియారుగారు గొదువబెట్టుకొఱకిచ్చెదనని వాగ్దానముచేసిన యంటుజోడువలన నారువందల రూపాయిలవఱకు ఋణము లభింపదని సోమన్నగారు చెప్పిరి. తానుచేయ వాగ్దానముచేసిన సహాయము గొఱతపడి యసంపూర్ణముగానుండుటకును, గార్యావసరమునకుఁ జాలియుండక పోవుటచే

నిష్ప్రయోజనముగాఁ బరిణమించుటకును, మొదలియారుగారి కించుకయిన నిష్ట ములేకఁ దనస్నేహితులగు నాయుఁడుగారియొద్దను, బిళ్ళెగారియొద్దను, శెట్టి గారియొద్దను నున్న వస్తువులను గూడనిప్పింతునని యాయనచెప్పిరి. మహాపురు షులు దాముచేయఁ దలపెట్టిన యుపకారములనెన్నఁటికిని యసంపూర్ణముగను నసంతుష్టికరముగను నర్ధామోదకరముగను జేయరుగదా! తాముదలపెట్టిన కా ర్యములకెట్టివిఘ్నములును నాటంకములును దటస్థించినను నెట్టిశ్రమప్రయాస లకైననోర్చి నిర్వహించుట సాహసౌదార్యచేతస్కులగు సత్కార్య దీక్షాపరు లకుసహజలక్షణమనుట కించుకయు సందియములేదు.

తరువాత మొదలియారుగారు పార్థసారథిని దీసికొని బసకువచ్చి తన స్నేహితులతోఁ జెప్పవలసినరీతినిఁ జెప్పి వారినొప్పించి నాయుఁడుగారి చె వులనున్న వజ్రపుటంటుజోడును, శెట్టిగారిచేతినున్న బంగారు గొలుసులను, బి ళ్ళెగారియొద్దనున్న యుంగరములను దీసికొని కార్యసానుకూల మొనర్పఁగలిఁగి న కారణమువలనఁ దనయంతరాత్మకప్పుడు గొప్పసంతుష్టియు, నానందమునుఁ గలుగఁ, బార్థసారథి దనకు వారుచేసిన మహోపకారమునకుఁ దన కృతజ్ఞతా పూర్వకవందనములనైన నర్పించుట కించుకయిన నవకాశము గలుగకుండ మి క్కిలి సంతోషముతో నాతనిచెయ్యి పట్టుకొని పరుగుపరుగున సోమన్నగారి యింటికిఁ దిరిగివచ్చెను. సోమన్నగారి వస్తువుల నన్నిఁటినిఁ దీసికొని వాటినిఁ దనవేశ్యయొద్ద గొదువఁబెట్టిన యెడల నీవ్యవహార మతిగోప్యముగా నుండునని యు, లేనిపక్షమునఁ దనకటుండ నింతపరోపకారబుద్ధితో బార్థసారథియందు దమకుఁగల స్నేహభావమును బరిగణించి చేసినసహాయమున కట్టిమహాపురుషుల కుఁగూడ గౌరవహాని దప్పకఁ జేకూరుననియు, వారము పదిదినముల వ్యవహా ర మితరులకుఁ దెలియునట్లు చేయుటుచితముగాదనియుఁ జెప్పెను. పార్థసార థియుఁ, గామన్నయుఁ, గార్యావసరములనుబట్టి యత్యాతురతతోఁ గన్యాశు ల్కమునకుఁ గొఱఁతపడిన సొమ్మేవిధముగానైన సమకూర్పవలయునన్న యా తురతచేతను, మొదలియారు పార్థసారథికి సహాయమొసఁగి తనస్నేహపాత్రతను

బోపకారబుద్ధిని బ్రకటీకృతము చేయవలయునన్న యభిప్రాయముచేతను, సోమన్న చెప్పిన సలహాయొక్క యుచితానుచితముల నించుకైన గ్రహింపలేదు. తరువాత సోమన్న గారీవస్తువుల నన్నిటిని దీసికొని తనవేశ్యయింటికిఁ బోయి మఱల దిరిగివచ్చి దానియొద్దగూడ సొమ్ము సిద్ధముగా లేకపోవుటచేఁ గార్యావసరమునుబట్టి నేను శుక్రవారమని వాళ్ళెంతసంశయించినను బలవంతముమీఁద మఱియొక యింటికిఁ బంపి సొమ్ము దెప్పించుట కేర్పఱచి వచ్చితినని చెప్పి వారితో మాటలాడుచు గూరుచుండెను. సోమన్న రెండుమూడు పర్యాయములు త్వరగా సొమ్ముదీసికొనిరమ్మని తనసేవకులను బంపినను రెండుగంటలవఱకు నావేశ్యయింటనుండి సొమ్మురాలేదు. ఈరెండుగంటలకాలములోపలను పార్థసారథియు గామన్నయు మిక్కిలి యాతురతతో నిముసమొక యేడుగాఁ గడపిరి. మొదలియారుగూడ సొమ్మువచ్చినతోడనే బసకుఁ బోవలయునని వేచియుండెను. సోమన్న మాత్రము పొడుముపీల్చుచు స్వస్థచిత్తతతో నవ్వుచుఁదనకాపట్టణమునఁగల గౌరవమునుగూర్చియుఁ, దనయోగ్యతనుగూర్చియుఁ, దనవేశ్యయొక్కయు చిత్రప్రవర్తనమునుగూర్చియు, మర్యాదనుగూర్చియుఁ, దనకొమార్తెల యమాయికవ్యాపారమునుగూర్చియుఁ, జెప్పుచుఁ దనకాపట్టణమునగల యాప్తులలో నెంతెంతధనవంతు లెందఱెందఱున్నను దానెన్నఁడును వారి నొక తృణమైన నుచితముగాఁగాని ఋణముగాగాని యడిగి పుచ్చుకొనవ యుండుటఁ బట్టి దానట్టిగౌరవమును, మర్యాదయు, బరపతియు గలిగియుంటినని చెప్పెను. సోమన్న యుచితముగాగాని, ఋణముగాగాని యెన్నఁడును నెవ్వరియొద్దను నొకదృణమైనఁ బుచ్చుకొనలేదని చెప్పినమాట వాస్తవమని మనమొప్పుకొనక తప్పదు. ఏలన; నాతఁడు చోరశిఖామణియుఁ జోరులకు గురువును, మాయోపాయము లనేకముగాఁ బన్ని ధనము గ్రహింపఁగల నిపుణత్వముగలవాఁడును వైదికతంత్రములలోఁ దన గ్రామపౌరోహిత్యపదవిని బట్టి ఫలాపేక్షచే నాపురవాస్తవ్యులచే నర్పింపఁబడిన ధనమునుమాత్రమే గ్రహించుచుండును గావునను దానడుగవలసిన యవసరములేకయే నితరులయొద్ద నీతఁడు

వైదికలౌకికతంత్రములచే నుభయమార్గములుగను దన నిపుణత్వమంతయు విని యోగపఱిచి యనేకోపాయములచే ద్రవ్యమార్జింపఁగల గొప్పప్రయోజకుఁడే నిమననొప్పుకొనక తప్పదుకావున నీతఁడు చెప్పినమాట వాస్తవమనియు యథార్థమనియుఁ జెప్పవలసియున్నది.

ఇట్లు వీరు నలుగురు మాటలాడుకొనుచు దాదాపు రెండుగంటలకాలము గడచినతరువాత సోమన్నగారి వేశ్యయింటియొద్దనుండి యొకడు రూపాయిలు దీసికొనివచ్చి సోమన్నగారికిచ్చెను. సోమన్నగారా రూపాయిలు లెక్కపెట్టి మొదలియారుగారి కొప్పగించిరి. మొదలియారా యారువందల రూపాయిలును పార్థసారథికిచ్చెను. పార్థసారథి యారూపాయిలు దీసికొని మొదలియారు దనకుఁజేసిన సహాయమునకును నాతని స్నేహపాత్రతకును బరోపకారబుద్ధికిని నాతని ననేకవిధములు గొనియాడి వారము పదిదినముల లోఁ దిరిగి యారూపాయిలు సోమన్నగారి వేశ్యకిచ్చి కుదువపెట్టిన వస్తువులను మొదలియారుగారి కిచ్చివేతునని వాగ్దానముచేసెను. కామన్న, మొదలియారుగారు దన వివాహవిషయమై చేసిన మహోపకారమునకాయనను మిక్కిలి శ్లాఘించి తన్నొక యింటివానిఁగాఁజేసి కృతజ్ఞతాపాశబద్ధునిగాఁ జేసినందులకాయన పాదములుబట్టుకొని యాయన దనకు చేసిన యుపకారమునకుఁ దాను ప్రత్యుపకార మాచరించుటకుఁ సమర్థుఁడు గాకపోయినను దన వంశమున్నంతవఱకుఁ బిల్లపిల్లతరముగా విశ్వాసము గలిగియుందునని చెప్పి, పార్థసారథియు సోమన్నయుఁ దనకొనర్చిన మహోపకారమునకు వారిని శ్లాఘించెను. తరువాత మొదలియారుగారును పార్థసారథియుఁ దమతమ బసలకుఁ బోయిరి. సోమన్నగారు వివాహమునకుఁ గావలసినవన్నియు సమకూర్చి సిద్ధముగానుంచెదననియు నామరునాడు తప్పక వివాహముచేయుట కించుకైన నాటంకముండదనియుఁ జెప్పెను. కామన్న దనకృతజ్ఞత పట్టజాలకఁ బరుగుపరుగున సోమన్నగారి వేశ్యయింటికిఁ బోయి సమయమునకు రూపాయిలిచ్చి కార్యావసరము గడపినందులకావేశ్యను నామె కొమార్తె

లకు, మిక్కిలి శ్లాఘించి పార్థసారథి బసకువచ్చి, యాతనితో వివాహప్రయత్నములను గూర్చి చెప్పి, మధ్యాహ్నము నాలుగుగంటలకు సోమన్నగారి బసకుఁ దాను వివాహమాడ నిశ్చయించుకొన్న కన్యను నాకన్య పినతండ్రినిఁ దల్లిని దీసికొనివచ్చెదనని చెప్పి వారు బసదిగియున్న యింటికిఁబోయెను. కన్యాశుల్కముగా నిచ్చుటకొప్పుకొనిన యెనిమిదివందలరూపాయిలును సిద్ధముగా నున్నవనియు, నామఱునాడు దప్పక నాదికేశవస్వామి యాలయమున వివాహము నిశ్చయింపఁబడినదనియు, వారితోఁ జెప్పెను. ఆబ్రాహ్మణుఁడామాట విని మిక్కిలి సంతోషించి తన యన్నకొమారునకు వివాహముచేయ నిశ్చయించుకొన్న కన్య నాపుటకు వీలులేదనియు, నాకన్య దమకుఁ గావలసినయెడలఁ దక్షిణమే కన్యాశుల్కముగా నియ్యనిశ్చయించుకొన్న సొమ్మిప్పించి వివాహము నిశ్చయించుకొనవలసినదనియుఁ, దనకప్పుడే యింటియొద్దనుండి యుత్తరమువచ్చినదనియుఁ గామన్నతోఁ జెప్పి, యొకయుత్తరమాతనికిఁ జూపించి తానాపట్టణమునకువచ్చినవేళ యత్యుత్కృష్టమైనదనియుఁ, దనయన్నకొమార్తెకును గొమారునకును వివాహములు సమకూరెననియుఁ, నామఱునాడు వివాహమైన తక్షణమే యింటికిఁబోయి తనయన్న కొమారుని వివాహార్థమియ్యవలసిన కన్యాశుల్కమిచ్చి యాసంబంధము నిశ్చయించుకొని వెంటనే దిరిగివచ్చెదననియుఁ, గామన్నతోఁ జెప్పెను. కామన్న దనవివాహము త్వరలోఁ గావలయునన్న యాతురతతో నుండుటచే నాబ్రాహ్మణుఁడాడిన మాటలను జక్కగా వినకఁ దనయత్తగారిని జూచి యామెతోఁగూడ నీసంగతంతయుఁ జెప్పి, వివాహమునకుఁ జేయవలసిన ప్రయత్నములన్నియు సోమన్నగారు చేయించుచున్నారనియు, వారి యింటికా సాయంత్రము నాలుగు గంటలకుఁ దప్పక కన్యను దీసికొని రమ్మనియుఁ గోరెను. కామన్న యత్తగారాతఁడుచెప్పిన మాటలు విని యా ప్రకారము నాలుగు గంటలకు సోమన్నగారి యింటికిఁ బిల్లను దీసికొని వచ్చెదనని చెప్పి, పెండ్లికొమార్తెయగు దనకూతున కభ్యంజనముచేయించి యొకక్రొత్తచీరయైనఁ గట్టఁబెట్టుట

కు నగరమ్రారాన్నై యుండినది కన్నీరుఁగార్చెను. అప్పుడు కామన్న పార్థసారథిబసకుఁ బరుగెత్తి కొన్నిరూపాయలు దీసికొని యొకక్రొత్తచీరెయు, రైకయు, బసపుకుంకమముఁ గొని పరుగుపరుగునఁ దిరిగివచ్చి తనయత్తగారికిచ్చెను. ఆమె వానియన్నియు గ్రహించి తనకొమార్తెను దీసికొనివచ్చి "నీమగఁడు నీకొఱకివియన్నియుఁ దీసికొనివచ్చినాఁడమ్మా" యని యాకన్యతోఁజెప్పి, దాని నభ్యంజనముచేయించి పెండ్లికొమార్తెను జేసి సాయంత్రమంద ఱుఁగలసి సోమన్నగారి యింటికి వత్తుమనెను. తరువాత కామన్న మొదలియారుగారి బసకు వెళ్ళి యచ్చటనున్న మొదలియారుగారిని వారిస్నేహితులనుఁ దనతెనివిదీరునట్లును వారికి నిసువుపుట్టునట్లును శ్లాఘించి సాయంత్రము నాలుగుగంటలకు సోమన్నగారియింటికి తప్పక దయచేయుఁడని కోరెను. కామన్న యాదినమంతయుఁ బార్థసారథిబసకును, మొదలియారుగారిబసకును, దానువివాహమాడ నిశ్చయించుకొన్న కన్యయున్న బసకును, సోమన్నగారి యింటికిని, నాయనవేశ్య యింటికిని దిరుగుచు మిక్కిలి యాతురతతోఁ గడపెను. మొదలియారు తానుగామన్న వివాహార్థ మియ్యవలసిన కన్యాశుల్కమునకుఁ దన తమ్ముండుజోడును దన స్నేహితులయొక్క వస్తువులను గొదువబెట్టి సొమ్మిచ్చినసంగతి బాయమ్మగారికించుకయుఁ దెలియలేదు. ఈసంగతియామెకుఁ దెలియుటకు వీరెవ్వరికి నిష్టములేకపోవుటచే వీరెవ్వరును బాయమ్మగారితోఁ జెప్పక నతిగోప్యముగా నుంచిరి. తమ సేవకులగు రాముఁడును గుప్పుసామియు రహస్యము దాఁచ నేరని యవివేకులును యుచితానుచితములను గ్రహింపఁజాలని యజ్ఞానులును గావున వారికీవిషయమును గూర్చి తెలియనియ్యఁగూడదని వీరునలుగురును జక్కఁగా గ్రహించిరి. కాని రాముఁడును గుప్పుసామియు మొదలియారుగారి యాతురతను గనిపెట్టియు వీరు నలుగురును జేరి గుసగుసలాడుచు రహస్యముగా మాటలాడుకొనుచున్న సంగతిని గ్రహించియు మొదలియారుగారంతకుఁ బూర్వమెన్నడు సారి బసకువచ్చి తనస్నేహితులతో నేమో రహస్యముగా మాటలాడి తక్షణమే తిరిగ పోవలనుఁబోయి రెండుమూడుగం

టలపులకింటికి రాకపోవుటయు నాలోచించియుఁ దన యజమానులేదో గృహస్థవ్యాపారమును దలపెట్టి తనకుఁ దెలియకుండఁ జేయుచున్నారని మాత్రము నిశ్చయించుకొని దృఢముగా నమ్మెను. కామన్న వివాహమునకియ్యవలసిన కన్యాశుల్కమునకుగావలసిన ద్రవ్యమును వీరు తమవస్తువులను గొదువపెట్టి సహాయముచేసిరని రామునకుగాని కుప్పుసామికిఁగాని యించుకయుఁ దెలియదని మనము నిశ్చయముగాఁ జెప్పఁగలము. బాయమ్మకుఁగాని కాంతయ్యపాత్రునకుఁ గానియీవిషయమును గూర్చి తెలియనే తెలియదు. బాయమ్మగారాదినమున స్త్రీల సభలోఁ జదువుటకేర్పఱచుకొన్న స్త్రీవిద్యనుగూర్చియు స్త్రీల స్వాతంత్ర్యతను గూర్చియు నొకవ్యాసమును వ్రాయుచుఁ దనభర్తతోఁగాని శ్రీనివాసముతోఁ గాని మాటలాడుటకైనవ్యవధిలేక పనిచేయుచుండుటచే నీవిషయమునుగూర్చి యించుకయైన ననుమానపడుటకైన నామెకు వీలుగలిగినదికాదు.

తరువాత సాయంత్రము నాలుగుగంటలు గాకపూర్వమే పార్థసారథియుఁ గామన్నయు సోమన్నగారి యింటికిఁబోయిరి. సోమన్నగారప్పటికింకను దనవేశ్యయింటనుండి రాకపోవుటచేఁ గామన్న ఆయనకొఱకావేశ్యాగృహమునకుఁ బోయెను. పార్థసారథి మొదలియారు మొదలగు స్నేహితులను సోమన్నగారియింటికిఁ దీసికొనివచ్చుటకు వారిబసకుఁ బోయెను. మొదలియారుగారి బసకీతఁడు వచ్చునప్పటికినలుగురును సోమన్నగారియింటికిఁ బయనమై పోవ ప్రయత్నమున దుస్తులను దొడుగుకొనుచుండిరి. పార్థసారథిని జూచినతోడనే వీరు మిక్కిలి గౌరవముతో నాహ్వానించి కొంచెమైన నాలస్యముచేయక యాతనితో బయలుదేఱి సోమన్నగారియింటికివచ్చిరి. కాని సోమన్నగారును గామయ్యాయు నింకను రాకపోవుటచే నీయైదుగురును గలసి మాటలాడుకొనుచు సోమన్నగారియింట వీధిసావడిలోఁ గూర్చుండిరి. సోమన్నకొఱకు గామన్న యొకగంటవఱకు నావేశ్యాగృహమున వేచియుండి యాయన యాగృహమునఁ జేయుచున్న గృహకృత్యముల నెల్ల నెఱవేర్చి ఫలహారము చేసినతరువాత నాయనతోఁ గలిసి సోమన్నగారియింటికి వచ్చునప్పటికైదు గంటలు దాఁటినది.

అప్పుడు సోమన్నగారితోఁ గలసి వీరందఱు గామన్న వివాహము నిమిత్తము చేయవలసిన యేర్పాటులనెల్ల చేసిరి. కామన్న వివాహమాడ నిశ్చయించుకొన్న కన్యయు, నాకన్య తల్లియుఁ, బినతండ్రియు, నింతకుఁ బూర్వమే వచ్చి సోమన్నగారి భార్యతో మాటలాడుచు లోపలఁగూరుచుండిరి. సోమన్నగారు వచ్చినతరువాతఁ బెండ్లికూఁతును దీసికొనివచ్చి యా పినతండ్రి సోమన్నగారికి నమస్కరింపఁజేసి తాను వివాహమైనవెంటనే యింటికిఁ బోయి తన యన్నకొమారునకు గన్య నియ్యవచ్చి యున్నవారి కియ్యవలసిన కన్యాశుల్కమిచ్చి వివాహము నిశ్చయపఱచుకొని యొకటిరెండు దినములలోఁ దిరిగివత్తుననియు, నంతవఱకుఁ దన వదినెయుఁ బెండ్లికొమార్తెయు నాపట్టణముననే యుందురనియుఁ, జెప్పెను. తన వివాహమైనతరువాత నాతఁడెక్కడకుఁ బోయినను దనకు నిమిత్తములేదని కామన్న యాతఁడు చెప్పినదానికెల్ల నొప్పుకొనెను. మొదలియారు మొదలగు నీనలుగురును బార్థసారథియుఁ దప్పక నామఱునాఁడే వివాహము నిరాటంకముగా జరుగు సాధనములను సమకూర్చి వివాహప్రయత్నములనెల్ల సత్వరముగాఁ జేయింపుఁడని సోమన్నగారిని ద్వరపెట్టిరి. సోమన్న వివాహమునకుఁ గావలసినవన్నియు సమకూర్చుట కొప్పుకొని యామరునాఁడు రాత్రి 8 గంటలకు ఆదికేశవస్వామి యాలయములోఁ గామన్నకు వివాహము చేయించుటకుఁ జేయవలసిన యత్నములన్నిటిని మిక్కిలి శ్రద్ధతోఁ జేయింప నారంభించెను. తరువాత వీరందఱు గలసి కామన్న వివాహమునుగూర్చి చేయవలసిన యేర్పాటులవిషయమై మాటలాడుకొనిరి. అంత సోమన్న పార్థసారథిని మొదలియారు మొదలగు నీనలుగురిని దీసికొని తన వేశ్యయింటికిఁ బోయెను. కామన్న తన యత్తగారితోను బినమామగారితోను బెండ్లికొమార్తెతోను వారి బసకుఁబోయి యచట నొకటిరెండు గంటలు వారితో ముచ్చటలాడుచుఁ గడపి సోమన్నగారి యింటికిని, నాతఁడచ్చట లేకపోవుటఁ బట్టి యాతని వేశ్యయింటికిని బోయి రాత్రి పదిగంటలకుఁ దనబసఁ జేరెను.

పార్థసారథి తనకుఁజేసిన సహాయమునకును గార్యావసరమునకు సొమ్మునగ్గుబాటుచేసిన మహోపకారమునకును నావేశ్యను శ్లాఘించి మొదలియారుగారి స్నేహపాత్రతను గూర్చియుఁ బరోపకారబుద్ధినిగూర్చియు మిక్కిలి కొనియాడెను. మొదలియారుగారు స్నేహితులొండొరులను సహాయము చేసికొనకపోయినచో వారిస్నేహమువలనఁ బ్రయోజనమేమియు లేదనియు, నన్యోన్యసహాయము స్నేహమునకుఁ బ్రధానలక్షణమనియుఁ జెప్పిరి. కన్యాదానఫలమత్యుత్కృష్టమని శాస్త్రములు ఘోషించుచున్నవనియు వివాహకార్యమునకు సహాయముచేయుట మిక్కిలి పుణ్యమనియు గార్యావసరసమయమునకు సొమ్ము సగ్గుబాటుచేసి సోమన్నగారును నాతోవేశ్యయుఁ నాపుణ్యమునుగట్టుకొన్నారనియుఁ శెట్టిగారు సెలవిచ్చిరి. పిళ్ళగారును, నాయుఁడుగారును, సోమన్నగారి వేశ్యయొక్క యుచితజ్ఞతకును, గామన్న వివాహమునకుఁ జేసిన సహాయమునకును మిక్కిలి సంతోషించుచు మాటలాడిరి. సోమన్నగారు తనవేశ్యయొక్క సత్స్వభావమును గూర్చియుఁ, దనకొమార్తెల యమాయికవ్యాపారమునుగూర్చియు ననేకవిధములుగాఁ జెప్పిరి. మఱియుఁ దనవేశ్య వివాహమాడిన కులస్త్రీలకన్న నత్యుత్కృష్టమైన సచ్ఛీలముగలదనియు, వేశ్యాకులమునజన్మించిన లోపమొక్కటి తప్ప దానియందేదోషములును లేవనియు, జాతికన్న గుణమే ప్రధానమనియుఁ దనకొమార్తెలిద్దఱును గుణసమృద్ధియందును, సచ్ఛీలములందును, నద్వితీయులనియుఁ, దనకొమార్తెలనుగూర్చితాను జెప్పుకొనుట మంచిదికాదనియుఁ జెప్పి వారిని బాల్యదశనుండియుఁదాను విశేషశ్రమకోర్చి పెంచినవిధమును, వారి సౌకుమార్యమును, అమాయికవ్యాపారమును, వివేకమును, దెలివిని, ఉచితానుచితజ్ఞానమును యథేచ్ఛముగాఁ గొనియాడెను. తరువాత సోమన్న తనకొమార్తెలు ప్రతిదినమును దాను స్వయముగా నన్నము గలిపిపెట్టినఁగాని దినకుండినంత ప్రేమానురాగములు దనయందుఁ గలిగియుండుటచే వారికిఁ దానే స్వయముగా నన్నముపెట్టి పెంచుచున్నాననియు, దాను స్వయముగా వారియుపచారముల నెల్లఁ జే

సినగాని వారికిఁ దృప్తికరముగా నుండకపోవుటచేఁ దమ శరీరసౌఖ్యములను గూడఁ ద్యజించి తనకొఱకు మిక్కిలి బెంగతోఁ గనిపెట్టుకొని దిక్కులు చూచుచు గూరుచుండునంతటి యమాయికులు గావున వారిబాధ్యతంతయుఁ దనయందేయున్నదనియుఁ, దాను బ్రతికియున్నంతవఱకు వారికేలోపమును రాదనియు, దన యనంతరము వారెట్లు జీవింతురో తెలియదనియు, నంతకును దైవమేయున్నాఁడనియుఁ, జెప్పి తన యనంతరము తనకొమార్తెల యసహాయత్వమును దలఁచుకొని యతిదీనముగా గద్గదస్వరముతోఁ గన్నీరించుక గార్చుచుఁ బలికెను. మొదలియారుగారును, శెట్టిగారును సోమన్నగారి క్షేమమకు మిక్కిలి సంతోషించిరి. సోమన్నగారి వేశ్య యీమాటలన్నియు విని తనకొమార్తెలను లేనిపోని గారాబముతో నెత్తి నెక్కించుకొని తిరుగుచుఁ బాడుచేయుచున్నారనియు, వారాటపాటలనేమఱి మూర్ఖులై పాడగుటకుఁ గూడఁ గారణభూతులగుచున్నారనియుఁ, దనకొమార్తెలు గొంచముగనో గొప్పగనో పూర్వజన్మమున విద్యాదానము చేసి పుట్టిన హేతువునుబట్టి స్వభావమువలనఁ దెలివిగలవారుగనుకఁ దండ్రి వారికెంత చనువుచేసినను గొంచెము సంగీతము నేర్చుకొని చక్కఁగాఁ బాడనేర్చిరనియుఁ, దనభర్తను సాదించెను. పిళ్ళగారును, నాయుఁడుగారును నావేశ్యల సంగీతమెన్నఁడు వినియుండకపోయినను వారు సంగీతశాస్త్రపారంగతలనియే నమ్మియుండిరి. శెట్టిగారు సంగీతవిద్య గాంధర్వాంశ గలిగి పూర్వజన్మసుకృతము గలవారికిఁగాని యన్యుల కలవడదనిరి. ఇట్లు వీరందఱు రాత్రి యెనిమిదిగంటలవఱకు మాటలాడుకొని యెవరి యింటికివారు పోయిరి.

కార్యావసర ముచితానుచితములను గ్రహింపఁజేయ నేరదు గదా! జనులు దాము కార్యావసరమును బట్టి యవలంబించిన మార్గముచితమైనదో యనుచితమైనదో తామాయవసరమును బట్టి కార్యసానుకూలము కొఱకుఁ బన్నిన యుపాయములవలనఁ దమకు నష్టము సంభవించునో లాభముగలుగునో తోఁచుట దుర్ఘటముగదా! కపటస్వభావముగల దుర్మార్గులగు కుచ్ఛితులు జనుల కార్యావసర

సమయమును బట్టి యెన్నెన్ని మాయోపాయములనైనఁ బన్ని వారినివంచించి లేనిపోని బాధలకుఁ బాలుచేయుచుందురు గదా! ఎంతటి బుద్ధిశాలులకయి నను దూరాలోచనపరులకైనను గార్యావసరమును బట్టి యొకానొకప్పుడు వివేక మడుగంటును. దుర్మార్గులగు కుచోద్యుల మాయోపాయములను గనిపెట్టుట మిక్కిలి కష్టము. ధనాశ యెంతెంత కార్యములనైనఁ జేయించును. అమాయికత్వమును, సహిష్ణుత్వమును, నమ్మికయు, శక్తివానికిని జేతఁగానివానికిని సహజలక్షణములని కార్యశీలురగు కుచ్ఛితులు దలపోయుచుందురు. ప్రపంచస్వభావమును జనులస్వభావములను గనిపెట్టుటకన్నఁ గష్టసాధ్యమైన పనియింకొకటిలేదు. సమయోచిత జ్ఞానమెంత శ్లాఘాపాత్రమైన దైనను జనుల నెవ్వరిని గూడనమ్మక విశ్వాస ముంచకయు లేక ప్రవర్తించుచు నష్టలాభముల నందుటకన్న విశ్వాసము గలిగి నమ్మి నష్టముల పాలగుటయే యుచితమని కొందఱూహించుచుందురు. ప్రపంచమంతయు దుర్గుణభూయిష్ఠమైనదనియుఁ జనులందఱు విశ్వాసానర్హులనియుఁ దలఁచుచు జాగరూకతతోఁ బ్రవర్తించి లాభమందుట కన్న ప్రపంచమునుగూర్చియు జనులనుగూర్చియు సదభిప్రాయముతో సంచరించి నష్టముల పాలగుటవలన జనులకు హృదయశాంతియు మనస్సంతుష్టియుఁ గలుగును. పరుల యింగితము గ్రహింపఁగలుగుట మిక్కిలి కష్టసాధ్యము. కపటకల్మషము లెఱుఁగక విశ్వాసముతో నమ్మిన స్నేహితులే మాయాశీలురై కుచోద్యముగలిగి వంచించి మోసముచేసినచో నెవ్వరేమి చేయఁగలరు. అట్టి జనులనునమ్మించి వంచించిన మోసకారులను ఘాతుకులను విషసర్పములవలెను క్రూరవనసత్త్వములవలెను పరిగణించి మనుష్యసంఘమునుండి బహిష్కారము చేసి క్రూరవన్యములవలెను విషసర్పములవలెను రూపుమాపఁ బ్రయత్నించుట ధర్మముగాని యట్టివారి వాతఁబడి కష్టముల పాలయిన యమాయికస్వభావముగల సాధుజనులను బ్రాపంచికజ్ఞానరహితులనియుఁ, జేతఁగానివారనియు నెంచి తూలనాడుట ధర్మముగాదు. మాయోపాయము గలిగి స్వార్థపరాయణులై సంచరించు చతురులను గార్యసాధకులనియుఁ, బ్రయోజకులనియుఁ, బ్రాపం

చికజ్ఞానపరిపూర్ణులనియు, వివేకులనియు శ్లాఘించుచు సమాయకవృత్తితోఁ ద మదారినిదాము పోవుచుఁ దాము నొచ్చినను నొరుల నొవ్వఁజేయనొల్లక సాధుచిత్తముతోఁ గాలము గడపు వారి నవివేకులనియు, వెఱ్ఱివారనియుఁజే, తఁగాని నిర్భాగ్యులనియుఁ బరిగణించుచుండుట ప్రపంచధర్మముగాఁ గనుపించుచున్నది. మఱియుఁ "జెల్లియుండియు సైరణసేయునతఁడుఁ। బేదవడియును నర్థికిఁ బ్రియముతోడ। దనకుఁగల భంగినిచ్చునతండు పుణ్య। పురుషులని చెప్పిరార్యులు బుధవరేణ్య" యనియు "ఒరులేయవి యొనరించిన। నరవరయప్రియము దనమనంబున కగుఁ దా। నొరులకు నవి సేయకునికి। పరాయణము పరమధర్మపథములకెల్లన్" అనియు భారతమునఁ జెప్పఁబడిననీతి వాక్యములకు విరుద్ధముగా సైరణచేయుటయు స్వార్థత్యాగమును విడనాడి పరోపకారమొనర్చుటయుఁ దమ్ము బాధించు దుర్మార్గులకుఁ బ్రతిక్రియాపూర్వకముగా నపకారమాచరింపకుండుటయుఁ బ్రాపంచికజ్ఞానరహితులును నవివేకులును నగు చేతఁగాని వారి సహజలక్షణములని యెంచుచుండుట ప్రపంచధర్మముగాఁ గనుపించుచుండుట మిక్కిలి శోచనీయముగదా!

చదువరులెట్లుతలఁచినను, యేమని నిశ్చయించుకొన్నను, మన కథానాయకులగు మొదలియారు మొదలగు నీనలుగురును దమకు సంప్రాప్తమైన మాయాశీలురగు కపటస్నేహితుల వలన నెంతమోసముఁ జెందినను, యెంతెంతకష్టములకుఁ బాలగుటఁదటస్థించినను, నుత్తమోత్తములనుట కెంతమాత్రమును సందియములేదు. లోకలుభంతు సత్రము దగ్గిర స్వకాయకష్టముచే జీవించుచు సాధువృత్తిచేఁ గాలముగడుపుచున్న యాకాపువానికినిఁ బ్రపంచజ్ఞానము లేక మిక్కిలియమాయిక స్వభావముతో నున్న నొరెఱుఁగని యాతని కొమార్తెలకును దుర్భరమైన యపకీర్తియు, నమితమగు నష్టమును దెచ్చిపెట్టి వారి యుల్లములను క్షోభింపఁజేసిన కామన్నదుశ్శీలుఁడనియుఁ, గుచ్ఛితుఁడనియు, నవినీతుడనియు, మొదలియారును, శెట్టిగారును, గాకపోయినను, బిళ్లగారునునాయుఁడుగారునైన గ్రహించియుండియుండకపోరు. అతనియపాత్రతఁ గ్రహింపఁ

గలబుద్ధియు వివేకమునుగూడ మనకథానాయకులు నలుగురికిని గూడ లేకపోలే దని మనము నిశ్చయముగా నమ్మవలెను. మఱియుఁ గన్యాశుల్కమునను విక్రీతగాఁ జేయఁ దీసికొని రాఁబడిన యీ బ్రాహ్మణకన్యకను గన్యాశుల్కమిచ్చి వివాహముచేసికొనుట యధర్మమనియు, కేవలము దూష్యవ్యాపారమనియు, నిగ్రహించి హృదయపూర్వకముగా నమ్మియున్నవారని యిదివఱకే చెప్పఁబడియున్నది. అయినను, వీరు తమకు రాఁబోవు నష్టములను, కష్టములను, నపకీర్తిని, నించుకైన గణింపకఁ దమకొసఁగఁబడియున్న విలువగల వస్తువులనుగూడ నించుకైన సంగ్రహింపక నూడఁ జెత్తికెఁబోయిన వేశ్యయొద్దఁ గొదువఁబెట్టి కాపున్న వివాహవనమును గన్యాశుల్కమునకు ధనసహాయముఁ జేయఁబూనుకొనుట కేవలము వీరికన్యాసహాయత్వమును, బరోపకారవ్యాపారమును, సాధువృత్తియు, నమాయికత్వమును, స్నేహపాత్రతయు, నమ్రతయు, సహృదయత్వమును, దక్క మఱియేమియుఁ గారణములుగావని మనము త్రికరణశుద్ధిగా నిశ్చయముగా నమ్మవలసియున్నది. ప్రపంచానుభవముగలిగి సముచిత ప్రజ్ఞాధురంధరులై జాగరూకతతో సంచరింపఁగల చతురులీ మహనీయులని శాస్త్రవారనియుఁ బనికిమాలిన నిర్భాగ్యులనియుఁ బరులచే నతిసులభముగా వంచింపఁబడి మోసపడు నైసర్గిక గుణముగలవారనియుఁ, దలఁచినను హృదయధర్మములను బట్టి వీరమాయికస్వభావమును సాధువృత్తియుఁ బరోపకారచింతయు, సహిష్ణుత్వము, స్నేహపాత్రతయుఁ గల యుత్తమోత్తములగు మహనీయులని మనమొప్పుకొనక తీరదు.

